# చతుర

314వ సంచిక
మార్చి 2004 * రూ.7/-

పాఠకులకు
ఉగాది
శుభాకాంక్షలు

## మృగ-తృష్ణ

తులసి బాలకృష్ణ

# చతుర ప్రపంచం

## మార్బుల్‌కింగ్

గోళీలాడకుండా చాలామంది బాల్యం గడవదంటే అతిశయోక్తికాదు. పిల్లలకి బాగా ఇష్టమైన ఆట ఇది. కానీ అమెరికాలో పిల్లలేకాక పెద్దలు కూడా గోళీలాడతారు. గోళీలాటలో దేశవ్యాప్తంగా పోటీలు జరిగి ఏటా ఒకర్ని మార్బుల్ కింగ్‌గా ఎన్నుకుంటారు.

అమెరికాలోని 300 నగరాల్లోని స్కూళ్లల్లో, పార్కుల్లో 'మార్బుల్ కింగ్ నేషనల్ టోర్నమెంట్'లో ఎనభై లక్షలమంది పిల్లలు, పెద్దలు పాల్గొంటారు. 300 నగరాల్లో గెలిచినవారిమధ్య మళ్లీ పోటీ జరుగుతుంది. జూనియర్స్‌కి, సీనియర్స్‌కి మధ్య ప్రత్యేక పోటీలు జరుగుతాయి. జూనియర్స్ అంటే 8-16 మధ్య వయసువారు. సీనియర్స్ అంటే 17కి పైబడ్డ వయసుగలవారు. ఆఖరి పోటీ న్యూయార్క్‌లోని సెంట్రల్ పార్క్‌లో ఏటా జూలైలో జరుగుతుంది.

ఈ పోటీల్లో పాల్గొన్నవారికి 12,000 గోల్డ్ ప్లేటెడ్ ట్రోఫీలు, 18000 గోల్డ్, సిల్వర్, బ్రాంజ్ మెడల్స్, 1,50,000 టీ షర్టులు బహుమతులుగా ఇస్తారు. ఇవేకాక పోటీలో ఓడిపోయినా ఆటలో చక్కటి నైపుణ్యాన్ని చూపించినవారికి మెరిట్ సర్టిఫికెట్లు ఇస్తారు.

అమెరికాలో గోళీలాటని ప్రాచుర్యంలోకి తెచ్చింది బెర్రీపింక్ అనే అతను. చిన్నప్పటి నుంచీ గోళీలాట అంటే ఇష్టపడే ఈ ఆజన్మ




బ్రహ్మచారి పెద్దయ్యాక గోళీలను తయారుచేసి అమ్మే వ్యాపారంలోకి ప్రవేశించాడు. అంతదాకా గోళీలు తయారుచేయడం కుటీర పరిశ్రమగా వుండేది. ఒకరు తయారుచేసిన గోళీలతో ఇంకొకరు తయారుచేసే గోళీలు తీసుకుని ఆడ్డం సాధ్యమయ్యేదికాదు. అన్నీ

ఒక పరిమాణంలో వుండేవికావు.

దాంతో బెర్రీపింక్ గోళీల తయారీని భారీ పరిశ్రమగా రూపొందించి, రోజుకి 35 లక్షల గోళీలను తయారుచేసే యంత్రాన్ని రూపొందించాడు. మొదట అమెరికా అంతటా శాఖలువున్న వూల్‌వర్త్ అనే చెయిన్ స్టోర్‌కి వాటిని సరఫరాచేశాడు. తర్వాత మిగిలిన పెద్ద చెయిన్ స్టోర్ జె.సి. పెన్నీకి, మరికొన్ని స్టోర్స్‌కి సరఫరాచేశాడు.

సిలికేట్ శాండ్, సోడా, లైమ్, ఫిల్మ్‌స్టార్ అనే నాలుగు ముడిపదార్థాలతో 2800 డిగ్రీల ఫారిన్ హీట్ ఉష్ణోగ్రతలో కరిగించి, కలిపి వాటిని అచ్చుల్లో పోయడం ద్వారా బెర్రిపింక్ ఫ్యాక్టరీనుంచి వచ్చే గోళీలు మిగిలిన గోళీలకన్న బలంగా, ఆడడానికి సమర్థవంతంగా వుంటాయి. నీలం, ఎరుపు, పసుపు అన్ని రంగుల మిశ్రమాలలో గోళీలను తయారుచేశారు. అయితే అమెరికన్ పిల్లలకి ఎర్రరంగు గోళీలంటే ప్రీతి.

అమెరికాలో గోళీల అమ్మకాలు పెంచడానికి గోళీల ఆటల పోటీలను ఏర్పాటుచేసి నిర్వహించింది బెర్రీపింకే. ఇందుకోసం తన లాభాల్లోంచి పదిలక్షల డాలర్లు ఖర్చుచేసేవాడు. అంతేకాక తను తయారుచేసిన గోళీల్లోని పదిశాతం వుచితంగా పిల్లలకి దానం చేసేవాడు.

ఓసారి లాస్ ఏంజెలెస్‌లోగల అమ్మకాలు తక్కువగా వున్నాయని గ్రహించి ఏభైయ్యేసి గోళీలున్న 3,000 సంచులను లాస్‌ఏంజెలస్‌లోని స్కూళ్ల బయట కారాపుకుని ఉచితంగా పిల్లలకి దానంచేశాడు. దాంతో అక్కడి పిల్లలకి ఆ ఆటమీద మోజు పుట్టింది. ఆ ఊళ్లో గోళీల అమ్మకాలు బాగా పెరిగాయి.

ఇలా అమెరికా అంతటా బెర్రీపింక్ స్వయంగా తిరిగి కొన్ని కోట్ల సంఖ్యలో గోళీలను ఉచితంగా పంపిణీ చేశాడు. ఓ ఏడాది గోళీల తయారీకయ్యే ఖర్చుకన్నా తక్కువ నష్టంతో గోళీలను అమ్మాడు. అలా అమెరికాలో పిల్లలకి గోళీలాటమీద మక్కువ, పెద్దలకి పోటీలో పాల్గొనే ఉత్సాహం కలిగించింది బెర్రీపింకే.

ఇతని ఆడిటర్స్ ఓసారి తయారు ఖర్చు కన్నా ఎందుకు తక్కువకి అమ్ముతున్నారని ప్రశ్నిస్తే "అవి చవకలో అందుబాటులో వుంటే ఆడేవారికి కలిగే ఆనందాన్ని డాలర్లలో కొలవలేము. ముఖ్యంగా పిల్లలకి" అని జవాబిచ్చాడతడు.

ఇవికాక అతడి గాజుఫ్యాక్టరీలో గాజు బాటిల్ మూతలు, విస్తృత ప్రకటనల్లో ఉపయోగించే మనిషెత్తు బాటిల్స్, మీనియేచర్ బాటిల్స్, ఇంకా... ప్రత్యేక గోళీలు తయారుచేయడం ద్వారా అతనికి లాభం బాగా వస్తుంది. దాంతోనే అతను తృప్తిపడతాడు. ప్రత్యేక గోళీలను ప్రకటనలలో (సైన్‌బోర్డ్‌లలో) వాడతారు. చీకట్లో కారు హెడ్‌లైట్లు వాటిమీద పడగానే మెరుస్తూ ఆ ప్రకటన స్పష్టంగా కనిపించే సైనుబోర్డులవి.

బేరిపింక్ ఇప్పుడులేడు. అతను పరమపదించినా అమెరికాలో గోళీల ఆట ఈరోజుకీ బతికి వుండేలాచేసిన ఘనత అతనికి చెందుతుంది.

---

## తడిలేని పొగమంచు

బ్లాక్ అండ్ వైట్ పౌరాణిక సినిమాల్లో, సామాజిక చిత్రాల్లోని డ్రీమ్ సీక్వెన్స్‌ల్లో కిందనుంచి తెల్లటి పొగ రావడం మనం అనేకసార్లు చూస్తాం. అదేమిటో చాలామందికి తెలియదు.

దాన్ని డ్రై ఐస్ అంటారు. దీన్ని త్వరగా పాడయిపోయే ఆహార పదార్థాలు (ఐస్‌క్రీం లాంటివి) పాడవకుండా ఉండటానికి వాడతారు. మంచు అయినా ఇది నీటినుంచి తయారయినదికాదు. కార్బన్ డయాక్సైడ్‌తో ఈ పొడిమంచును చేస్తారు. ఆ

వాయువును ముందు బాగా చల్లబరుస్తారు. దాంతో అది ద్రవంగా మారుతుంది. ఆ ద్రవం ఆవిరి అవగానే గట్టిపడి మంచులా తయారవుతుంది. ఆ మంచుని గడ్డలుగా చేస్తారు. అయితే ఇది కరిగితే మాత్రం ద్రవంగా మారకుండా, సరాసరి వాయువుగా రూపాంతరం చెందుతుంది. సినిమాల్లో మేఘాల్లా మనం చూసేది ఈ వాయువునే.

మామూలు ఐస్‌ను ముట్టుకుంటే మన చేతులు కొంకరపోతాయి. కానీ డ్రై ఐస్‌ని ముట్టుకుంటే మాత్రం వేళ్లు కాలిపోతాయి. ఇది బహు ప్రమాదకరమైన మంచు. ఎవరైనా దీన్ని తింటే అవయవాలు కాలిపోయి, మరణం కూడా సంభవిస్తుంది. అందుకే దీన్ని ప్రత్యేకమైన లోహ పాత్రలలో తరలించాల్సి వుంటుంది.

డ్రై ఐస్‌ని ఓ అమెరికన్ శాస్త్రవేత్త కనిపెట్టాడు. అయితే దాని ఉపయోగం ప్రధానంగా ఐస్‌క్రీం పరిశ్రమలో, పళ్లు నిలవచేసే పరిశ్రమల్లో వున్నా హాలీవుడ్ సినిమా పరిశ్రమ దీన్ని సెట్లో వాడే ఉపయోగాన్ని కనిపెట్టింది. డ్రై ఐస్ వేడెక్కి వాయువుగా మారాక అది నెమ్మదిగా తెల్లటి రంగుతో పైకి లేస్తుంది. స్వర్గంలాంటి అలౌకిక సెట్లలో దీన్ని వాడటం ద్వారా ప్రేక్షకులకి నిజంగా స్వర్గమే అనిపించే భావనని ఆ తెలుపురంగు కార్బన్‌డయాక్సైడ్ వాయువు కలిగిస్తుంది. ఇప్పుడు హాలీవుడ్‌లోకానీ, భారతీయ సినిమాల్లోకానీ డ్రై ఐస్‌ని ఉపయోగించడంలేదు. ఈటీవీలో ప్రతి ఆదివారం ఉదయం 9.30కి ప్రసారం అయ్యే భాగవతంలో అనేక చోట్ల దర్శకుడు బాపు ఈ డ్రై ఐస్‌ను ప్రతిభావంతంగా వాడారు.




మానవదేహంనుంచి వేరుచేసిన లివర్, గుండెలాంటి అవయవాలను నిలవవుంచి తరవాత అవసరమయిన రోగికి అమర్చడానికి కూడా డ్రై ఐస్‌ని వాడుతున్నారు. ఓచోట నుంచి మరోచోటికి ఆ అవయవాలని తీసుకెళ్లడానికుపయోగించే పెట్టెల్లో డ్రై ఐస్‌ని నింపి అవి పాడవకుండా కాపాడుతున్నారు. రాకెట్‌ని అంతరిక్షంలోకి పంపే ప్రయోగంలో కూడా డ్రై ఐస్‌ని విరివిగా ఉపయోగిస్తున్నారు.



చతుర

314వ సంచిక
మార్చి: 2004 సంపుటి: 27 సంచిక: 2



**ప్రజలందరూ మనసా కోరుకుని ఆయన్ని నగర మేయర్‌గా ఎన్నికచేశారు. జయజయ ధ్వానాలతో ఆయన్ని ఆకాశానికెత్తేశారు.**

"మన ప్రియతమ నాయకుడు నిస్వార్థప్రజా సేవకుడు. మనం హాయిగా నిద్దర్లుపోయి, పొద్దెక్కాక నిద్రలేచి చూసేసరికి ఇళ్లముందున్న మురికికాలవ ల్లోని చెత్త తీస్తూ కనిపించి, మనం సిగ్గుతో తలలు వంచుకునేలా చేసిన మహామనీషి" అని మైకుల్లో ఆనందోత్సాహాలతో ఉపన్యాసాలు జరుగుతున్నాయి.

**ఈరోజు ఆకాశానికెత్తేసే ఈ ప్రజలే రేపు చిన్న తేడావస్తే అథఃపాతాళానికి తొక్కేయగలరనే సత్యాన్ని ఎప్పటికప్పుడు గుర్తుచేసుకుంటూనే... పదవిని చేపట్టిన ఆ ప్రజాభిమానికి ప్రారంభంలోనే ఎదురయిన పెద్ద సమస్య ఎలాంటిది? ముళ్ల కిరీటంలాంటి పదవి చివరికి ఆయనకి ఎలాంటి అనుభవాన్నిచ్చింది?**

**స్వార్థరాజకీయాలకి సాహితీరూపం**

తులసి బాలకృష్ణ రచన

# మృగ-తృష్ణ

ఈ నెల చతుర సమగ్ర నవల.

M K

జనం... జనం... జనం...

గుంపులు గుంపులుగా... జట్లు జట్లుగా జతలు... జతలుగా...

ఎటుచూసినా... జనం... జనం... జనం.

కొందరు వలయాకారంలో వరండాలో కూర్చుని తీవ్రంగా చర్చించుకుంటున్నారు. కొందరు జట్లు జట్లుగా గోడలకి స్తంభాలకి జార్లబడి, నిశ్చింతగా మాట్లాడుకుంటున్నారు. కొందరు జతలు జతలుగా లాన్స్‌లో ఒరిగిపోయి, గుసగుసలుగా మాట్లాడుకుంటున్నారు.

నిమిషాలు... గంటలు గడుస్తున్నాయి.

ఫలితం తెలిసిపోయిందే అయినా, ఖచ్చితమైన తుదిఫలితం ప్రకటించేవరకూ అందర్లో అసహనం, ఆతృత, ఆందోళన.

ఇంతలో-

మైకులో అనౌన్సరు గొంతు సవరించుకున్న ధ్వని.

ఒక్కసారిగా ఆవరణంతా నిశ్శబ్దం... అందరూ చెవులు రిక్కించి, ఊపిరి బిగపట్టి, మోరలు చాచి...

"నగరమేయర్ పదవిని శ్రీకళ్యాణ చక్రవర్తి గెలుచుకున్నారు" అన్న మాటలు శ్రావ్యంగా చెవుల్లో పడుతూనే ఆవరణంతా ఉవ్వెత్తున లేచిన జనంతో సముద్రతరంగాలని మరిపించింది. వెర్రి ఆనందంతో వాళ్లు చేసిన జయజయధ్వానాల ధ్వని మిన్నుముట్టింది. వాళ్ళు గుప్పిళ్లతో విరజిమ్మిన బుక్కారంగులు అనేక ఇంద్రధనుస్సుల్ని సృష్టించాయి. పగలే వెన్నెల కాసింది. దీపావళి దిగి వచ్చింది. అందరి ముఖాల్లో సంక్రాంతి వెల్లివిరిసింది.

అభిమానుల భుజాలమీద బిడియపడ్తూ కూర్చుని, అందరికీ చేతులు జోడించి నమస్కరిస్తూ, తడిసిన కళ్లతో ప్రేమగా చూస్తూ, వినయంతో చేతులు వూపుతూ, చిరునవ్వులు చిందిస్తున్న కళ్యాణచక్రవర్తికి అందరూ గొంతులు చిరిగిపోయేలా, చెవులు గింగిర్లెత్తేలా జేజేలు పలికారు. అతని నొసట నిలువుగా విజయతిలకం దిద్ది, పూలు జల్లారు. అభిమానంతో పూలహారాలు వేసి, చేతుల్ని, పాదాల్ని కళ్లకద్దుకున్నారు. వాళ్ళ అభిమానానికి సిగ్గుతో ముడుచుకుపోతున్నాడు కళ్యాణచక్రవర్తి. అందరివైపు కృతజ్ఞతతో చూస్తూ, నమ్రతతో తల ఆడించసాగాడు.

ఇంతలో పూలరథంలా అలంకరించబడ్డ జీపు రావడం, కళ్యాణచక్రవర్తిని అందులో నిలబెట్టడం జరిగింది. కొంతమంది ముఖ్యులు కూడా తోసుకోకుండా, కుమ్ముకోకుండా ఆయన్తోబాటే అందులోకి ఎక్కి, ఆయన పక్కన వెనగ్గా నిలబడ్డారు. ఆ ముఖ్యుల్లో ఒకరు ఆయన బావమరిది దీనబంధు. అతని ఆనందానికి అవధులు లేవు. రెచ్చిపోయి స్లోగన్లు ఇస్తున్నాడు. గొంతు చించుకుని కళ్యాణచక్రవర్తికి జేజేలు పలుకుతున్నాడు. జనంచేత పలికిస్తున్నాడు.

జీపు ముందుకు సాగింది హంస గమనంతో. ఆ వెనగ్గా మరిన్ని జీపులు, కార్లు, స్కూటర్లు, సైకిళ్లు అనుసరించాయి. పూలరథానికి ముందు విజయోత్సాహంతో బ్యాండు, గానాబజానా, కుర్రకారు డాన్సు స్టెప్పులూ జోరుగా సాగుతున్నాయి. ఆ కుర్రకారులో కళ్యాణచక్రవర్తి ఏకైక సంతానం కన్నబాబు, దీనబంధు కొడుకు నంది కూడా వున్నారు. కన్నబాబు ముఖంలో తండ్రి విజయం తాలూకు ఆనందంకంటే ఇతరుల్ని ఓడించి గెలిచామనే విజయగర్వం ఎక్కువగా కనిపిస్తోంది. బోర విరుచుకుని, చుట్టూ ఛాలెంజ్ చేస్తూ, కలియజూస్తూ, రెచ్చిపోయి గెంతులు వేస్తున్నాడు. నంది నాట్యంలో కళ వుంది, అమాయకత్వం వుంది.

రోడ్డుకి ఇరుపక్కలా స్త్రీ బాలాదిజనం బారులు తీరి నిలబడి కళ్యాణచక్రవర్తికి జేజేలు పలుకుతున్నారు. డాబాల మీద

నుంచి పూలని జల్లుతున్నారు. జీపుని అడుగు అడుగునా ఆపి, విజయతిలకం దిద్ది హారతులిస్తున్నారు. వాళ్ళనుంచి అందు కున్న దండల్ని ఆడపిల్లలకి, చిన్నపిల్లలకి అందిస్తున్నారు చక్రవర్తి.

బావగారితోబాటు అందరి దృష్టీ తనమీద కూడా పడేటట్లు విపరీతమయిన ఆంగీకాభిన యంతో తంటాలు పడుతున్నాడు దీనబంధు.

ముందుకు తోసుకొస్తూన్న జనసందోహాన్ని వాలంటీర్లు, పోలీసులు కంట్రోల్ చేస్తు న్నారు. పోలీసుల్ని ఎంతమాత్రం దురుసుగా ప్రవర్తించొద్దని చక్రవర్తి పదేపదే విజ్ఞప్తి చేస్తున్నాడు. వాలంటీర్లు క్రమశిక్షణతో వ్యవ హరిస్తున్నారు. వాలంటీర్లలో అందర్నీ ఎక్కు వగా ఆకర్షిస్తున్న వ్యక్తిమీద చక్రవర్తి దృష్టి పడింది. సుమారు ఆరడుగుల మూడంగు ళాల పొడుగు, ఒడ్డూ వున్న ఆ యువకుడు చలాకీగా, చాకచక్యంగా ముందుకు దూసుకొ స్తోన్న జనాన్ని కంట్రోల్ చేస్తున్నాడు. చిన్నపి ల్లలు నలిగిపోకుండా, అమాంతం ఇద్దరు ముగ్గుర్ని ఒక్కసారి భుజాలమీదకు ఎత్తు కుని, సురక్షిత ప్రదేశంలో వదిలివస్తున్నాడు. అతని చర్యలు చక్రవర్తికి ముచ్చట గొలి పాయి. అతని ముఖంలోని సంస్కారం, సభ్యత, వినయం చక్రవర్తిని ముగ్ధుణ్ణి చేశాయి. అతన్ని గతంలో తనెప్పుడూ చూసి నట్లు లేదు. నిస్వార్థంగా సేవ చేస్తూన్న మంచి వాలంటీరు, సోషల్ వర్కరూ కనిపిం చాడు అతన్లో. వెంటనే తన మెడలోని దండని తీసి, అతనివైపు విసిరాడు చక్రవర్తి. దాన్ని అలవోకగా అందుకుని, కృతజ్ఞతాపూర్వ కంగా ఒంగి నమస్కరించి ఆ దండని కళ్ళ కద్దుకుని, దాన్ని చిన్నపిల్లలకి ఇచ్చి, తన పనిలో నిమగ్నమయ్యాడు అతను. అతని పేరు ప్రకాశం.

బావగారితోబాటే దీనబంధు దృష్టి ప్రకా శంమీద పడింది. బావగారిని అతను ఆక ర్షించడం, దండని బహుమతిగా పొందడం గమనించాడు. ముఖంమీదకు నవ్వు తెరని లాక్కుని ప్రకాశంవైపు చెయ్యి వూపాడు దీన బంధు. ప్రకాశం వినయంగా నమస్కరిం చాడు. ప్రకాశం పెర్సనాలిటీ, పనిపట్ల శ్రద్ధ, కమిట్‌మెంటు బావగారికంటే దీనబంధునే ఎక్కువ ఆకర్షించాయి. అతను తనకెంతో అవసరమయిన సైనికుడు అనిపించింది. తన ముఖ్య అనుచరుడ్ని ఒకడ్ని పిలిచి, ప్రకాశాన్ని చూపించి, తనని తర్వాత కలవ మని కబురంపాడు. అదే ఆలోచన చక్రవ ర్తికీ వచ్చిందిగానీ, దీనబంధు ఆయన దృష్టిని ప్రకాశంనుంచి ఇతర అభిమానుల వైపు మరల్చడంతో ప్రకాశాన్ని ఇక పట్టించు కోలేకపోయాడు.

రథం ముందుకు సాగుతోంది.

బస్తీ బస్తీకి చిన్న చిన్న వేడుకలు ఏర్పాటు చేశారు అక్కడి స్థానికులు. మైకులు కూడా ఏర్పాటు చేశారు. సింహాసనాల్లాంటి కుర్చీలు ఆ వేదికలమీద వేసి, చక్రవర్తిని వచ్చి ఆసీనుడవవలసిందిగా ఆహ్వానించారు గాని, ప్రతిచోటా చక్రవర్తి వినయంగా తిర స్కరించాడు. ఇప్పటికే పూలదండల మధ్య ఈ జీపులో వూరేగింపే తనకి ఇబ్బందిక రంగా వుందన్నట్లుగా విన్నవించుకున్నాడు. అయితే తమ మనసుల్లో వున్న మాటల్ని చెప్పుకునే అవకాశం అయినా ఇమ్మని వాళ్లు రిక్వెస్టుచేసి చక్రవర్తిని బలవంతంమీద ఒప్పించి చెప్పసాగారు.

"మన ప్రియతమ నాయకుడు శ్రీ కళ్యాణ చక్రవర్తిగారు అందర్లాంటి రాజకీయ నాయ కుడు కాదు. నిస్వార్థ ప్రజాసేవకుడు. మనం హాయిగా నిద్దర్లుపోయి, పొద్దెక్కాక నిద్రలేచి బద్ధకంగా ఒళ్ళు విరుచుకుంటూ చూసేసరికి, మన ఇళ్ళముందున్న మురికి కాలవల్లోని చెత్తని తీస్తూ కనిపించి, మనం సిగ్గుతో తలలు వంచుకునేలా చేసిన మహా మనిషి. మురికివాడల్లో ముచ్చెమటలు పోసేంతగా శ్రమించి, వాటిని ముత్యాల వాడలుగా మార్చిన పేదల పెన్నిధి శ్రీ కళ్యాణచక్రవర్తి. పార్టీ, ప్రజలూ కూడా

ఎంత బతిమిలాడినా ఒప్పుకోక చివరికి ఆయన ప్రియతమ బావమరిది శ్రీ దీనబంధుగారి ప్రయత్నాలు ఫలించి, ఆయన మీదున్న వాత్సల్యంతో మనమీదున్న అభిమానంతో మేయర్ పదవికి పోటీకి నిలబడ్డానికి అంగీకరించిన నిస్వార్థ ప్రజానాయకుడాయన. వారు నగరమేయర్‌గా గెలవడం దేవుడు మన నగరంమీద కరుణ చూపించి ఇచ్చిన వరం. మన నగరప్రజల పూజాఫలం..."

పొగడ్తలని భరించలేక కళ్యాణచక్రవర్తి తల భూమిలోకి దిగిపోయింది. దయచేసి ఆపుచేయమని చేతి సంజ్ఞతో వారించాడు. రథం ముందుకు సాగింది. పొగడ్తల పొగ నుంచి ఊపిరి దొరికినట్లయింది ఆయనకి.

★ ★ ★

కళ్యాణచక్రవర్తిగారిల్లు కళ్యాణ ప్రాంగణంలా వుంది. ఆయన నగరమేయర్‌గా గెలిచారని వింటూనే ఇంటి దగ్గరున్న అందరికీ గుండెలు ఆనందంతో పొంగాయి. కాళ్లు నేలమీద నిలవనంటున్నాయి. ఆయన భార్య ఇంద్రాణి రెండు చెవుల్లోనూ సెల్ ఫోన్లు పెట్టుకుని, శుభాకాంక్షలు అందుకోవడంలోనే తలమునకలు అయిపోతోంది. గుమాస్తా కేశవరావుగారు ఆఫీసు రూము, హాలు, వరండాల మధ్య ఆనందంతో కాలు నిలవక, చక్రవర్తిగారి రాకకోసం ఎదురు చూస్తూ అలా తిరుగుతూనే వున్నారు. అతి నెమ్మదస్తుడయిన నౌకరు సింహాచలం కూడా ఏ పనిచేస్తున్నా చూపు మాత్రం గుమ్మంవైపే వుంచి తనకి జనం బ్రహ్మరథం పడుతూన్నంతగా ఆనందపడిపోతున్నాడు. మూగవాడు కాబట్టి కేశవరావుగారు ఎదురుపడ్డప్పుడల్లా సంజ్ఞలతో తన ఆనందాన్ని వ్యక్తం చేస్తున్నాడు. కేశవరావుగారమ్మాయి ముగ్ధ విజయంతో ఇంట్లో అడుగు పెట్టబోయే కళ్యాణచక్రవర్తిగారికి హారతితో ఆహ్వానం పలకడానికి ఏర్పాట్లు చేస్తోంది.

విజయోత్సాహ సంబరం చక్రవర్తిగారింటిని సమీపిస్తోంది. చేస్తున్న పనులన్నిటినీ వదిలిపెట్టి అందరూ గుమ్మంవైపు పరుగులు తీశారు.

విజయరథం ఇంటిముందు కొచ్చి ఆగింది.

కళ్యాణచక్రవర్తి జనాన్ని ఉద్దేశించి, "నా బాధ్యత ఇప్పుడు వెయ్యింతలు పెరిగింది. ఎంతో నమ్మకంతో మీరీ బాధ్యతని నామీద పెట్టారు. శక్తివంచన లేకుండా ఈ నగరాన్ని సుందరంగా, ఆదర్శ నగరంగా తీర్చిదిద్దడానికి నా వంతు కృషి నేను చేస్తాను. ముఖ్యమయిన మంచినీటి సమస్యని తీర్చడానికి మీతోబాటు నేనూ శ్రమిస్తాను. అందరం చేయి చేయి కలిపితే కావలసినవి మనం సాధించుకోవడం అసాధ్యం కాదు. బాగా పొద్దుపోయింది. ఇక పోయిరండి. పొద్దున్నే కలుద్దాం. నమస్తే" అన్నాడు.

చక్రవర్తిగారి కుటుంబసభ్యులు తప్ప మిగిలినవారంతా వెనుతిరిగారు మరొకసారి నమస్కరించి. వెళ్తూ 'మేయర్ చక్రవర్తి గారూ- వర్ధిల్లాలి' అని మరొక్కమారు దిక్కులు పిక్కటిల్లేలా స్లోగన్లు ఇచ్చి మరీ కదిలారు. ఇంద్రాణి, ముగ్ధ వెలిగిపోతూన్న ముఖాలతో మంగళహారతి ఇచ్చారు. చక్రవర్తిగారు చిరునవ్వు సాయంతో లోపలికి అడుగుపెట్టాడు.

"దీనబంధూ- ఏవిటయ్యా, ఏవిటయ్యా ఇంత ఆర్భాటం?" అన్నాడు మొహమాటంగా మెడలోని దండల్ని తీసి సింహాచలానికి అందిస్తూ.

"ఆర్భాటం ఏముంది బావగారూ- అత్యంత మెజారిటీతో నగరమేయర్‌గా గెలిచిన మిమ్మల్ని ఈమాత్రంగా గౌరవించుకోవడం మర్యాద తెలిసిన నగర ప్రజల కనీస బాధ్యత" అన్నాడు దీనబంధు.

కేశవరావు, సింహాచలాలను ఆత్మీయంగా చూస్తూ, సోఫాలో కూలబడుతూ, ముగ్ధని దగ్గరకు పిలుచుకుని, పక్కనే కూర్చోబెట్టుకుని ఆమె తలనిమురుతూ, "ఏం గౌరవమో, ఏం బాధ్యతలో ఆకాశానికి ఎత్తేసేదీ

ఈ ప్రజలే రేప్పొద్దున్న ఏమయినా తేడా వస్తే అధఃపాతాళానికి తొక్కేసేదీ ఈ ప్రజలే" అంటూ నవ్వాడు చక్రవర్తి.

"అయ్యా... అయ్యా... అంత మాటన కండి. మీరెప్పుడూ ప్రజల గుండెల్లోనే వుంటారు" అన్నారు కేశవరావుగారు మీకు సంబంధించి అమంగళం నేను వినలేను అన్నట్లుగా నొచ్చుకుంటూ.

"ఏదో మాటవరసకి అన్నాన్లెండి" అంటూ నవ్వుతూ చూశాడు చక్రవర్తి ఆయనవైపు.

దీనబంధుకి ఇంతటి ఆనంద సమయంలో కేశవరావు తన బావగారితో అంత ఆత్మీయతతో మాట్లాడ్డం నచ్చలేదు. అందుకనే వెంటనే "గుమాస్తాగారూ ఆ దండలు లోపల గదిలో పెట్టించండీ" అన్నాడు.

"దీనబంధూ..." చక్రవర్తి గొంతులో కొంత తీవ్రత చోటుచేసుకుంది. "ఆయన పేరు కేశవరావుగారు. అందరూ ఆయన్ని అలాగే పిలవాలని గతంలోనే చెప్పాను. ఎవరు గుమాస్తాగారని పిలిచినా నేను వూరుకోను"

దీనబంధుకి కోపం తన్నుకొచ్చిందిగాని తమాయించుకున్నాడు. అయితే కోపాన్ని పూర్తిగా మింగెయ్యలేక, దండల్ని లోపల పెట్టమని సింహాచలానికి సౌంజ్ఞలతో విసురుగా చెప్పాడు, బావగారికి కనబడకుండా.

కేశవరావుగారు, సింహాచలం ఒకసారి ముఖాలు చూసుకుని, లోపల గదిలో తాము సిద్ధంచేసి వుంచుకున్న రెండు గంధం పూలదండల్ని తెచ్చి చక్రవర్తి మెళ్లో వేసేసి చేతులు జోడించి, భయం భయంగా దూరంగా జరిగారు.

కోపం తన్నుకొచ్చిన దీనబంధు అక్కగారి వైపు విసురుగా చూశాడు. ఆమెకీ వీళ్ళ చర్య నచ్చలేదుగాని, ఏమనాలో తోచక కళ్లు మిటకరించుకు చూస్తోంది. దీనబంధే తెగించాడు. "అరె, ఆ దండల్ని లోపల పెట్టండయ్యా అంటే ఏమిటి మీరు చేస్తోన్న పిచ్చి పనీ, మీరూ..." అంటూ ఏదో అనబోయాడుగానీ, చక్రవర్తి చేతి సంజ్ఞతో బావమరిదిని వారించి వాళ్ళవైపు చేతులు చాపాడు లేచి నిలబడి.

వాళ్ళు నీళ్లు నిండిన కళ్లతో చిన్న చిన్న తడబడే అడుగుల్తో దగ్గరకు రాగానే ఆత్మీయతతో వాళ్ళని గట్టిగా గుండెలకి హత్తుకున్నాడు చక్రవర్తి.

దీనబంధు గుండెలు భగ్గుమన్నాయి.

ఇంద్రాణికి, కన్నబాబుకి కూడా అయిష్టంగా వుంది.

నంది అమాయకంగా, ఆనందంగా ఓ గెంతువేసి అన్నాడు.

"ఎక్సలెంట్... అద్భుతమైన దృశ్యం. ఇటువంటి దృశ్యం మా నాటకంలో పెడ్తే అదిరిపోతుంది. జస్ట్ హాలంతా అదుర్స్... అంతే... చప్పట్లే చప్పట్లు... టాపు లేచిపోతుంది"

కొడుకు అలా పొగిడేసరికి మరింత మండింది దీనబంధుకి. "సర్లే సర్లే" అని కొడుకుని కసిరి దీనబంధు కోపాన్ని దిగమింగుకుంటూ బలవంతంగా నవ్వుతూ నౌకర్లతో "వెళ్లండయ్యా, దండలు లోపల పెట్టండీ" అన్నాడు.

వాళ్లిద్దరూ కళ్లల్లోని ఆనంద భాష్పాల్ని తుడుచుకుని, తాము వేసిన దండల్ని కూడా తీయబోయారు.

వారించి వాటిని తన మెడలోనే వుంచుకున్నాడు చక్రవర్తి.

వాళ్ల గుండెలు ఆనందంతో పొంగాయి. దండల్తో కేశవరావుగారు, సింహాచలం, ముగ్ధ లోపలికెళ్ళారు.

వాళ్లవైపే చూస్తూ ఇక మేయర్‌గా బాధ్యతలు స్వీకరించిన తను ఆత్మీయతకి దూరమయిపోతానేమోననే భయాన్ని వ్యక్తం చేస్తూ అన్నాడు చక్రవర్తి. "నాకు దక్కుతోన్న ఈ గౌరవానికి ఆనందించాలో, నా ఆప్తులకి దూరం అయిపోతున్నందుకు విచారించాలో అర్థం కావడంలేదు. మొత్తానికి ఈ రాజకీయాల రొంపిలోకి రోజురోజుకీ

మరింత దిగఁబడిపోతున్నానయ్యా" ఆయన ముఖంలో భయం స్పష్టంగా కనిపిస్తోంది.

దీనబంధు, ఇంద్రాణి ఇదే సమయమని ఆయనకి దగ్గరయ్యారు. ఒకసారి ముఖాలు చూసుకున్నారు. నెమ్మదిగా అనునయంగా దీనబంధు అందుకున్నాడు. "భలేవారు బావగారూ- ఇల్లా అంటూ మీలాంటి అర్హు లయినవాళ్లు దూరంగా జరిగిపోతే, అప్రతి భులు రాజ్యమేలతారు. ఇంకేం ఆలోచించ కండి. మా బాధ్యతగా ఓ సమర్థుడికి పట్టా భిషేకం చేశాం. మీ బాధ్యతగా ఈ నగ రాన్ని ఏలండి. అలగాజనాన్ని అంతంత దూరంలోనే వుంచి" అని ఆగాడు. అక్కగా రివైపు చూశాడు. ఆమె ప్రోత్సాహంతో ధైర్యం చేసి అర్థోక్తిగా తనని ఉద్దేశించి అన్నాడు, "సమర్థుల్ని ఓ కంట చూడండి"

అతను అలగాజనం అని ఎవర్ని ఉద్దేశించి అన్నాడో చక్రవర్తికి సులభంగానే అర్థమైపో యింది. దండల్ని లోపల పెట్టి వచ్చిన కేశ వరావు, సింహాచలాలను దగ్గరకు పిలుచు కుని, వాళ్ళ భుజాలమీద చేతులువేసి ఆత్మీ యతతో వాళ్ళ కళ్లల్లోకి చూస్తూ, "వీళ్లు అలగా మనుషులేవిటయ్యా, నా ప్రాణంలో ప్రాణం వీళ్లు. ఆ విషయం నేను మరిచిపోతే, నేను తినేదాన్ని అన్నం అనరు" అన్నాడు.

దీనబంధు అవాక్కయ్యాడు. దెబ్బతిన్నాడు. తలదించుకుని బయటకు బయల్దేరాడు.

"అదేవిట్రా తమ్ముడూ... అలా వెళ్ళిపోతు న్నావు" అంది ఇంద్రాణి ఆందోళనగా.

"అహఁ ఏంలేదక్కా. అప్పులు జరుపుకుం టూన్న వేడుకలో పరాయివాళ్లుంటే బాగుం డదనీ" అని కొడుకుతో "నడవరా నందీ ఇంకా ఏం చూస్తున్నావు పద..." అని కసిరి బావగారితో "బావగారూ సెలవిప్పించండి" అని నాటకీయంగా పలికి బయటకు నడవ బోయాడు దీనబంధు.

"అయ్యో... అయ్యో... అదేవిట్రా తమ్ముడూ.. నువ్వు పరాయివాడివేవిటీ... ఆగు... ఆగు" అంటూ వెంటపడింది ఇంద్రాణి.

"నిజంగా అక్కా నేను ఏంచేశానని ఈ ఆనందంలో భాగం పంచుకోగలను. నన్ను వెళ్లనీ..." అంటూ ముందడుగు వేశాడు.

గాభరాపడింది ఇంద్రాణి.

"ఏవండీ- ఏవిటండీ మీరు? ఇంకా మీరు మునుపటిలాగే మాట్లాడితే ఎలా? ఇప్పుడు మీరు ఈ నగర మేయర్. అందరి అభిమా నంతో ఎన్నికయ్యారు కాబట్టి, అందరి క్షేమం ఆలోచించవలసినవాళ్లుకదా"

"ఇప్పుడు నేను కాదన్నానా? " అన్నాడు చక్రవర్తి.

"మీరు కాదన్నారని కాదు. రాజకీయాల్లో ప్రజల అభిమానాలు వూహించని విధంగా మారిపోతుంటాయి. అల్లా మారిపోకుండా ప్రజల అందరి అభిమానాన్ని మీమీద స్థిరంగా ఉంచడానికి ముఖ్యకారకుడయిన మా తమ్ముణ్ణి మరి ప్రత్యేక అభిమానంతో చూడరు ? "

"ఏవిటక్కా- బావగార్ని ఎందుకు ఇబ్బంది పెడ్తావు? చెప్పాగా. నేను చేసిందేవీ లేదని" బావమరిది మరింత బిగుసుకుంటున్నాడని చక్రవర్తి గ్రహించాడు. ఈ శుభసందర్భంలో అతని మనసు నొప్పించడం ధర్మం కాదని పించింది. పైగా నిజంగానే గత రెండు మూడు నెలలుగా అతను తన విజయం కోసం, తను ఎంత వారించినా వినకుండా, అహోరాత్రాలు శ్రమపడ్డాడు కూడా.

చక్రవర్తి చిరునవ్వుతో దీనబంధువైపు నడిచి, అతని చేతిని దొరకపుచ్చుకుని, "ఆగ వయ్యా- అందాల బావమరిదీ" అన్నాడు నవ్వుతూ.

"ఫర్వాలేదు బావగారూ- నన్నొదిలె య్యండి" అంటూ ఇంకొంచెం బిగుసుకు న్నాడు దీనబంధు.

"చాలింక అలకపాన్పు దిగండి బావమరి దిగారూ" అంటూ అతన్ని తన వైపుకు తిప్పుకుని, "నువ్వెంత శ్రమపడ్డావో నాకు తెలియదా దీనబంధూ- నీ రుణం తీర్చుకోగ

లనా? " అన్నాడు అతని కళ్లల్లోకి ఆత్మీయతతో చూస్తూ.

దీనబంధు గుండె ఝల్లుమంది ఆ మాటలకి. ఆసరా దొరికినట్లయింది. మొట్టమొదటి విజయసోపానం ఎక్కినట్లయింది. ఇంక బెట్టుచేస్తే బెడిసికొడ్తుందని అర్థమయింది. "బావగారూ" అంటూ లొంగిపోతూ, బేలతనం నటిస్తూ చూశాడు.

చక్రవర్తి అమాంతం అతన్ని తన గుండెలకి హత్తుకున్నాడు.

"నిజంగా... నీ రుణం తీర్చుకోలేనిదే దీనబంధూ" అని మరొకసారి వత్తి పలికాడు చక్రవర్తి.

ఇంద్రాణిలో ఆనందం పెల్లుబికింది. తృప్తిగా నవ్వుతూ అంది, "అక్కున చేర్చుకున్నారుగా. రుణం తీర్చుకునే మార్గం ఠక్కున అదే తడుతుందిలెండి"

ఆమె మాటలకి నంది ఎగిరి గంతేశాడు. ఇంద్రాణి మాటల్ని రిపీట్ చేస్తూ "అక్కున చేర్చుకున్నారుగా. రుణం తీర్చుకునే మార్గం 'ఠక్కున' తడుతుంది. 'అక్కున', 'ఠక్కున' హమ్మో, అత్తయ్య కూడా ప్రాస మాట్లాడేస్తోంది. నాటకరంగానికి రచయిత్రుల కొరత చాలా వుంది. ఇంక ఆలస్యం చెయ్యక మా రంగంలోకి నడుం బిగించి దూకెయ్యి అత్తయ్యా- దేదీప్యమానంగా వెలిగిపోవచ్చు" అన్నాడు.

చక్రవర్తి పకపకా నవ్వాడు.

దీనబంధూ నవ్వాడు.

తమ్ముడి ముఖం వికసించినందుకు ఇంద్రాణి తృప్తిచెంది మరోసారి జోక్ కట్ చేస్తూ మేనల్లుడితో అంది, "నందీ, నువ్వు నోరు మూస్తే, ఆ 'నంది'స్తాం" అని.

ఆమె మాటలకు ఉత్సాహంతో మళ్ళీ మెలికలు తిరిగిపోయాడు నంది, "హమ్మో, మళ్ళీ ప్రాస... జోహార్ అత్తయ్యా" అన్నాడు చప్పట్లు కొడ్తూ.

చక్రవర్తి నవ్వి సింహాచలాన్ని దగ్గరకు పిలిచి, ఎవర్నో తీసుకురమ్మని చెప్పి బయటకు పంపించాడు.

ఈ ఆనంద సమయంలో తన కోర్కె బయటపెట్టడం మంచిది అనిపించింది చక్రవర్తిగారి సుపుత్రుడు కన్నబాబుకి.

"కొంచెం రికమెండ్ చేస్తావా" అన్నట్టుగా తల్లివైపు చూశాడు.

"ముందు నువ్వు స్టార్ట్ చెయ్యి, ఆలస్యం చెయ్యకు" అన్నట్లుగా చూపుల్తోనే తొందర పెట్టిందావిడ.

నెమ్మదిగా తండ్రి పక్కకు చేరాడు కన్నబాబు. ఎలా ప్రారంభించాలో అర్థం కాలేదు. తెగించి ప్రారంభించాడు, "టుడే అయాం వెరీహాపీ డాడ్. రియల్లీ వెరీ వెరీ హాపీ. ఇంతటి సిటీకి మేయర్ అయిన శ్రీశ్రీశ్రీ కళ్యాణచక్రవర్తిగారి కొడుకునని కాలర్ అప్ చేసి గర్వంగా చెప్పుకుంటాను డాడ్..." అన్నాడు.

చక్రవర్తి కొడుకు కళ్లల్లోకి చూశాడు. వాడి కళ్లల్లో వెలిగిపోతోన్న గర్వాన్ని గమనించాడు. అది ఆయనకి నచ్చలేదు. అందుకే తేలిగ్గా నవ్వేసి, వాడి తలమీద రుద్దుతూ, "పిచ్చివాడా" అన్నాడు.

అది అభిమానమో, అవహేళనో అర్థం కాలేదు కన్నబాబుకి. "ఏంటి డాడీ, అలా తీసిపారేస్తూ నవ్వేశారు? " అన్నాడు అయోమయంగా.

"ఏంలేదురా ఈ అధికారాలూ, పదవులూ శాశ్వతం కాదు. ఏమంటారు కేశవరావుగారూ" అంటూ గుమాస్తాగారివైపు తిరిగాడు చక్రవర్తి.

"అయ్యా- అబ్బెబ్బే ఎంతమాట!" అన్నారు కేశవరావుగారు నొచ్చుకుంటూ.

"నిజమండీ- నిజాల్ని మనం ఒప్పుకుతీరాలికదా. మనకెంతో ఇష్టమయిన ప్రాణమే శాశ్వతం కాదు. అలాంటిది పదవి శాశ్వతమా? 'కారే రాజులు...' ఏదీ, ఆ పద్యం ఒక్కసారి వినిపించండి"

"అయ్యయ్యో ఆ పద్యం ఇంతటి సంతోష సమయంలోనా! అందులో మీవంటి ఉత్త

ముల ముందు... వద్దులెండి... వద్దొద్దు..." అంటూ లోపలకి వెళ్ళిపోయాడాయన.

"మరేం ఫర్వాలేదు ఇటు రండీ- చదవండి కేశవరావుగారూ, ఫర్వాలేదు. నాకెందుకో దాన్ని ఓసారి గుర్తు చేసుకోవాలని కోరిగ్గా వుంది, చదవండీ. ఇటువంటి సందర్భాల్లో గుర్తు చేసుకుంటేనే అటువంటి పద్యాలకు సార్థకత. చేతులు కాలకుండా జాగర్తపడొచ్చు. తీరా ములిగాక, ఇటువంటి పద్యాలు ఎన్ని గుర్తు చేసుకున్నా ఒక్కటే" అంటూ ఆయన చేయి అందుకున్నాడు చక్రవర్తి.

కేశవరావు చెప్పలేనంత ఇబ్బంది పడిపోయాడు. బాధపడిపోయాడు కూడా. మరొకసారి విన్నవించుకున్నాడు, "అయ్యా, క్షమించండి. ఆ పద్యం ఇప్పుడు నేను చదవడం ధర్మం కాదు. అందులో మీవంటి ఉత్తములకి ఇలాంటి విషయాలు గుర్తు చేయాలా? "

"చదవండీ ఫరవాలేదు. పదవి లభించినప్పట్నుంచీ ఎంతటి ఉత్తముడయినా ఉత్త'ముడి' సరుకుగా మారిపోయే ప్రమాదం వుంది... చదవండి" ప్రోత్సహించాడు చక్రవర్తి చిరునవ్వు సాయంతో.

నంది మళ్ళీ చప్పట్లు చరిచాడు. "గుడ్ డైలాగ్ మామయ్యా. ఓహో ఏవిటీ... ఎంతటి ఉత్తముడయినా, ఉత్త'ముడి' సరుకుగా మారిపోయే ప్రమాదం... ఎక్సలెంట్ డైలాగ్... మా నాటకాల్లో..." అంటూ ఏదో చెప్పబోయాడుగానీ చక్రవర్తి కట్ చేస్తూ అన్నాడు "ఓవర్‌యాక్ట్ చేయకూడదుకదూ! కాబట్టి నువ్వు..." అని నోరు మూసుకోమన్నట్లుగా పెదవుల మీద వ్రేలు పెట్టుకుని చూపించాడు.

"అలాగే మామయ్యా" అంటూ నంది బుద్ధిగా తలవూపి "సారీ మామయ్యా! ఇంక డిస్టర్బ్ చెయ్యను" అని "కేశవరావుగారూ! ఎంతో మంచి పద్యం అయ్యుంటే తప్ప మామయ్య మిమ్మల్ని చదవమని అంత బలవంతం చేయడు. ప్లీజ్ చదవండి మేమూ ఆనందిస్తాం. ప్లీజ్" అన్నాడు.

"కానీండి కేశవరావుగారూ" అన్నాడు చక్రవర్తి ఉత్సాహపరుస్తూ.

తప్పనిసరయింది కేశవరావుగారికి, గొంతు సవరించుకుని పద్యం చదివి వినమ్రుడై తలవంచి చేతులు జోడించి ఆఫీసు రూములోకి వెళ్ళిపోయారు.

ఆనందంతో తన్మయుడయిన చక్రవర్తి కొడుకు వైపుకు తిరిగాడు.

"ఎంత గొప్ప పద్యమో విన్నావా కన్నా! అర్థమయ్యిందికదా? " అనడిగాడు.

వాడు చిన్నగా గునుస్తూ, "ఏంటి డాడీ, నాకిటువంటి పద్యాలూ అవీ అంత ఇష్టం వుండవని మీకు తెలుసుకదా? " అన్నాడు.

"మరేం ఫర్వాలేదులే నాన్నా! పిచ్చి పద్యాలూ, పిచ్చిలోకం" అంది ఇంద్రాణి, ఆఫీసు రూములోకి వెళ్లిన కేశవరావుగారిను ద్దేశించి.

ఆమె మాటలకి బావగారు కోపం తెచ్చుకుంటారేమోనని భయపడ్డాడు దీనబంధు. వాతావరణాన్ని తేలిక పరిచే వుద్దేశ్యంతో నవ్వేస్తూ,

"బావగారూ! ఇంతటి గొప్ప శుభ సమయంలో గానా బజానాలతో ఆనందంలో తేలిపోవాలిగాని ఈ వేదాంత ధోరణి ఎందుకులెండీ" అన్నాడు.

"ఇప్పుడర్జంటుగా గుర్తు చేసుకోవలసిందే వేదాంతమయ్యా బాబూ! లేకపోతే విజయ గర్వంతో విర్రవీగితే వెన్నెముక విరుగుతుంది" అంటూ నవ్వి, కన్నబాబు, నందిలతో "అర్థం చెబుతాను వినండ్రా... ఆ పద్యానికి అర్థం ఏవిటంటే ఎంతో గర్వంతో రాజ్యాలను ఏలి, ఎంతో ధనం, రత్నాలు, వజ్రాలు కుప్పకుప్పలుగా సంపాదించుకుని పోగులు పెట్టుకున్న రాజులు గతంలో ఎందరో ఈ మట్టిలో కలిసిపోయారు. ఒక్క రాయిని కూడా 'ఇది నాదీ' అంటూ తమతో తీసుకు వెళ్లలేకపోయారు. ఈనాడు వాళ్ల పేర్లు కూడా ఎవ్వరికీ తెలియవు. కానీ శిబి చక్రవర్తి లాంటి మహానుభావులు తోటి

మానవులకి సాయపడడమే తమ జీవిత పరమావధిగా భావించి రాజ్యాలను ఏలారు కాబట్టి ఈనాటికీ భూమ్మీద వాళ్ల పేర్లు చిర స్థాయిగా నిలిచి పోయాయి. అంటే పదవు లన్నీ అశాశ్వతం, పరధర్మమే శాశ్వతం అని ఈ పద్యం చాటుతోందన్నమాట"

నంది చప్పట్లు కొట్టాడు 'ఎక్సలెంట్ మామయ్యా' అంటూ.

కన్నబాబు చిన్నబుచ్చుకున్నాడు. తండ్రి తన కోరిక ఏమిటో తెలుసుకోకుండా విష యాన్ని వేరే సబ్జక్టుల మీదకు మరల్చుతు న్నందుకు అలిగాడు కూడా. మరో ప్రయ త్నంగా తెగించి అన్నాడు, "సారీ డాడ్! ఐ జస్ట్ కాన్ట్ డైజెస్ట్ ఆల్ దిస్. లీవ్ ఇట్ డాడ్. మీరు మేయర్ అయ్యారు. ఇట్సి వెరీగ్రేట్ అకేషన్ ఫర్ మీ. ఈ అకేషన్‌లో నాకు మీరు..." అని అడగడానికి సంశయించాడు.

"ఊ... నీకు నేను...?"

"కోప్పడకూడదు మరి"

"ఊ... చెప్పు"

"పాపం వెర్రివెధవ భయపడ్తున్నాడు. కోప్పడను అనీ, కోరినది ఇస్తాననీ ఆనం దంగా చెప్పండీ వాడికి" అంది ఇంద్రాణి కలగజేసుకుంటూ.

"కోప్పడను అని మాత్రం మాట ఇస్తాను చెప్పరా, ఫరవాలేదు" అన్నాడు చక్రవర్తి, కొడుకు ఏం గొంతెమ్మ కోర్కె కోరతాడోనని సంశయిస్తూ.

"మీరు... నాకు ఒక సియెలో కారు శాంక్షన్ చేయాలి. ఇట్సి ప్రెజెంటేషన్ టుమి. ప్లీజ్" అంటూ తన కోరికని బయ టపెట్టాడు కన్నబాబు.

"నో..." గట్టిగానే అన్నాడు చక్రవర్తి. "నో కార్ టు యు. స్కూటరు వాడుతూనే వున్నావుగా. ఒక స్టూడెంటుగా నీకు అదే ఎక్కువ. కారక్కర్లేదు" తల అడ్డంగా తాటిస్తూ ఖచ్చితంగానే అన్నాడు.

"అది పాతపడిపోయింది డాడీ"

"డజ్ నాట్ మేటర్, ఓల్డ్ ఈజ్ గోల్డ్"

"మమ్మీ" అంటూ గారంపోతూ తల్లిని వదిలాడు తండ్రి మీదకు కన్నబాబు.

"అదేవిటండీ! ఒక్కగానొక్క బిడ్డ. ఆ డొక్కు స్కూటర్ ఇంకా ఎంతకాలం వాడ తాడూ?" కొడుకుకి సహాయానికొచ్చిందావిడ.

"వాడి వయసులో నేను పాత సైకిల్‌ని అపురూపంగా వాడుకునేవాడ్ని తెలుసా?" ఒత్తిఒత్తి పలుకుతూ అన్నాడు చక్రవర్తి.

"అబ్బా! ఆ రోజులు వేరండీ! రోజులు మారిపోయాయి. అందులో మీరిప్పుడు నగర మేయర్. వాడి స్టేటస్ పెరిగింది. మరి వాడి స్టేటస్‌కి తగ్గట్టు.." అంటూండ గానే అందుకున్నాడు చక్రవర్తి. "స్టేటస్! స్టేటస్ అనేది మనిషి వ్యక్తిత్వం మీద ఆధా రపడి వుంటుంది ఇంద్రాణీ! తండ్రి కొనిపెడ్తే వాడుకునే కారుల మీద వుండదు. నేను జీవితంలో నిలబడడానికీ, నేటి ఈ స్థితికి రావడానికీ ఎన్ని కష్టాల్ని ఎదుర్కున్నానో నీకు తెలియదూ?" ఖంగున మోగింది ఆయన గొంతు తీవ్రంగా.

కన్నబాబు నీరుగారిపోయాడు. ఆశ పూర్తిగా చచ్చిపోయింది.

ముద్దుల కొడుకు మొహం అలా వాడిపో యేసరికి ప్రాణం పోయినంత పనయింది ఇంద్రాణికి. అందుకనే ఆఖరి అస్త్రాన్ని ప్రయోగించేసింది. "ఇది శుభసమయం. ఇటువంటి సమయంలో ఎవరైనా పిల్లల కోర్కెలు తీర్చకుండా వుండరు. వాడలా దిగాలుగా వుంటే నా మనసు తరుక్కుపో తోంది. ప్లీజ్ ఆఖరుసారి అడుగుతున్నాను. మరో మాట చెప్పొద్దు మీరు. వాడు కోరు తున్నట్లు సియెలో కారు వాడికి కొనిపెడ్తా నని మాటివ్వండి. ఇంకేవీ నేను వినిపించు కోదలుచుకోలేదు. అది తప్పు ఏం చెప్పినా నా మీద ఒట్టే! అంతే" ఆమె గొంతు రుద్ధమై ఒణికింది. ముఖం ఎర్రగా మారి కంపించింది. ముక్కుపుటాలు అదురుతు న్నాయి.

భార్యాబిడ్డలు ఇద్దరూ ఇంతగా ఇబ్బంది

పెట్టేసరికి ఈ సందర్భంలో వాళ్లిద్దరి మన సులూ కష్టపెట్టడం శుభం కాదనిపించి విధి లేక గట్టిగా నిశ్వాసించి "ఊ... ఓకే" అన్నాడు చక్రవర్తి.

అంతే!

ఇంద్రాణి మొహం భోగిమంటలా గుప్పున వెలిగింది.

కన్నబాబు సరేసరి "ఓ థ్యాంక్యూ డాడ్ థ్యాంక్స్ ఎలాట్" అంటూ, అంతెత్తున ఎగిరాడు. "సియెలో సేంక్షన్డ్" అంటూ అందరికీ షేక్‌హాండ్‌లిచ్చి, తండ్రి కాళ్లని కళ్లకి అద్దుకుని "డాడీ ఇటువంటి శుభసమయంలో బాగుంటుందని మంచి మ్యూజిక్ పార్టీని తెప్పిస్తున్నాను డాడ్. ఎక్సలెంట్ ఆర్కెస్ట్రా, స్ట్రీట్‌ఫూల్స్ అని..." అని అంటూండగానే నంది అందుకున్నాడు.

"ఎందుకూ మా ట్రూప్ వాళ్లని పిలిపిస్తున్నాను. మంచి నాటకం ప్రదర్శిస్తాం" అన్నాడు.

"ఛఛా! ఇంత గ్రేట్ అకేషన్‌లో మీ చెత్త నాటకం ఏమిటీ ఆర్కెస్ట్రాయే బాగుంటుంది" కన్నబాబు.

"ఆ స్ట్రీట్ ఫూల్స్ నిజంగా ఫూల్స్. స్ట్రీట్ ఏం ఖర్మ యూనివర్సల్ ఫూల్స్ వాళ్లు. వాళ్లేకాదు వాళ్ల మ్యూజిక్‌ని ఎంజాయ్ చేసే వాళ్లు కూడా"

"నీ తలకాయ, చద్దన్నం తినేవాడికి పిజ్జా రుచేం తెలుస్తుంది? ఇప్పుడు ఆర్కెస్ట్రాయే బాగుంటుంది"

"నాటకమే బాగుంటుంది. ఇది ఫైనల్"

"రెండూవద్దు" చక్రవర్తి కలగజేసుకుంటూ అన్నాడు "చెబుతున్నాగా రెండూ వద్దు... నన్ను ప్రశాంతంగా వదిలిపెట్టి లోపలికి పొండి మీరిద్దరూ"

"ఓకే డాడ్ గుడ్‌నైట్" అంటూ లోపలికి తన గదిలోకి వెళ్లిపోయాడు కన్నబాబు. "గుడ్‌నైట్ మామయ్యా" అని, బయటకి వెళ్లి పోయాడు నంది.

కారు కొనమని కొడుకు, భార్య ఫోర్స్‌చేయడం తర్వాత కుర్రాళ్లిద్దరూ వాదించుకోవడం ఇదంతా ఉక్కిరిబిక్కిరిగా అనిపించింది చక్రవర్తికి. తన గదిలోకి వెళ్లిపోయి బట్టలు మార్చుకుని షవర్‌కింద తలారా స్నానం చేశాడు. తేలికపాటి బట్టలు వేసుకుని గార్డెన్‌లోకి నడిచాడు.

గార్డెన్‌లో పకపక నవ్వుతూన్నట్లున్న పూల గుత్తులనీ, తలలు వూపుతూ తనని ఆహ్వానిస్తూన్నట్లున్న చెట్ల కొమ్మలనీ చూస్తుంటే ప్రాణం లేచి వచ్చింది. మనసు తేలికయ్యింది. చల్లని గాలి శరీరాన్ని ఆప్యాయంగా స్పృశిస్తూంటే అప్రయత్నంగా అలవోకగా పాత తెలుగు సినిమా పాట ఏదో హమ్ చేస్తూ పచార్లు చేయసాగాడు. స్వేచ్ఛగా వూగుతున్న చెట్లని ఆప్యాయంగా చూశాడు. ఒక కాంపౌండులో ఒకరి అధీనంలో పెరుగుతున్న ఈ చెట్లే ఇంత స్వేచ్ఛని అనుభవిస్తున్నాయి. అదే అడవిలో పెరిగే చెట్లయితే మరింత స్వేచ్ఛని అనుభవిస్తాయి. తన పరిస్థితి తలుచుకుంటే కించిత్ భయం కలిగింది చక్రవర్తికి. ఇన్నాళ్లూ చేతనయిన సమాజసేవ చేస్తూ తనూ కొద్దోగొప్పో స్వేచ్ఛననుభవించాడు. అసలు పొలిటికల్ పార్టీతో సంబంధం పెంచుకోక ముందయితే మరింత స్వేచ్ఛగా హాయిగా బతికాడు. ఇప్పుడు ఈ పదవి తలకి చుట్టుకుంది. చుట్టూ కంచె బిగుసుకుంటున్నట్లుగా వుంది. ఇప్పుడు స్వేచ్ఛ తక్కువ. ఎవర్ని నమ్మచ్చో ఎవర్ని దూరంగా వుంచాలో తెలియని పరిస్థితి. సమాజసేవక్కూడా వెయ్యి అడ్డంకులు. అధిష్టానం అదుపాజ్ఞలు, ఆదేశాలు, తన లాంటి వాడి మనస్తత్వానికి పూర్తిగా ఇబ్బందికరమయినవి. అయితే సమాజానికి మంచి చేయడానికి గతంలోకంటే ఇప్పుడు అధికారం కూడా వుంది కాబట్టి, అవకాశం ఎక్కువ. టెన్షన్, చికాకు తగ్గి, ప్రశాంతత లభించేంతవరకూ పూలమొక్కల్ని పలకరిస్తూ పచార్లు చేసిన చక్రవర్తి కళ్లల్లో దూరంగా నిలబడిపోయి తన దగ్గరకొచ్చి డిస్టర్బ్ చేయ

డానికి సంకోచిస్తున్న ఇంద్రాణి పడగానే చిరునవ్వుతో ఆమెని తన దగ్గరకు రమ్మని ఆహ్వానించాడు.

ఆమె గబగబా పరుగులాంటి నడకతో భర్తని సమీపించింది.

ఒక గులాబీ పువ్వుని తెంపి భర్త చేతికందించింది.

భార్యని దగ్గరకు లాక్కుని అన్నాడు చక్రవర్తి "ఈ రోజు నా మెళ్లో పడిన వందల పూలమాలలు ఒక ఎత్తు ఈ ఒక్క గులాబీ పువ్వు ఒక ఎత్తు" అని.

భర్త గుండెల మీద వాలిపోయింది ఇంద్రాణి.

"ఎందుకో చాలా టెన్షన్‌గా వుంది ఇంద్రాణీ" అన్నాడు చక్రవర్తి.

"సమర్థులు బాధ్యత స్వీకరించినప్పుడు ఈ టెన్షన్ సహజమేనండీ! చేతకానివాళ్లు ఎలాగూ ఏవీ చెయ్యరు కాబట్టి చేయాల్సి వచ్చినా కిందవాళ్ల నేర్పరితనం మీదో పైవాళ్ల గైడెన్స్ మీదో ఆధారపడతారు కాబట్టి వాళ్లకి టెన్షన్ వుండదు. పార్టీలోనూ ప్రజల్లోనూ సమర్థుడని పేరున్న మీరు తప్పక విజయం సాధిస్తారు" అంది నమ్మకంగా.

చక్రవర్తి మనసు తేలిక పడింది.

భార్యని ప్రేమగా మరింత దగ్గరకు తీసుకున్నాడు.

"రండి లోపలకి వెళ్దాం. అక్కడ దీనబంధు ఒక్కడూ పాపం, మీ ఆజ్ఞలకోసం ఎదురుచూస్తున్నాడు. మీరు గెలిచిన సందర్భంగా ఫోన్లు మీద ఫోన్లు వస్తున్నాయి. అన్నిటికీ వాడే స్వతంత్రించి జవాబు చెప్పడం బాగుండదుకదా"

"నిజమే పద! పాపం, అతను చాలా శ్రమపడ్డాడు నిజంగా" అంటూ భార్యతో లోపలకు దారితీశాడు చక్రవర్తి.

హాల్లో దీనబంధు ఎవర్తోనో ఫోనులో మాట్లాడుతున్నాడు. "చక్రవర్తిగారు బాగా అలసిపోయున్నారండీ. మీ అభినందనలు తెలియజేస్తాను. ఇప్పుడు వారిని కలవడం కుదర్దండీ. ఏంలేదు... వారికి విశ్రాంతి అవసరం. రేపు కలుద్దురుగాని, ఓకే అండీ... నమస్కారం" ఫోను కట్ చేసి బావగారి వైపు నవ్వుతూ చూశాడు దీనబంధు.

"పాపం ఎంతో అభిమానంతో వాళ్లు నన్ను కలుద్దామనుకుంటే నేనే వాళ్లని నిరుత్సాహపరుస్తున్నాను కదా" అన్నాడు చక్రవర్తి నొచ్చుకుంటూ.

"తప్పేదు బావగారూ మీ స్థానంలో ఎవరున్నా అంతే! ఎవ్వరూ అందర్నీ విడివిడిగా వచ్చి కలవమనలేరు. అందులో ఈ రోజు వూరేగింపులో మీరు బాగా అలసిపోయారు. అయినా ఎందుకూ, పని రాక్షసుడ్ని, ఎటువంటి కాయకష్టానికయినా అలవాటుపడ్డ వాడ్ని నేనున్నాగా. నేను ఎవర్నీ నిరుత్సాహపరచకుండా మర్యాదగా జవాబు చెబుతాను లెండి" అంటూ అక్కగారివైపు నువ్వే దిక్కు అన్నట్లుగా చూశాడు దీనబంధు.

అదే ప్రయత్నంలో వున్నారురా! కొంచెం ఓపిక పట్టు అన్నట్లుగా చూపుల్తోనే ధైర్యం చెప్పి, భర్తతో "ఏమండీ ఈ ఆనంద సమయంలోనే మీ కుడిభుజం, మీ విజయమే తన ఆనందంగా భావించే మీ ప్రియతమ బావమరిది కోరిక కూడా తీర్చెయ్యరూ?" అంది ఇంద్రాణి.

"కోరికా? ఏవిటది?" అన్నాడు చక్రవర్తి ప్రసన్నంగా.

ఉత్సాహం ఉబికింది అక్క, తమ్ముళ్లలో.

మళ్లీ మొహాలు చూసుకున్నారు ఎవరు ప్రారంభించాలో తేల్చుకోలేక.

"చెప్పరా, మొహమాట పడతావేం? ఈ మొహమాటంతోనే మనం చాలా నష్టపోతున్నాం. అడిగెయ్యి... బావగారి దగ్గరే తటపటాయిస్తే ఇంక బయట వాళ్లనేం అడగ్గలవురా పిచ్చిమొహం? తప్పకుండా చేస్తారు బావగారు. నీక్కాకపోతే ఇంకెవరికి చేస్తారురా! అడిగెయ్యి! పార్టీ అధిష్టానానికి మీ బావగారెంతో సన్నిహితులుకదా! ఆయన చెబ్తే ఎవరూ కాదనరు. ఊ...

స
చి
త్ర
వి
చి
త్రం



## అతి ఖరీదైన అందాల పూలకుండీ!

అతి అందమైన పింగాణీ సామగ్రి రూపొందించడంలో చైనావారికి మంచి పేరుంది. ఆ దేశంలో అనాదికాలంగా అద్భుతమైన రీతిలో పింగాణీలో అనేక కళాఖండాలు, సొగసైన కూజాలు, ప్లేట్లు, టీ కప్పులు తయారవుతున్నాయి. కళాకారులు తమ సృజనాత్మక శక్తిని రంగరించి పింగాణీ పాత్రలపై నేత్రోత్సవం చేసే రంగులతో వన్నెచిన్నెలతో ముచ్చటగొలిపే ఎన్నెన్నో డిజైన్లు రూపకల్పన చేశారు.

'క్వింగ్' రాజుల పరిపాలనలో కళాకారులు రూపొందించిన పూలకుండీపై లతలు, పువ్వులు, వాటిపై ఓ డ్రాగన్ ఎరుపు, నీలం రంగుల్లో చిత్రకారులు మనోజ్ఞంగా చిత్రించారు.

అ...డి...గె...య్యి!" తొందరపెట్టింది ఇంద్రాణి.

ధైర్యం చేసి చెప్పబోయాడు దీనబంధు, "బావగారూ..." అంటూ.

'ఆగండాగండి!" అని వారించి భార్యతో "ఇంద్రాణీ నేను పార్టీ అధిష్టానానికి సన్నిహి తుడ్ని అంటున్నావు... వాళ్లకి ఏదో చెప్పాలి అంటున్నావు. నేనెప్పుడన్నా నాకు ఇది కావాలీ అని పార్టీ అధిష్టానాన్ని అడిగిన ట్లుగా నువ్వు విన్నావా? " అనడిగాడు సూటిగా.

ఇంద్రాణి కొంచెం దెబ్బతింది.

విషయం బెడిసికొడ్తుందేమోనని దీన బంధు భయపడ్డాడు.

"ఛచ! అదికాదండీ నా వుద్దేశ్యం. మీ గురించి ఎవరికి తెలియదండీ? అందరికీ తెలుసు. మీరు ఎప్పుడూ ఏవీ అడగలేదు. అందులో స్వంతం కోసం అసలు అడగ లేదు" అంది ఇంద్రాణి నువ్వా అందుకోరా అన్నట్లుగా తమ్ముడి వైపు చూస్తూ.

వెంటనే అందుకున్నాడు దీనబంధు, "ఈ మేయర్ పదవికి కూడా ఎంతో బలవంతం మీద పార్టీ మిమ్మల్ని ఒప్పించి నిలబెట్టిం దని మాకు తెలియదా బావగారూ? పోతే రాజకీయాలుకదా ఏ క్షణంలోనైనా ఎలా గైనా మారిపోవచ్చు, మోసాలూ, ద్రోహాలు జరగొచ్చు అని అనుక్షణం జాగ్రత్తగా వుంటూ, నా భయంకొద్దీ, కళ్లల్లో వత్తులేసు కుని కాచుకొచ్చానుగానీ మీరు పదవులు కోరతారనీ, పదవులు లేకపోతే మీరు బాధ పడతారనీనా? చఛ"

"మరింకేవిటీ? " తల పంకించాడు చక్ర వర్తి.

"ఏం లేదు బావగారూ పాయింటుకి వచ్చేస్తా. నేను మీ అంతటి గొప్ప వాడ్ని కాదుకదా! మీ గొప్పతనంలో నూరోవంతు కూడా నాలో లేదుకదా! ఏదయినా కష్టపడి పనిచేసిపెట్టి, నజరానా కోరే బలహీనత వున్నవాడ్ని కదా"

అనుమానిస్తూనే అడిగాడు చక్రవర్తి, "ఏంకావాలీ? "

"ఒకటి నాకు ఎలక్షన్లలో నిలబడడానికి పార్టీ టిక్కెట్టు దొరకదు. రెండు ఇండిపెం డెంటుగా నిలబడి గెలవడానికి సరిపోయే ఆర్థిక స్థోమత, ప్రజల్లో అంత గొప్ప పలు కుబడి వున్నవాడ్ని కాదు"

"అది సరే... నేనేం చేయాలో చెప్పవేం? "

"ఏం లేదు బావగారూ! మీరు కొంచెం రికమెండ్ చేసి అసెంబ్లీ సీటు ఇప్పిస్తే మీ పేరు అరిచేతుల్లో పచ్చబొట్టు పొడిపించు కుని తెల్లారి లేస్తూనే కళ్లకద్దుకుంటాను. తినే ప్రతి మెతుకూ మీరు పెట్టిన భిక్షే అని తలుచుకుంటూ తింటా" వినయంతో ఒంగి పోయాడు దీనబంధు.

వెంటనే అందుకుంది అక్కగారు, "మరీ అంతలా బతిమలాడుతూ అడగాలిట్రా. తప్పకుండా చేయిస్తారులే బావగారు"

"చేయించను!" చక్రవర్తి గొంతు ఖంగు మంది కత్తితో నరికినట్లు.

అంత ఖచ్చితంగా డొంక తిరుగుడు, తోసి వేత లేకుండా, సూటిగా భర్త అలా అనేస రికి కొయ్యయిపోయింది ఇంద్రాణి.

దీనబంధు నోట తడారిపోయింది. బేలగా చూశాడు అక్కగారివైపు.

"అదేవిటండీ... ఒక్క మాట అధిష్టా నంతో..." మాటలు పోగుచేసుకుంటోంది ప్రయత్నపూర్వకంగా.

"ఒక్కమాట! ఒక్కమాట చాలు ఇంద్రాణీ ఒక్క పెట్టున నా ఆత్మగౌరవం కూలిపోవ డానికి"

"మంచి తెలివితేటలున్న మా తమ్ముడు కూడా ఎదగాలి కదండీ? "

"మంచి మాటన్నావు. ఎదగాలి! ఎదుగు దల అనేది ఒక్క రోజులో వచ్చేది కాదు క్రమేపీ జరిగే పరిణామం అది" మాటలు బాణాల్లా వదిలాడు చక్రవర్తి.

తనెదురుగానే మొహమాట పడకుండా

తన తమ్ముడ్ని ఆయన అలా తీసిపారేస్తున్నాడని ఆమె కడుపు కుతకుతలాడింది. ముద్దుల తమ్ముడి ముఖంలో నిరాశని చూడడం ఆమె వశం కావట్లేదు. కార్యసాధన కావలసిన వాళ్లు ఓర్పు వహించక తప్పదన్న కొద్దిపాటి రాజకీయ పరిజ్ఞానం కలది కావడంతో సహనాన్ని ఆశ్రయించింది. అయినా చిన్న చీమ కుట్టినంత బాధనైనా భర్తకి కలిగించకపోతే తనకి ఆత్మతృప్తి కలిగేలా అనిపించలేదు ఆమెకు. అందుకే సన్నగా మాటలు వదిలింది. "ఈమధ్యే రాజకీయాల్లో ప్రవేశించిన మీరే ఇంతగా ఎదిగారు కదండీ"

తూటాలా దూసుకొచ్చింది జవాబు, "దానికి వ్యక్తిత్వమనే బలమయిన పునాది వుంది ఇంద్రాణీ" అని.

దెబ్బతో నోరెత్తలేకపోయింది ఇంద్రాణి.

నావల్ల సాధ్యమయ్యే కార్యం కాదురా అన్నట్లుగా అశక్తతతో తమ్ముడి వైపుచూసింది.

కానీ ప్రయత్నాలను వదిలి పెట్టెయ్యదలుచుకోలేదు దీనబంధు. గొంతు సవరించుకున్నాడు. "నేను పూర్తిగా మారిపోయాను బావగారూ! గతంలోలా రౌడీ రాజకీయాలూ, హత్యారాజకీయాలూ నడపడం లేదు. ఆ విషయం మీకూ తెలుసుకదా! అందుకనేకదా! మీ తరపున నన్ను వర్క్ చేయడానికి అనుమతించారు"

బావమరిది భుజాల మీద చేతులు వుంచి అనునయంగా అన్నాడు చక్రవర్తి, "ఆ విషయంలో నమ్మకం కుదరాల్సింది నాకు కాదు దీనబంధూ ఇటు పార్టీ నాయకత్వానికీ, అటు ప్రజలకీనూ"

ఒప్పేసుకుంటూ దీనంగా అన్నాడు దీనబంధు, "అదేకదండీ కుదిరి చావట్లేదూ! అందుకనే మీరొకమారు పెద్దమనసుతో..."

తల అడ్డంగా తాటిస్తూ కట్ చేస్తూ "నా ప్రమేయం ఇందులో ఏమాత్రం అవసరం లేదయ్యా! నీ ప్రవర్తనే చాలు. ఏం చేస్తావో ఏమిటో, ప్రజాసేవ చేయదలుచుకుంటే మార్గాలే లేవా. ప్రజలకి తీరని సమస్యలే లేవా? పదవులంటావా. ఇదుగో ఇలాగే వరించి వస్తాయి అవంతట అవే. ముందు నీ శక్తిసామర్థ్యాల మీద అందరికీ నమ్మకం కలిగించు" అన్నాడు.

కార్యసాధన సాధ్యమయ్యేలా కనిపించ లేదు దీనబంధుకి కూడా. ఆత్మగౌరవాన్ని కాపాడుకోవడానికి నడుంకడ్తూ, "సరేలెండి, నా శక్తి సామర్థ్యాలని గ్రహించేశక్తి పార్టీకి ప్రజలకీ వుండాలిగా? " అన్నాడు.

"సువాసననిచ్చే సంపంగి ఏ గుబురుల్లో దాక్కున్నా అందర్నీ తన దగ్గరికి ఆకర్షించుకుంటుందికదా" చిన్నగా నవ్వాడు చక్రవర్తి. మళ్లీ అన్నాడు, "అదే సువాసనలేని పూవయితే కళ్లెదురుగా వున్నా పెద్దగా ఎవ్వరూ పట్టించుకోరుకదా"

"అదికాదండీ..." అంటూ భర్తకి చేరువై అంది ఇంద్రాణి, "మా తమ్ముడికి పాపం, ప్రజల్లో మంచి పేరు తెచ్చుకోవాలని, సుప్రసిద్ధ పురుషుడు అనిపించుకోవాలనీ కోరికండీ. మా నాన్నగారు చిన్నప్పట్నుంచీ వాడ్ని నువ్వెలాగయినా గొప్ప పేరు సంపాదించుకోవాలిరా అంటూండేవారు. అది వాడి బుర్రలో నాటుకుపోయింది. ఒక సామాన్యుడిగా బతకడం పాపం వాడికి ఇష్టంలేదు. అందుకని ఇంతలా వెంపర్లాడుతున్నాడు"

"గొప్పపేరు సంపాదించుకోవాలన్న ఆశయం మంచిదే. దానికి మంచి పన్లు చెయ్యడం ఒక్కటే మార్గం. ప్రతి పనికీ ఫలాన్ని ఆశించకూడదు. అప్పుడు పేరు దానంతట అదే వచ్చి తీరుతుంది"

దీనబంధుకీ ఇక టాపిక్ మార్చడం మంచిదనిపించింది. క్రమేపీ ప్రెషర్ తెచ్చి బావగారి చేత రికమెండ్ చేయించుకోవడం సరయిన పద్ధతి అనిపించింది. అందుకనే "సరే బావగారూ! నా విషయం మీకు

నమ్మకం కలిగాకే చూద్దురుగాని. మీరు ఘన విజయం సాధించిన ఈ శుభ సందర్భంలో ముఖ్యమయిన వాళ్లని ఆహ్వానిస్తూ ఓ గంటలో మాంచి పార్టీ ఏర్పాటు చేస్తున్నాను" అన్నాడు.

"వద్దు ఏ పార్టీలు నాకు ఇష్టంలేదు. నా మనసుకి ఆనందంగా వుండడానికి నేను కిష్టయ్యకి కబురు పంపాను సింహాచలంతో"

ఆశ్చర్యంతో ఒక్కసారే అన్నారు అక్కాతమ్ముళ్లు, "కిష్టయ్యకా? !" అని.

"యస్, కిష్టయ్యకే" తల వూపుతూ అన్నాడు చక్రవర్తి.

"వాడొచ్చేం చేస్తాడండీ. ఒట్టి పల్లెటూరి బైతు. హేపీ మూడ్ అంతా పాడుచేస్తాడూ..." అంది ఇంద్రాణి.

"చక్కటి పాట పాడతాడు ఇంద్రాణీ. అందంగా చిందులేస్తాడు"

"నా మొహంకదూ! ఓ స్టెప్ వుంటుందా, ఓ బీట్ వుంటుందా? "

"హార్ట్ వుంటుంది ఇంద్రాణీ! మనసులోంచి వచ్చే ఏ కళయినా అందంగానూ, ఆనందంగానూ వుంటుంది"

"అదేవిటండీ, మా తమ్ముడు చక్కగా మంచి పార్టీ ఏర్పాటు..."

"చక్కగా అనిపించాల్సిందీ నాకు... అదుగో అదుగో వచ్చేశాడు కిష్టయ్య...రా రా...కిష్టయ్యా రా" అంటూ వినయంతో బిడియపడ్తూ, తడబడే అడుగుల్తో లోపలికొస్తూన్న కిష్టయ్యని ఎదురువెళ్లి చేతులు చాచి ఆహ్వానించాడు చక్రవర్తి.

కిష్టయ్య గుండెలు ఆనందంతో పొంగాయి. వినయంతో ఒరిగాయి. కళ్లల్లో నీళ్లు వూరాయి. ఆనందంతో పెదవులు ఒణికాయి. "బాబుగారూ" అంటూ వచ్చి చక్రవర్తి మెడలో మందారమాలని వేసి, చేతిలో పళ్లుపెట్టి గభాలున వాలి, కాళ్లకి దణ్ణంపెట్టాడు. అతన్ని లేవనెత్తి, కౌగలించుకున్నాడు చక్రవర్తి తన్మయుడై.

ఇంద్రాణికి, దీనబంధుకి ఒళ్లుమండిపోతోంది. తప్పనిసరి అయి నిభాయించుకున్నారు.

"సరే అయితే, మీ ఆనందానికి మేము అడ్డెందుకు? మేము వెళ్తాం. ఆనందంలో మునిగి వుండిపోకుండా, తేలండి! మీరు మీ ఆప్తులకి, ఆత్మీయులకి చేయవలసిన పనులు చాలా వున్నాయి" అంటూ లోపలకి వెళ్లిపోయింది ఇంద్రాణి.

"సరే బావగారూ, నేను ఆఫీసురూములో కూర్చుని, ఫోనుకాల్సు అటెండ్ చేస్తా. మేయర్‌గా మీరు చేపట్టబోయే మొదటి కార్యక్రమం ఏవిటని రిపోర్టర్లెవరన్నా అడిగితే ఏంచెప్పమంటారు? " బావగారి దగ్గర శలవుతీసుకుంటూ అడిగాడు దీనబంధు.

"ప్రస్తుతం నగరంలో కోతుల బెడద విపరీతంగా వుంది. ముందు టాప్ ప్రయారిటీతో ఆ సమస్యని నివారించే కార్యక్రమం చేపట్టుతాం అని చెప్పెయ్యి. ఇంక నన్ను ఇవాల్టికి డిస్టర్బ్ చెయ్యక నువ్వు మేనేజ్ చేసెయ్యి" అన్నాడు చక్రవర్తి.

దీనబంధు ముఖం వింతగా వెలిగింది. మెదడులో చురుకు ఆలోచన్లు ఉరకలు వేశాయి. "ఓకే బావగారూ, మీరు నిశ్చింతగా వుండండి. వాళ్లకు చెప్పడమేకాదు, కోతుల సమస్య తీరిపోతుంది. నేనున్నాగా అసలైన రామబంటుని. మీకు సమస్యల్ని మిగుల్చుతానా-న...గ...రం...లో కోతుల సమస్య..." అనుకుంటూ ఆఫీసురూమువైపుకు బోర విరుచుకుని అడుగులు వేశాడు.

అదే సమయంలో బయటనుంచి నంది హుషారుగా పరుగెత్తుకుంటూ వచ్చాడు. "కిష్టయ్యొచ్చాడుటగా, మీరు పెర్మిట్ చేస్తే నేనుంటాను మామయ్యా, కిష్టయ్య చిందులు అంటే గుండె ఝుల్లు ఝుల్లుమంటుంది నాకు" అన్నాడు బతిమాలుతూ.

నవ్వుతూ అంగీకారంగా తల వూపాడు చక్రవర్తి.

ముగ్గురూ గార్డెన్‌లోకి నడిచారు.

చల్లని వెన్నెట్లో లాన్స్‌లో హాయిగా, ఫ్రీగా

బాసింపీట వేసుకుని కూర్చుని "నువ్వు ప్రారంభించు కిష్టయ్యా" అన్నాడు చక్రవర్తి.

ఆసక్తితో చూస్తూ తనూ కూర్చున్నాడు నంది.

భక్తిగా నమస్కరించి, ప్రారంభించాడు కిష్టయ్య అభినయం, చిన్నచిన్న చిందులతో కూడిన పాటని.

**ఆ**ఫీసురూములో కూర్చుని ఫోను కాల్సు అటెండ్ చేస్తున్నాడు దీనబంధు అన్యమనస్కంగా. రాత్రి పదకొండు గంటలయింది. బయట చీకటి బాగా చిక్కబడింది. అతని గుండెల్లో దిగులులాగే. మనసు పరిపరివిధాలపోతోంది. బావగారి విజయం కోసం గత నెల్లాళ్లుగా నిద్రాహారాల సంగతి మరచిపోయి పనిచేశాడు తను. మరిప్పుడు తనక్కావలసిన ప్రతిఫలం దొరుకుతుందా, నిరాశే మిగులుతుందా? బావగారన్నదీ నిజమే మరి! రికమెండేషన్లతో పైకొద్దామనుకున్నా వాళ్లెవరూ ప్రజానాయకులుగా శాశ్వతంగా నిలవలేరు. ప్రజల్లో నమ్మకాన్ని తమమీద కలిగించుకోగలగాలి. దానికేదో ఘనకార్యం చెయ్యాలి. నిస్వార్థజీవి, ప్రజల కోసం ప్రాణమయినా త్యాగం చేయగల త్యాగధనుడు అనిపించుకోవాలి. ఎలా? అతని ఆలోచన ఈరోజు ఊరేగింపులో జనాన్ని కంట్రోల్ చేయడంలో ముఖ్యపాత్ర వహించిన అజ్ఞాత వాలంటీరు ప్రకాశం మీదకు పోయింది. అవును అతన్ని తన దగ్గరకు వచ్చి కలవమని కబురు పంపాడుగా. మరి రాలేదేం? అసలు కబురందిందా లేదా? రేపు ఉదయం ప్రకాశాన్ని తను చూడాలి! తప్పదు. తనింకా ఆలస్యం చేయకూడదు



★ ★ ★

విశ్వప్రయత్నంమీద ప్రకాశం అడ్రస్సు తెలుసుకున్నాడు దీనబంధు. ఇప్పుడింక అతన్ని తన దగ్గరకు పిలిపించుకోవాలా, తనే అతని దగ్గరకు వెళ్ళాలా అనే మీమాంసలో పడ్డాడు. బాగా ఆలోచించి, తనే అతని దగ్గరకు వెళ్లడం ఉత్తమం అని నిర్ణయించుకుని, ఉదయం ఆరుగంటలకే స్నానం ముగించి, నొసట బొట్టు, చెవుల్లో పూలు ధరించి, తన కార్యం నిర్విఘ్నంగా జరిగేలా తోడ్పడమని దేవుడికి మొక్కుకుని, ఇద్దరు ముఖ్య అనుచరులతో ప్రకాశం ఇంటికి కారులో బయల్దేరాడు దీనబంధు.

అప్పటికే నిద్రలేచి కాలకృత్యాలు తీర్చుకున్న ప్రకాశం- తమ్ముడ్నీ, చెల్లెలినీ స్కూళ్లకి పంపడానికి సిద్ధంచేస్తున్నాడు. రోగిష్టి తల్లిని బలవంతంమీద మంచంమీద కూర్చోబెట్టి వంట పనికూడా చూస్తున్నాడు. న్యూస్ పేపర్లో పడ్డ ఉద్యోగాలకి అప్లికేషన్లు పూర్తిచేస్తున్నాడు. ట్యూషన్ చెప్పించుకోవడానికొచ్చిన కుర్రాళ్లని చాపమీద కూర్చోబెట్టి లెక్కలు చెబుతున్నాడు. మొత్తంమీద అష్టావధానం చేస్తున్నాడు.

ఆ సమయంలో చిన్న కుటీరంలాంటి ఆ ఇంటి కర్రలగేటుముందుకు వచ్చి ఆగింది కారు.

ఇంటిముందు ఆగిన కారు చప్పుడు వింటూనే అందరూ కంగారు పడ్డారు. పిల్లలు గబగబా బయటకు పరుగెత్తుకొచ్చి వింతగా చూస్తున్నారు. మరు నిముషంలో

ప్రకాశం చూరు తగలకుండా బాగా వంగి బయటకొచ్చి కారులోనుంచి దిగుతూన్న దీనబంధుని చూసి విస్తుబోయాడు. అప్రయత్నంగా రెండు చేతులూ జోడించి, గేటు బయటకు పరుగెత్తాడు.

ఓపికచేసుకుని లేచి, దగ్గుకుంటూ బయటకొచ్చి కంగారుగా బయటకు చూస్తోంది ప్రకాశం తల్లి మాలక్ష్మమ్మ.

చేతులు జోడించి వినయంగా తన దిక్కు పరుగెత్తుకొస్తూన్న ప్రకాశాన్ని ఆత్మీయంగా అందుకున్నాడు దీనబంధు.

"సర్... మీరు... ఇలా... మా ఇంటికి... నమ్మలేకపోతున్నా సర్..." ప్రకాశానికి పగలే చంద్రుడ్ని చూస్తున్నంత ఆశ్చర్యంగా వుంది.

"అవునయ్యా... నేనే... మీ ఇంటికే వచ్చాను. ఇందులో నువ్వంత ఆశ్చర్యపోవలసినపనిలేదు. నిన్న ఊరేగింపులో నీ పర్సనాలిటీ, నీ చురుకుదనం, నీసేవ, నీ నేర్పరితనం నన్నూ, మా బావగారినీ బాగా ఆకట్టుకున్నాయి. గతంలో మేం ఎప్పుడూ నిన్ను చూడనైనాలేదు. నీకు మేం ఎటువంటి సహాయం చేసినట్లులేదు. మరెందుకు అంతలా శ్రమించావో..."

"దీనబంధు మాటల్ని పూర్తిచేయకముందే అన్నాడు ప్రకాశం, "లేదు సర్, నేను చేసిందేంలేదు. మీవంటి పెద్దలు నన్ను పొగడకూడదు. అందులో మేయర్ కళ్యాణచక్రవర్తి గారికి సేవచేయడమంటే పూర్వజన్మ సుకృతం సార్. ఆయన ప్రజల హృదయాల్లో స్థిరంగా నిలిచిపోయారు. నిస్వార్థంగా ఇన్నాళ్లూ ఆయనచేసిన ప్రజాసేవలకే కదా సర్ ఆయనకు జనం పట్టం కట్టారు. ఆయన ముందు నేను చేసినదేం వుంది సర్. అయినా నేను పడ్డ శ్రమలో కూడా స్వార్థం వుంది సార్" అన్నాడు.

"స్వార్థమా? ఏమిటది? " అన్నాడు దీనబంధు. ఉపోద్ఘాతం అయిపోయి, ఇక అసలు పనిలోకి ప్రవేశించడానికి సిద్ధపడుతూ.

"అయ్యో పెద్దలు, మీరు నిలబడే వున్నారు. లోపలకి రండి సార్, కూర్చుందురుగాని..." అంటూ లోపలకి దారితీసి, నులకమంచం వాల్చి "మా పరిస్థితి ఇది సర్, మీవంటి పెద్దవాళ్ళు వచ్చినప్పుడు కూడా కూర్చోబెట్టడానికి మంచి కుర్చీలయినాలేవు" అన్నాడు ప్రకాశం.

అనుచరులని బయటే ఆగిపొమ్మని, లోపలకు ప్రవేశించిన దీనబంధు నులకమంచం మీద కూర్చుంటూ "మనసా ఆహ్వానిస్తూ కూర్చోమని చూపించిన నులకమంచమయినా, నూరు సింహాసనాలకు సమానమయ్యా" అన్నాడు నవ్వుతూ.

ప్రకాశం వినయంగా దీనబంధు కాళ్ల దగ్గర కూర్చుని, "ఆవిడ మా అమ్మగారు సార్- ఆవిడకు వచ్చిన అనారోగ్యానికి ట్రీట్‌మెంట్ చేయించడం మా శక్తికి మించినపని. నేనా నిరుద్యోగిని. వాళ్ళిద్దరూ నా తోబుట్టువులు. ఇంకా బాగా చిన్నవాళ్లు. మానాన్నగారు రైల్వేలో పనిచేసేవారు. ఒక ఏక్సిడెంటులో చనిపోయారు. నేను పోస్టుగ్రాడ్యుయేట్‌ని సార్. కాని, నిరుద్యోగిని. ఉద్యోగం వెంటనే దొరకడం నాకెంతయినా అవసరం. ముఖ్యంగా మా అమ్మగారికి ట్రీట్‌మెంటిప్పించి, ఆవిడ్ని మామూలు మనిషిని చేయాలి. అందుకనే మేయర్‌గారిని కలిసి, నాగోడు వినిపించాలనుకుంటున్నానుసార్. మీరు కూడా నాయందు దయుంచి నాకు సహాయం..." గొంతు పూడుకుపోయింది.

దీనబంధు ప్రకాశం తల్లిని, తోబుట్టువుల్ని ప్రేమగా చూసి, ప్రకాశం వీపు నిమురుతూ, ధైర్యం కలిగిస్తూ అన్నాడు, "ప్రకాశం ఇంక నువ్వు నిశ్చింతగా వుండు. మేయర్‌గారి దగ్గరకు వెళ్లాల్సిన అవసరం లేదు. నీ పరిస్థితిని పూర్తిగా అర్థంచేసుకున్నాను. నేను స్వయంగా వచ్చి నిన్ను కలిశానంటే ఇంక నువ్వు నా స్వంత మనిషివన్నమాట. నీకు ఉద్యోగం దొరికినట్లే. నీ పెర్సనాలిటీ, నీ చురుకుదనం, నీ తెలివితేటలకీ తగ్గ

ఉద్యోగం యిచ్చే బాధ్యత నాదీ, సరా?" అంటూ లేచాడు.

కళ్లనీళ్లయి పోయాడు ప్రకాశం, చేతులు జోడించి నిలబడిపోయాడు.

"బాబూ- మీరెవరో దేవుళ్లా వచ్చారు. మీ రుణం తీర్చుకోలేం" అంది మాలక్ష్మమ్మ లేచి నిలబడడానికి ప్రయత్నిస్తూ.

"ఆc ఆc... మీరు కూర్చోండి. ఇంక మీ అబ్బాయి గురించి మీరేం బెంగపడకండి. అతని బాధ్యత నాది. త్వరలోనే మిమ్మల్ని మంచి డాక్టరుకి చూపిద్దాం. పిల్లలని మంచి స్కూల్లో జేర్పిద్దాం. మీరు మరో మంచి ఇంటిలోకి మారిపోదురుగాని"

ప్రకాశం చటుక్కున దీనబంధు కాళ్లకి నమస్కరించాడు.

"ఈరోజు పది గంటలకి నన్నొచ్చి కలువు" అని చెప్పి, బయటకొచ్చి, కారు ఎక్కాడు దీనబంధు. కారు ముందుకు దూసుకుపోయింది. కలో నిజమో అర్థంకాక పట్టలేని ఆనందంతో చేతులు జోడించి నిలబడిపోయాడు ప్రకాశం.



గత మూడురోజులుగా కళ్యాణచక్రవర్తిగారికి మేయర్ అయిన సందర్భాన్ని పురస్కరించుకుని, సత్కారం జరపడానికి చాలా సంస్థలే ప్రయత్నించాయి. కానీ, ఆయన ఎంతమాత్రం వీలులేదన్నారు. తను మేయర్‌గా గెలవడం ఓ ఘనకార్యం సాధించినట్లుగా భావించడంలేదన్నారు. పైగా నగరంలో తనకళ్లెదురుగా అనేక సమస్యలతో బాధలు పడ్తూన్న ప్రజలు వుంటే తను సన్మాన సత్కారాలతో సంబరాలు జరుపుకోలేనన్నారు. అందులో గత మూడు రాత్రులుగా నగరాన్ని ఒణికిస్తూన్న 'క్రొత్త సమస్య' ఆయన మనసుని మరింత కలవరపెడ్తోంది. ఆయనకి నిద్రాహారాలు లేకుండా చేస్తోంది.

ప్రొద్దున్న లేస్తూనే న్యూస్‌పేపర్ చూడాలంటేనే భయం పట్టుకుంది చక్రవర్తికి ఈరోజు ఏం దారుణమయిన వార్త వినాల్సి వస్తుందోనని. అలాగే ఈరోజూ పేపర్లు గత రాత్రి కొందరు ప్రజలు భయంతో బాధతో నరకం అనుభవించారని రాయనే రాశాయి. చక్రవర్తి మనస్సు వికలం అయిపోయింది. ఆందోళనగా, కోపంగా, బాధగా, అస్థిమితంగా పచార్లుచేయసాగాడు. ఆయనకి చేరువలోనే చేతులు కట్టుకుని విచారంగా, తీవ్రంగా ఆలోచిస్తూ దీనబంధు నిలబడి వున్నాడు.

చేతిలోని పేపర్‌మీద వ్రేళ్లతో చరుస్తూ అన్నాడు చక్రవర్తి, "ఏవిటయ్యా, ఏవిటయ్యా యిది? నగరమా, నరకమా యిది? ఏవో కోతులు కాలనీల్లో పడి అల్లరిచేస్తూ, చికాకు పరుస్తున్నాయంటే, వాటి బెడద నగరప్రజలకు వదల్చాలని నేను అనుకుంటే ఇదెక్కడి ఉపద్రవం ఈ కొత్త సమస్య- ఈ భయంకర కోతి ఎక్కడనుంచి వూడిపడిందయ్యా? హవ్వహవ్వ... ఒక్క కోతిట... చెయ్యెత్తు ఆకారమట... గత మూడు రాత్రులూ నగరాన్ని గడగడలాడించేసింది. పేపర్లన్నీ హోరెత్తించేస్తున్నాయి?"

"అదే అర్థంకావట్లేదు బావగారూ, వింత సమస్యే వచ్చిపడింది"

"కమీషనర్‌గారేం అంటారయ్యా?"

"పాపం, ఆయన ప్రయత్నాలు ఆయన చేస్తూనే వున్నారు బావగారూ. ఆయనకీ గత మూడు రోజులుగా నిద్రాహారాలులేవు"

"వెధవ నిద్రాహారాలేవిటయ్యా... అవతల అమాయక ప్రజలు భయంతో గుండెలాగిచస్తూంటే! ఏదీ కమిషనర్‌కి లైను కలుపు"

మునిసిపల్ కమీషనర్‌కి సెల్‌ఫోన్‌లో లైను కలిపి, అందించాడు దీనబంధు.

"హల్లో- కమీషనర్‌గారేనా? చక్రవర్తి హియర్"

"నమస్కారం సర్"

"నమస్కారం సార్... కమీషనర్‌గారూ! నేనూ, మీరు, అసలు మన మునిసిపల్ డిపార్ట్‌మెంట్ వున్నాయంటారా?"





"అదేవిటి సార్. అలా అంటున్నారు"

"నేననడం కాదండీ... అన్ని పేపర్లూ అంటున్నాయి మహానుభావా!"

"సర్... పోలీసు డిపార్ట్‌మెంటు..."

"పోలీసు డిపార్ట్‌మెంట్ సరేనండి. ఇన్నాళ్లూ కొన్ని వందల కోతులు నగరాన్ని చికాకుపరిచాయి. మన డిపార్ట్‌మెంట్ ఏమీ చెయ్యలేదు. అన్ని వైపులనుంచీ అక్షింతలూ, పేడముద్దలూ పడ్డాక మనలో చలనం కలిగి, ఏదో కొద్దోగొప్పో ఆ బెడద తీరుద్దా మనుకుంటే ఈ రాక్షసకోతి ఎక్కడనుంచి వచ్చి పడిందండీ? "

"ఆరా తీస్తున్నాం సార్"

"ఆరా తీయడం సంగతి తర్వాత చూద్దాం. ముందు ప్రజల ప్రాణాలు కాపాడాలి కదా మనం... పోలీసుల మీద పూర్తి బాధ్యత వదిలేసి వూరుకోకూడదండీ. ఏం చెయ్యాలో నాకయితే బోధపడడం లేదు"

"సర్ మన ప్రయత్నాలు గట్టిగానే వున్నాయి. మీరు చికాకు చేసుకోకండి మనస్సు. త్వరలోనే సమస్య పరిష్కారం అవుతుంది సర్"

"ఏమో, మనసంతా అల్లకల్లోలంగా వుందండి కమీషనర్‌గారూ. సారీ, నేను కొంచెం హార్ష్‌గా మాట్లాడాను"

"అయ్యో, అదేం ఫరవాలేదు సర్"

"ఓకే... గట్టి ప్రయత్నమే చెయ్యకపోతే జనంముందు తలెత్తుకు తిరగలేం మనం... ఉంటా"

సెల్ ఫోనుని బావమరిదికి విసురుగా అందించి, అస్థిమితంగా పచార్లు ప్రారంభించాడు చక్రవర్తి.

గుమాస్తా కేశవరావుగారొచ్చి, "అయ్యా, ఇన్‌స్పెక్టర్ ప్రతాప్‌గారొచ్చారండీ, ఆఫీసు రూంలో కూర్చున్నారు" అని చెప్పి వెళ్లారు.

చక్రవర్తి చరచరా ఆఫీసురూంవైపు నడిచాడు.

దీనబంధు అనుసరించాడు.

"సర్ నమస్కారం" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

ఇన్‌స్పెక్టర్ని చూస్తూనే మళ్ళీ కోపం తన్నుకొచ్చింది చక్రవర్తికి. "ఓహో నేరస్థులకీ, నిశాచరులకీ సింహస్వప్నం ఇన్‌స్పెక్టర్ ప్రతాప్‌గారా. నమస్కారం సర్" అంటూ రెండు చేతులూ జోడించాడు.

దెబ్బతిన్నాడు ఇన్‌స్పెక్టర్.

బావగారి వెనగ్గా నిల్చున్న దీనబంధు బావగారు కోపం మీదున్నారు, జాగర్తగా మాట్లాడమని సంజ్ఞలు చేశాడు ఇన్‌స్పెక్టరుకి.

ఏమనాలో తెలియక, "సర్ మీరు కోపం మీదున్నారు" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

కోపం ఇంకొంచెం పెరిగిన చక్రవర్తి, "కోపం కాకపోతే ఏమిటయ్యా. మీ డిపార్ట్‌మెంటు, మా డిపార్ట్‌మెంటు ఎందుకయ్యా, ప్రజల సొమ్ముని చక్కగా తిని కూర్చోవడానికా? అరె ఒక్కకోతి, ఒక్కకోతిని అడ్డుకోవడానికి మన డిపార్ట్‌మెంట్స్‌లో దమ్ములున్న మగాళ్లే లేరా? " అని అరిచాడు.

"సర్ మీరు కొంచెం శాంతపడ్తే విపులంగా చెప్పగలను నేను" అన్నాడు ఇన్‌స్పెక్టర్ రిక్వెస్టింగ్‌గా.

అతని ముఖంలోకి సూటిగా చూశాడు చక్రవర్తి. అప్పుడనిపించింది తను అనవసరంగా తన చికాకుని పాపం అతనిమీద చూపిస్తున్నానని, సర్దుకుని, అతని భుజం మీద చనువుగా చెయ్యివేసి, "సారీ ప్రతాప్ నేను కోపంమీద వున్న మాటయితే నిజమే. ప్లీజ్, కూర్చోండి" అంటూ కూర్చోపెట్టి, తను పచార్లు చేస్తూ, "నేను తొందరపాటు మనిషిని కాదు ప్రతాప్. కానీ ఈ విషయంలో సహనం పోతోంది. పేపర్లు చూస్తుంటే కన్నీళ్లొస్తున్నాయి. సిగ్గుతో తల ఒంగిపోతోంది" అన్నాడు బాధగా.

ఒక నిముషం మూడ్ మారి, బావగారు స్థిరపడతారేమోనని ఆగి, ఆయనలో మార్పు లేకపోవడంతో, ఆయన్ని శాంతపరచడానికి దీనబంధు ముందుకొచ్చాడు. "మీరు కొంచెం ప్రశాంతంగా వుండండి బావగారూ. మిమ్మల్ని ఈ విచారంనుంచి దూరం చెయ్య

లేకపోతున్నందుకు, మిమ్మల్ని మించి బాధగా వుంది నాకు. కాని ఏం చేస్తాం? ఆవేశం, ఆవేదన కంటే ఆలోచనకే ఎక్కువ విలువ ఇప్పుడు. ఇప్పుడీ పరిస్థితుల్లో మీరు ఆందోళనపడి చెయ్యగలిగినది ఏమీలేదు. ఏం చెయ్యగలిగినా ఒక్క పోలీసు డిపార్ట్‌మెంట్ చెయ్యగలదు"

చటుక్కున తలెత్తాడు ప్రతాప్. "చేస్తున్నాం సర్ మేం చెయ్యగలిగినదంతా చేస్తున్నాం. మా కమీషనర్ స్వయంగా సూపర్‌వైజ్ చేస్తున్నారు. మూడువందల మంది పోలీసులం నగరం అంతా గాలిస్తున్నాం. కానీ, ఒక్కరికీ ఆ భయంకర కోతి కనబళ్లేదు"

ప్రతాప్ కొంచెం హర్ట్ అయ్యాడని గ్రహించిన చక్రవర్తి, అతని పక్కకుర్చీలో కూర్చుని, భుజంమీద చెయివేసి "పెర్సనల్‌గా తీసుకుని, ఫీలవ్వద్దు ప్రతాప్. కలెక్టివ్‌గా అందరం ఆలోచించాల్సిన సమస్య యిది. చాలానాళ్లుగా నువ్వు మాకు తెలుసున్నవాడివి కావడంతో నీతో ఎక్కువ చనువుగా మాట్లాడుతున్నాం అంతే" అన్నాడు.

"అదేం వింతండీ పేపర్లలో, టీవి ప్రోగ్రాములలో కోతిని చూసినవాళ్లు, కోతి బాధితులు అంటూ జనం గురించి వ్రాస్తున్నారు. కొందర్ని చూపిస్తున్నారు. వాళ్లు ఆ కోతిని రకరకాలుగా వర్ణిస్తున్నారు. మరి, సారీ ఏమనుకోవద్దు. పోలీసులకి మాత్రం అది ఎందుకు కనబడడం లేదు. కనీసం అది ఏ ఏరియాలో వుందో తెలియగానే దాన్ని అన్ని వైపులనుంచి దిగ్బంధం ఎందుకు చేయలేకపోతున్నారూ? " అన్నాడు దీనబంధు.

తనదీ అదే సందేహం అన్నట్లుగా ప్రతాప్‌వైపు చూశాడు చక్రవర్తి.

"సర్ గత మూడు రాత్రులూ ప్రతిరాత్రీ మా డిపార్ట్‌మెంట్ కనీసం వంద ఫోను కాల్స్ అందుకుని వుంటుంది సర్, కోతి తమ ఏరియాలో తిరుగుతోందంటూ. తీరా మావాళ్లు మందీమార్బలంతో అక్కడకు వెళ్లి గాలిస్తే, ఏమీ కనబడదు. ఆకతాయిగా కొందరూ, భయంతో కొందరూ మమ్మల్ని పక్కదారి పట్టిస్తున్నట్లున్నారు సర్. దాంతో ఆ వింత కోతికి తప్పించుకోవడం సులభం అయిపోతున్నట్లుగా వుంది" అన్నాడు ప్రతాప్ అసహనంగా చేతులు పిసుక్కుంటూ.

అతని వీపు నిమురుస్తూ అన్నాడు చక్రవర్తి, "డోంట్‌వర్రీ. ప్రయత్నాలు కానియ్యండి- ఫలితం దేముడిమీద వదిలిపెడదాం"

"సరే సర్ శలవు" అంటూ లేచాడు ప్రతాప్.

దీనబంధు బావగారి ముఖాన్ని కమ్ముకుంటూన్న విచారఛాయల్నే గమనిస్తూ నిలబడిపోయాడు.



నగర పారిశుధ్యం, మంచినీటి సమస్యలతోబాటు కోతి సమస్య గురించి కూడా ఆఫీసర్లందరితోటీ గట్టిగా చర్చిస్తున్నాడు చక్రవర్తి. అందరూ దాన్ని పట్టుకోవడానికి ప్రయత్నాలు ముమ్మరం చేశారు. దాన్ని పట్టుకోగలిగితే ప్రపంచానికి ఓ వింత జంతువుని చూపించొచ్చు ప్రజలు వర్ణిస్తూన్న ప్రకారం వున్న ఆ వింత కోతి ఏ జాతికి చెంది వుంటుందో అటవీశాఖ వాళ్లు కూడా ఖచ్చితంగా చెప్పలేకపోతున్నారు. రాత్రుళ్లే బీభత్సం సృష్టిస్తున్న ఆ వింత కోతి పగలు ఏమవుతోందీ అనే దానికి కూడా ఎవ్వరిదగ్గరా సమాధానంలేదు. తను మేయర్ అయినప్పట్నుంచీ ప్రజలు మరింత కష్టాలని ఎదుర్కోవడం చక్రవర్తిని కృంగదీస్తోంది. రోజూలాగే గతరాత్రి కూడా సమస్యల పరిష్కారానికి సంప్రదింపులతో చాలా ఆలస్యంగా నిద్రపోయాడేమో, ఈ ఉదయం కొద్దిగా ఆలస్యంగా నిద్రలేచిన చక్రవర్తి, బద్ధకంగా ఒళ్లు విరుచుకుని, మంచం దిగబోతుండగా,

గుండెల్ని కలచివేసే ఆర్తనాదం, "అయ్యో" అంటూ.

అదిరిపడి, హాలువైపు నడిచాడు చక్రవర్తి.

అక్కడ ఒళ్లంతా దెబ్బలు, కట్లుతో కిష్టయ్యా నిలబడి వున్నాడు దీనంగా చూస్తూ.

అతన్ని చూసి బాధగా, ఆర్ద్రంగా "కిష్టయ్యా" అన్నాడు చక్రవర్తి. ఆత్మీయమయిన ఆ పిలుపుకి అప్పటిదాకా ఆపుకున్న దుఃఖం ఆగక "అయ్యా" అంటూ బావురుమన్నాడు కిష్టయ్య. ఆపైన ప్రయత్నపూర్వకంగా చక్రవర్తి కాళ్ల ముందు పడబోయాడు. అతన్ని గబుక్కున పొదివి పట్టుకుని, కూర్చోపెట్టాడు చక్రవర్తి.

కిష్టయ్య 'అయ్యా' అని అరిచిన అరుపు విని మేడమీది గదిలో పేపరు చదువుతున్న దీనబంధు కూడా కిందకు పరుగెత్తుకొచ్చాడు. కిష్టయ్యని చూసి, "అరెరె- కిష్టయ్యా ఏమిటిది?" అన్నాడు సానుభూతిగా.

కిష్టయ్యా నోట మాటరాక దుఃఖానికి లొంగిపోయాడు.

చక్రవర్తి అతన్ని అనునయించి, ఊరడిస్తూ అడిగాడు "కిష్టయ్యా ఏమిటిది. ఈ రక్కులేమిటి, ఈ దెబ్బలేమిటి కిష్టయ్యా? ఏం జరిగింది?"

దుఃఖంనుంచి గుక్కతిప్పుకుని కళ్లు తుడుచుకుంటూ చెప్పాడు కిష్టయ్య, "కోతి బాబూ పెద్ద కోతి! తెల్లవారుఝామున అల్పాచిమానానికి పెరట్లోకి వెళ్తే అమాంతం మీదికురికింది అయ్యా. దాన్ని ఎదుర్కోవడం నా చేతకాలేదు. పులి పంజా విసిరినట్లు విసుర్తూ, ఒళ్లంతా కుమ్మేసింది. రక్కేసింది. ఓ అయిదు నిముషాలపాటు మీదపడి చితకబొడిచేసి గోడదూకి పారిపోయింది. నాకు స్పృహ తప్పిపోయింది. అర్థగంట క్రితమే కళ్లు తెరిచాను. గట్టిగా అరచి గోలచేస్తే మావాళ్లొచ్చి చూసి, కట్లుకట్టారు" అంటూ ఏడ్చాడు.

చక్రవర్తికి నోటమాట రాలేదు. తలపట్టుకుని కూలబడ్డాడు.

సింహాచలం ద్వారా విషయం తెలుసుకున్న ఇంద్రాణి ఆందోళనగా పరుగెత్తుకొచ్చి భర్తని చూసి గాభరా పడిపోయింది.

అక్కగారికి ధైర్యం చెబ్తూ భుజంతట్టి బావగారి దగ్గరకు చేరి అనునయంగా అన్నాడు దీనబంధు. "బావగారూ మీరే ఈ విషయంలో ఇంత డీలాపడిపోతే ఎలా? ఇప్పుడు పని కల్పించాల్సిందీ మెదడుకేగాని గుండెకి కాదండీ. మనసు పాడు చేసుకుంటున్నకొద్దీ సమస్య మరింత జటిలం అవుతుంది. మీకెందుకు, ఈ విషయాన్ని నామీద వదిలేసి మీరు నిశ్చింతగా వుండండి. రామబంటులాంటి వాడ్ని. మీకోసం ప్రాణం ఇస్తాను అవసరమయితే. సరా?"

చక్రవర్తికి దుఃఖం ఆగలేదు. నెమ్మదిగా తలెత్తి బాధగా అన్నాడు. "నేను వినలేకపోతున్నానయ్యా! ఈ అమాయకుల బాధలూ" అని.

"నిజమేకాని తప్పదు మరి. కొద్దోగొప్పో కరకు గుండెలవాళ్లం. మాకే గుండె చెరువైపోతుంటే వెన్నలాంటి మనసున్న మీకు బాధగా వుండదుటండీ..." అంది ఇంద్రాణి.

"రాజకీయాల్లో దిగాక రాటుదేలాలి బావగారూ! వేరే మార్గంలేదు. ప్రజాక్షేమం బాధ్యత మీద వేసుకున్నాక వినిపించేవి అన్నీ బాధలే. విన్నవన్నీ మనసుకి తీసుకోకూడదు. అందులో ఆర్చేవాళ్లూ తీర్చేవాళ్లూ వుంటే, అలగాజనం ఆగకుండా కష్టాలు చెబ్తూ, కన్నీళ్లు కార్చుతూనే వుంటారు" అంటున్న దీనబంధు తటాలున బావగారు తనవైపు తీవ్రంగా చూడ్డంతో సర్దుకుని "అహ... కిష్టయ్యనుద్దేశించి కాదు నా మాటలు జనరల్‌గా చెబ్తున్నా. ఇతని పరిస్థితి కళ్లెదురుగా కనిపిస్తూనే వుందిగా. ఇంకా నయం ప్రాణాలతో వదిలిపెట్టింది పాపం" అన్నాడు.

ఇంద్రాణికి కిష్టయ్యా పొద్దున్నే వచ్చి భర్తతో గోడు చెప్పుకోవడం ఏమాత్రం నచ్చలేదు. ఉండబట్టలేక ఆ విషయాన్నే పైకి అనేసింది కూడా. "జరిగినది బాధాకరమయిన విషయమయినా, కిష్టయ్యా పెద్దవాడికదా! కొంచెం ఆలోచించొద్దూ ఇలా

పొద్దున్నే డైరెక్టుగా అయ్యగారి దగ్గరకొచ్చి బాధలు చెప్పుకోవడం బాగుందా? ఆయన సరే ఎవరికయినా సూది గుచ్చుకుందని తెలిసినా విలవిల్లాడిపోతారు. ఆయనకి నువ్వు ఆప్తుడివి. నీకిలా జరిగిందని తెలిస్తేనే బాధపడిపోతారే! అలాంటిది ఇలా ఏడుస్తూ నువ్వు స్వయంగా వచ్చి కనబడ్తే మామూలుగా వుండగలరా? "

వెంటనే అన్నాడు కిష్టయ్య, "నిజమే నమ్మా! నాది తప్పే! ఆ పిచ్చికోతి నన్ను బాధపెడ్తే పాపం అయ్యగారు మాత్రం ఏం చేస్తారు? తొందరపడ్డాను పొద్దున్నే. వెన్న లాంటి అయ్యగారి మనసు బాధ పెట్టాను. పాపిష్టోడ్ని! అయ్యా నన్ను క్షమించండి. శరీరానికి తగిలిన దెబ్బలే కదండయ్యా. అవే తగ్గిపోతాయి. తమరు మనసు కష్టపెట్టుకోకండయ్యా"

వారిస్తూ "ఇంద్రాణీ! వద్దు అతన్నేం అనొద్దు! నాతో చెప్పుకుంటే కొంతయినా ఉపశమనంగా వుంటుందని పాపం వచ్చాడు. ఎవరయినా తమ బాధని ఆత్మీయులతో చెప్పుకునే కదా ఉపశమనం పొందుతారు! పాపం అమాయకుడు ఏం పాపం చేశాడని ఆ దిక్కుమాలిన కోతి ఇతన్ని బాధించాలి? " అంటూ బాధపడుతున్న చక్రవర్తి చూపు వీధి గుమ్మంలోంచి లోపలకి వస్తూన్న కేశవరావు గారమ్మాయి ముగ్ధమీద పడింది. వనబాలలా వుందామె. పేరుకి తగ్గట్టే ముగ్ధమనోహరంగావుంది. ఆమెతోబాటే నందీ వున్నాడు.

మామయ్య, అత్తయ్య, తంత్రీ వరండాలోనే దర్శన మివ్వడంతో హడావుడిగా తన కడుపులో వున్న సమాచారాన్ని కక్కెయ్యడానికి పరుగెత్తుకొచ్చాడు నంది. "మామయ్యా మామయ్యా! మీకీ విషయం తెలుసా? పాపం కిష్టయ్యని కోతి..." అంటూ చెప్పబోయి కిష్టయ్య అక్కడే వుండడం చూసి "అరే! నువ్విక్కడే వున్నావా? కోతి నిన్ను అటాక్ చేసిందని చెప్పేశావా? ఛఛఛ... అందరికంటే నేనే ముందు చెప్పాలని ఎంతో ఆశతో వచ్చానే" అంటూ బాధపడిపోయాడు.

ముగ్ధని చూస్తుంటే చక్రవర్తి మనసు కొంత తేలికపడింది. ఆమెని చూస్తుంటే పసి పాప నవ్వులోని నిర్మలత్వం గోచరిస్తుంది ఆయనకి.

"రారా అమ్మడూ రా! గుడికెళ్లి వచ్చావా, మహాలక్ష్మిలాగున్నావు? " అన్నారు.

"అవును అయ్యగారూ"

"అదుగో ఆ అయ్యగారూ అన్న పిలుపు మానెయ్యమన్నానా? " చనువుగా కసిరాడు చక్రవర్తి.

గలగలానవ్వేసి "అలాగే బాబాయిగారూ. ఊళ్లో రాక్షసకోతి బెడద బాగా వుందికదా! ఆ బెడద నుంచి రక్షించమని రాములవారి గుళ్లో పూజ చేయించాను" అంటూ ప్రసాదం అందించబోయింది.

"ఉంచమ్మా! కొంచెం ఆగి తీసుకుంటాను"

"ఏదీ ఆయన ఇంకా మొహమయినా కడుక్కోలేదు. ఇదుగో..." అంటూ కొంచెం ఈసడింపుగా కిష్టయ్యవైపు చేయి చూపిస్తున్న భార్యవైపు తీవ్రంగా చూశాడు చక్రవర్తి. ఆవిడ సర్దుకుని "అదే పాపం ఇతనికి దెబ్బలు తగిలాయికదా! పరామర్శిస్తున్నారు" అంది.

అప్పుడు చూసింది ముగ్ధ కిష్టయ్యని

విపరీతంగా నొచ్చుకుంటూ "అయ్యయ్యయ్యో బాబాయిగారూ, పాపం ఇతన్ని ఆ పాడు కోతి బాగా గాయపరచినట్లుందే? " అంటూ వెళ్లి కిష్టయ్య పక్కన కూర్చుని అతని ఒంటిమీద చేయివేసి గాయాలను చూస్తూ బాధపడసాగింది.

"అవునమ్మా" అన్నాడు చక్రవర్తి తనూ బాధపడ్తూ.

"బాబాయిగారూ ఇతన్ని లోపలకి తీసుకెళ్లి మందు రాస్తాను"

"తీసుకెళ్లమ్మా లోపలికి తీసుకెళ్లు"

"అబ్బే వద్దులెండయ్యగారూ! నేను వెళ్తాను. దెబ్బలు అవే తగ్గిపోతాయి"

అంటూ మొహమాట పడ్తూ, కిష్టయ్య లేవ బోయాడు.

"తగ్గవు, అదుగో ఆ బంగారు తల్లి చేయి పడితేనే తగ్గుతాయి. లోపలకి తీసుకెళ్లరా అమ్మడూ! పాపం మందు రాయి" అంటూ తనూ చేయూత ఇచ్చి కిష్టయ్యని లేపి నిల బెట్టాడు చక్రవర్తి.

"నేను తీసుకెళ్తాను. మీరు వదిలెయ్యండి మామయ్యా" అంటూ నంది ముందుకొచ్చాడు.

నంది, ముగ్ధ చెరోవైపు ఆసరా ఇవ్వగా కిష్టయ్య నెమ్మదిగా లోపలకి నడిచాడు.

చక్రవర్తి మనసు కొంత కుదుటపడింది. భార్యతోపాటు లోపల గదుల్లోకి వెళ్లిపోయాడు.

వెనగ్గా మిగిలిపోయిన దీనబంధు దృష్టి కిష్టయ్యని ఆసరాతో లోపలకి తీసుకెళ్తూన్నప్పుడు చనువుగా తగుల్తూన్న నంది, ముగ్ధల చేతుల మీద పడింది.

అతని మెదడు వేడెక్కుతోంది.

★ ★ ★

మేడమీద తన బెడ్‌రూంలో మంచం మీద బద్ధకం వదలక దొర్లుతున్నాడు కన్నబాబు. రాత్రి కొంచెం డోసు ఎక్కువ అయ్యింది. మీ నాన్న నగర మేయర్ అయ్యాడు పార్టీ ఏదిరా అంటూ ఫ్రెండ్స్ బలవంతం చేస్తే బ్లూమూన్ బార్లో గట్టి పార్టీయే ఇచ్చాడు.

ఇంకా నయం తండ్రికి తెలియదు, తను తాగొచ్చాడని రాత్రి. లేకపోతే రాత్రే చెమడాలు ఎక్కదీసేసి వుండేవాడు. ఫాస్ట్ మూవింగ్ సొసైటీలో ఇమడలేని మనిషి ఆయన. ఇంకా పాత సిద్ధాంతాలూ, అలవాట్లూ, నీతులూ, నిమ్మకాయలూ... ట్రాష్, రాత్రి తను ఎంత ఎంజాయ్ చేశాడనీ... ఫుల్‌గా మందుకొట్టి స్నేహితుల్తో సియెల్లోలో సెవెంటీ కిలోమీటర్ల స్పీడులో దూసుకుపోతూంటే కారు తిరుగుతూన్న మెలికలకి రోడ్డుమీద రిక్షాలు, స్కూటర్లు, ఆటోలు బెంబేలు పడిపోయి పక్కలకు భయంతో పరుగులు తీస్తుంటే ఫ్రెండ్సందరూ తనని అడ్మైర్ చేస్తూంటే ఓహ్ ఏం థ్రిల్! తండ్రి తనకి సరయిన ఫ్రీడం ఇవ్వక పోబట్టిగాని నగరాన్ని ఓ వూపు వూపేవాడుకదూ తను!

ఇప్పుడు మరో థ్రిల్లింగ్ న్యూస్. తనని కాలేజీ ప్రెసిడెంటు పోస్టుకి కంటెస్ట్ చేయమని ఫోర్సు చేస్తున్నారు ఫ్రెండ్సంతా. తను గ్రీన్‌సిగ్నల్ ఇచ్చేశాడుగాని తండ్రికి చెప్పలేదు. ఆయన గారేం అంటారో.

క్రింద హాల్లోంచి గలగలమని నవ్వులు వినిపించాయి.

ఎంత బాగుంది ఆ నవ్వు. రాత్రి తాగిన మందులో కూడా ఆ కిక్కులేదు.

ఆ నవ్వంటే తనకి పిచ్చెక్కేంత ఇష్టం.

ఆ నవ్వు ముగ్ధది. తనకు తెలుసు.

ముగ్ధ తన కోసం నవ్వదు. ఆ రాస్కెల్ నందిగాడి కోసం నవ్వుతుంది. తన తండ్రి కోసం నవ్వుతుంది. తన కోసం మాత్రం నవ్వదు. తనని చూస్తేనే ఎందుకో ముఖం మాడ్చుకుంటుంది. అందాల్ని దాచుకుంటుంది. తన దొంగచూపుల్ని ఈసడించుకుంటుంది. తన మాటల్ని తీసి పారేస్తుంది. హీరో అయిన తనని జీరోగా చూస్తుంది. తను దగ్గరవుదామని ప్రయత్నించేకొద్దీ దూరమవుతుంది. ఆమె దూరమవుతున్నకొద్దీ తనకి ఆమెకి దగ్గరవ్వాలన్న పంతం పెరిగిపోతోంది.

మళ్లీ నవ్వులు సెలయేటి గలగలలా..

కిటికీ కర్టెన్లు తొలిగించి కిందకు చూశాడు.

అక్కడ ముగ్ధ, నంది, కిష్టయ్య వున్నారు. కట్లతోవున్న కిష్టయ్య కూడా ముగ్ధ మాటలు వింటూ హాయిగా నవ్వుతున్నాడు.

'ఆ వెధవ కిష్టయ్యగాడి పాటి చెయ్యలేదన్నమాట నేను' అనుకున్నాడు పళ్లు పటపట లాడించి. గబగబా ముఖం కడుక్కుని కిందకు బయల్దేరాడు.

స్నానం ముగించిన చక్రవర్తి హడావుడిగా

హాలులోకి వచ్చి "అమ్మడూ, ముగ్ధా! ఏదమ్మా! నీ చేతి ప్రసాదం" అన్నాడు.

ప్రసాదం అందించింది ముగ్ధ. ప్రసాదాన్ని చక్రవర్తి కళ్లకు అద్దుకుని తింటూండగా, కన్నబాబు మెట్లుదిగి కిందకు వస్తూ "వండర్ ఫుల్, ఈరోజు పట్టపగలు ఇంట్లో వెన్నెల కాస్తోందేమిటాని ఆశ్చర్యపోతున్నాను. ముగ్ధ వచ్చిందా? ఏం ముగ్ధా! ఇంత ప్రొద్దున్నే వచ్చావు? " అన్నాడు మంచితనాన్ని నటిస్తూ.

నవ్వుని ఆపేసింది ముగ్ధ. చక్రవర్తి ఎదురుగా కన్నబాబుకి గట్టి సమాధానం చెప్పడం బాగుండదని వూరుకుంది గాని కన్నబాబు మంచిగా నటిస్తున్నాడని తెలియక కాదు కాలేజీ ఆవరణలో ఫ్రెండ్స్‌తో తన మీద, తన స్నేహితురాళ్లమీద విసిరే కామెంట్లు ఆమెకు కంఠోపాఠమే కాదు కంఠగరళం కూడా. అందుకే ఆమె కర్కశంగానే ప్రవర్తిస్తుంది అతని పట్ల.

ముగ్ధ జవాబు చెప్పనక్కరలేకుండా చక్రవర్తే అందుకున్నాడు. "ప్రొద్దున్నే చక్కగా పూజ చేసుకోవడం, గుడికి వెళ్లి రావడం, నలుగురికీ ప్రసాదం పంచడం, నాలుగు మంచి మాటలు చెప్పడం ఆమెకీ, ఆమె తండ్రికీ అలవాటు.

"ఆ విషయం నాకెందుకు చెబుతున్నారు డాడీ" దెబ్బతిని అన్నాడు కన్నబాబు.

"అబ్బే ఏం లేదులే. తమదంతా వెస్టర్న్‌కల్చర్‌గదా! సిస్టమ్ బాగుపడాలని. అది సరే కారు హైస్పీడులో నడుపుతున్నావుట. కేసు బుక్ చెయ్యాల్సివున్నా నేనేమయినా అనుకుంటానని తటపటాయిస్తున్నార్ట. ఇన్‌ఫర్మేషనొచ్చింది. ఈసారి కారు హైస్పీడులో నడిపావని తెలిస్తే కారు అమ్మేసి సైకిల్ కొనిబెడ్తాను. అర్థం అయ్యిందా? "

తల దించుకున్నాడు కన్నబాబు.

"అవును రాత్రుళ్లు ఇంటికి రావడం అంత ఆలస్యం అవుతోందేం? "

"ఎలక్షన్స్ డాడ్! కాలేజీ ఎలక్షన్స్. ఫాదర్ మేయర్‌గా ఎలక్ట్ అయ్యారుకాబట్టి సన్ తప్పకుండా కాలేజీ ప్రెసిడెంటు కావలసిందే అంటూ మా ఫ్రెండ్స్ గొడవ చేస్తున్నారు. అందుకనే క్యాంపెయిన్ ఉద్ధృతంగా ప్రారంభించాం"

"అంటే ఈ రాజకీయాల రొంపిలోకి నువ్వూ దిగుతున్నావన్నమాట. చూడూ ఎక్కడన్నా నా పేరు వుపయోగించావని తెలిస్తే తాటవలుస్తాను. జాగ్రత్త" అంటూ లోపలకి వెళ్లిపోయాడు చక్రవర్తి.

కన్నబాబు దెబ్బతిన్నాడు గానీ సర్దుకున్నాడు. ముగ్ధ ఎదురుగా గంభీరంగా స్టైయిల్‌గా వుండాలనుకున్నాడు. మేయర్‌గారి కొడుకుగా గుమాస్తాగారి అమ్మాయి దగ్గర అధికారం వెలగబెట్టాలనుకున్నాడు.

"ముగ్ధా! కాలేజీ ఎలెక్షన్లు. తెలుసుకదా! ఐయామ్ కంటెస్టింగ్, యూనో, యు షుడ్ కాన్వాస్ ఆన్ బిహాఫ్ ఆఫ్ మి. నా సియెలో కారుతోబాటు మరో మూడు కార్లు, రెండు జీపులూ తెప్పిస్తున్నా. మన క్యాంపయిన్ హోరెత్తి పోవాలి. అపోనెంట్స్‌కి స్కూటర్స్ కూడా లేవు. ముష్టి వెధవలు. కాలినడకన తిరిగి చావవలసిందే. ఈ రోజు నుంచే నువ్వు మాతో తిరగాలి" అన్నాడు దర్పంగా.

"సారీ ఎలక్షన్లంటే నాకు ఇంట్రస్టు లేదు"

"నాకోసం ఇంట్రస్టు కలిగించుకోవాలి తప్పదు"

"సారీ నేను చాలా చదువుకోవలసింది వుంది"

"ఏం చదవక్కరలేకుండానే నువ్వు ఈజీగా పాసయిపోయే ఏర్పాటు నేను చేస్తాను. ఆమాత్రం ఇన్‌ఫ్లుయెన్సు ఈ కన్నబాబుకుంది. చిటికల్లో వ్యవహారాలు నడిపిస్తాను"

"నాన్నగారికి ఆరోగ్యం బాగుండడంలేదు. అమ్మకి ఇంటి పనుల్లో సాయం చేయాలి"

"డామిట్! కారుల్లో తిప్పుతానంటే అంట్లు తోముతానంటావేమిటీ? మాతోబాటు ఓ అందమయిన పిల్ల క్యాంపయిన్‌లో పాల్గొంటే మాకు ఆనందం, గర్వం. అపోనెంట్స్ జెలసీతో కుళ్లి ఛస్తారు. థంపింగ్ మెజార్టీతో

మనం గెలవాలి" అని కన్నబాబు అంటూం డగా దీనబంధు వచ్చాడు. దీనబంధుని చూస్తూనే కన్నబాబుకి ధైర్యం మరింత వచ్చింది. "విక్టరీ రోజున రిక్వెస్టు చేస్తే ఈ మామయ్య ఈ ముద్దుల మేనల్లుడి కోసం కనీసం పది వెహికల్సయినా సప్లై చేస్తాడు. ఊరు హోరెత్తిపోయేలా మందీ మార్బలంతో వూరేగుదాం. ఓకే.." అన్నాడు రెచ్చిపోతూ.

మంచిగా నచ్చచెబ్తూన్న ధోరణిలో అన్నది ముగ్ధ. "చూడు కన్నబాబూ! రాక్షసకోతి రాత్రుళ్లు జనాన్ని భయపెట్టి చంపుతోంది. అంత మందీమార్బలం వున్న మహరాజువి రాత్రుళ్లు గస్తీ తిరిగి, దానిని పట్టుకుంటే అందరూ భేష్ అంటారు. జేజేలు పలుకు తారు. కాలేజి ఎలక్షన్లలో క్యాంపయిన్ అవ సరం లేకుండానే గెలవొచ్చుకదా! నాన్న గారూ సంతోషిస్తారుకదా? "

విసుక్కున్నాడు కన్నబాబు "ఛఛా! రాత్రుళ్లు గస్తీ తిరగడానికి గూర్ఖాలున్నారు. పోలీసులున్నారు నాకేం ఖర్మ"

తేలిగ్గా నవ్వుతూ దెబ్బకొట్టింది ముగ్ధ. "నిజమే బలం, బలగం వున్న వాళ్లంతా హీరోలు కాలేరులే" అంటూ చరచరా బయ టకు వెళ్లిపోయింది.

నంది ఆనందంతో కేరింతలు కొట్టి "వాహ్ వాహ్ క్యా డైలాగ్ హై బాస్. బలం, బలగం వున్నవాళ్లంతా హీరోలు కాలేరు. ఉపయోగించేస్తా నా డ్రామాలో" అంటూ ఆమెని ఫాలో అయ్యాడు. కిష్టయ్య కూడా అతన్తో బాటే బయటకు నడిచాడు.

ఖంగుతిని బొమ్మలా నిలబడి పోయాడు కన్నబాబు.

కన్నబాబుని రెచ్చగొడ్తూ, చప్పట్లు చరి చాడు దీనబంధు. ఆపైన "చాలా స్ట్రాంగ్ డోసేకదూ ఇది నీకు? ముగ్ధ కూడా మాటలు నేర్చింది" అన్నాడు.

రెచ్చిపోయిన కన్నబాబు ముక్కుపుటాలు ఎగరేస్తూ అన్నాడు. "నేరుస్తుంది... నేరు స్తుందీ. అలగా వెధవల్తో స్నేహాలు ఎక్కువ అయ్యాయికదా! నంది మాత్రం... నాకంటే ఆ కిష్టయ్యగాడే ఎక్కువ అయిపోయాడా వాడికి. వాడితో తిరుగుతున్నాడు. ఎలక్షన్లని తెలుసుకదా! నాకు తోడుగా వుండొచ్చుగా. ఇక మా నాన్నగారు... శ్రీశ్రీశ్రీ కళ్యాణ చక్ర వర్తిగారు సరేసరి. కన్నకొడుకుతో అలాగేనా మాట్లాడ్డం. ఎంత డబ్బయినా ఖర్చుకి వెనకా డకు మనవాళ్లని ఎంతమందినయినా నీ ఇష్ట మొచ్చినట్లు వుపయోగించుకో. నువ్వు గెలిచి తీరాలీ అనాలిగానీ ఇలా బెదిరిస్తాడేవిటీ? "

రెచ్చగొడ్తూ తమాషాగా నవ్వాడు దీన బంధు మళ్లీ.

"ఆ నీకు నవ్వులాట గానే వుంటుంది. నాకు ప్రాణ సంకటంగా వుంది. ఈయనగారి స్థానంలో ఇంకో ఫాదర్ వుంటే ఈ సిటీ మొత్తాన్ని ఓ ఆటాడించే వాడ్ని" ఉక్రోషం ఎక్కువయిపోతోంది కన్నబాబులో.

ఇంక రెచ్చగొట్టడం అనవసరం అనిపించి సానునయంగా దువ్వుతూ అన్నాడు దీన బంధు, "పోనీయవయ్యా! మీ నాన్న పాత తరం బుద్ధులున్న మనిషి" అని.

"మధ్యలో నేను అన్యాయం అయిపోతు న్నాగా? " అరిచాడు కన్నబాబు.

"హుష్ గోడలకు చెవులుంటాయంటారు. ఆ చెవులవసరంలేకుండా నేరుగా మీ నాన్న చెవుల్లో పడేంతగట్టిగా అరుస్తున్నావే. పద పైన మాట్లాడుకుందాం" మేడ మీదకు దారి తీశాడు దీనబంధు.

మాట్లాడుకోవడం వలన ఏమీ లాభం వుండదన్నట్లుగా నిరాశగానే వెంబడించాడు కన్నబాబు.

తన గదిలోకి తీసుకెళ్లి తలుపులు వేసొచ్చి కన్నబాబుని కుర్చీలో కూలేస్తూ అన్నాడు దీనబంధు. "నీకేకాదు నాకూ గొప్ప బాధ గానే వుంది. స్వంత మనుషుల్ని అందలం ఎక్కించడానికి బాధపడిపోతాడేవిటీ అని"

చటుక్కున తలెత్తాడు కన్నబాబు "నిజం గానా మామయ్యా" అన్నాడు.

నిలువుగా తలాడించాడు దీనబంధు

నమ్మకంగా.

ఆపైన ధైర్యం చెబ్తూ అన్నాడు "దేనిక యినా టైము రావాలికదా! బయట మను షులు సాయం రానప్పుడు స్వంత మను షులు దిక్కవక తప్పదు"

"ఏం దిక్కవడమో! ముగ్ధ ఎదురుగా కూడా అవమానిస్తూ మాట్లాడుతున్నాడు. నాకింక గౌరవం ఏముంటుంది? "

"ఇంత చిన్న మాటలకే అంత రియాక్ట్ అయిపోతే పైకి ఎలా వస్తావురా చిట్టితండ్రీ. రాజకీయాల్లో పైకి రావాలనుకున్న వాళ్లు ఆత్మాభిమానాన్ని అలమార్లో పెట్టి తాళం బిగించాలి. అప్పుడే నీలాంటి కుర్రాళ్లు మా వయసులొచ్చేసరికి రాజ్యాలేలొచ్చు!"

"నీ కొడుకే నాకు సపోర్ట్ చేయకపోతే ఇంకేవిటి రాజ్యాలేలేది? "

నవ్వాడు దీనబంధు. బుజ్జగిస్తూ అన్నాడు "ఒరేయ్ ఈ దీనబంధు నవ్వను కుంటున్నంత సామాన్యుడుకాదురా. అయినా తండ్రిని నగరమేయర్‌గా గెలిపిం చిన వాడ్ని కొడుకుని వెధవది కాలేజీ ప్రెసి డెంటుగా గెలిపించలేనా? "

ఒక్కసారిగా ఆనందం తన్నుకొచ్చింది కన్నబాబులో "మామయ్యా" అన్నాడు.

"మామయ్యని కాబట్టేరా చిట్టితండ్రీ నీతో పోటీకి నిలబడ్డ వాడెవడో చెప్పు. కాసులు తీసుకుని వూరుకుంటాడో, కాళ్లు విరగ్గొట్టిం చుకుని పడుంటాడో నేను చూసుకుంటానా విషయం. నీది ఇప్పుడు హాయిగా స్వేచ్ఛగా, పూలరంగడిలా జీవితాన్ని అనుభవించాల్సిన వయసురా. వంద మైళ్ల స్పీడులో వుండాలి. అడ్డొచ్చిన దేన్నీ లెక్క చెయ్యకూడదు. ఎంజాయ్ మైబోయ్, ఎంజాయ్..." ఉత్సా హపరిచాడు.

మరింత ఆనందం తన్నుకొచ్చింది కన్నబా బులో "మామయ్యా" అన్నాడు అభిమానంగా.

అవకాశం వదులుకోదలుచుకోలేదు దీన బంధు. కన్నబాబులోని మార్పుని గమ నిస్తూ అస్త్రాలను సంధించసాగాడు. "నీ తండ్రి నీకు సపోర్ట్ ఇవ్వట్లేదని ఎందుకురా అంత బాధ పడతావు. చక్రం తిప్పేవాడిని నేనున్నాగా. నీ మనసులో నలుగుతూన్న ఇంకొక విషయం చెప్పనా? చెప్పెయ్యనా? " అంటూ చిలిపిగా చూస్తూ కన్నబాబు ముఖంలో ముఖం పెట్టాడు.

కన్నబాబు మంత్రముగ్ధుడిలా చూస్తు న్నాడు.

"నీకు ముగ్ధ మీద మనసుగా వుంది కదూ? "

మతిపోయింది కన్నబాబుకి.

"మామయ్యా నా మనసులో వున్న విషయం, నేను ఎవ్వరితోనూ చెప్పని విషయం నీకు... ఎలా...? " పగలే వెన్నెల చూస్తున్నంత ఆశ్చర్యంగా అడిగాడు.

తెరుచుకుపోయి బిగుసుకున్న కన్నబాబు నోటిని చూపుడువేలితో సుతారంగా దగ్గరకు నొక్కుతూ అన్నాడు దీనబంధు. "ఆవులిస్తే అన్నం మెతుకుల సంఖ్య చెబ్తారా! ముగ్ధ మన కేశవరావు కూతురు. అంటే మన దగ్గ రున్న ఓ గుమాస్తాగాడి కూతురు. మనం పడేసిన ఎంగిలి మెతుకులు తినే వాడి కూతురు. అంతేకదా? "

"మామయ్యా! ముగ్ధ అంటే మన నందికి ప్రాణం. వాడు దాన్ని ప్రేమిస్తున్నట్లుగా వున్నాడు"

"ఇక ఆ ప్రేమ ముందుకు సాగడానికి వీల్లేదు. దాన్ని నీదాన్ని, నీ బానిసని చేసుకో... ఓకే? "

"హా? అది డబ్బులకు లొంగదే? " గింజుకున్నాడు కన్నబాబు.

తేలిగ్గా, అలవోకగా నవ్వుతూ, ముద్దు ముద్దుగా పలికాడు దీనబంధు "పిచ్చి మేన ల్లుడా! ఇంత అమాయకత్వముంటే రాజకీ యాల్లో ఎలా పైకొస్తావోయ్? " ఆ తర్వాత అతని ముఖం రంగులు మార్చుకుంది. కంఠం స్వరం మార్చుకుంది. "మంచిగా చెప్పినా వినక, డబ్బుకీ లొంగకపోతే బలప్ర యోగం వుండనే వుందిగా? "



# రచయితలకు మనవి

★ 'చతుర'లో నవలకు వేసే చిత్రాలు, 'చతుర కతలు', 'చతుర ప్రపంచం' వంటి శీర్షికలు కాక కేవలం నవల మాత్రమే అచ్చులో 100 పేజీలు ఉంటుంది. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచడంగాని, తగ్గించడంగాని వుండదు గనుక రచయిత(త్రు)లు తమ వ్రాతప్రతిని అచ్చులో 100 పేజీలకు తక్కువ కాకుండా వుండేలా చూసుకుని పంపవలసి వుంటుంది.

★ ప్రచురించిన నవలలో ఓ పూర్తి పేజీని తమ చేతివ్రాతలో రాసి చూసుకుని, ఆ మేరకు తమ నవల అచ్చులో 100 పేజీలకు సరిపోయేలా ప్లాన్‌చేసుకుని 'చతుర'కు అనుకూలంగా వుండే సైజులో పంపడం మంచిపద్ధతి.

★ ఆవిధంగా నవలలు 'చతుర'కు సరిపడా లేకపోయినట్లయితే ఆయా నవలలు పరిశీలనార్హాలు కావని గమనించగోరుతున్నాం.

★ ప్రచురణకై ఎన్నికకాని నవలలు తిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజిని జతపరచాలి. వ్రాతప్రతులు పోస్ట్‌లోగాని, ఇతరత్రాగాని పోయిన సందర్భాల్లో మా బాధ్యత వుండదు.

★ సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ విషయం తెలియపరచడం, లేనిపక్షంలో తిప్పిపంపడం జరుగుతుంది.

★ ప్రతి నవలకు అందజేసే రూ. 3000/- పారితోషికం ఏ నెల 'చతుర'లో ప్రచురిస్తే ఆ నెల మొదటివారంలోనే పంపబడుతుంది.





ఎడిటర్:

చతుర

'ఈనాడు' కాంపౌండ్

హైదరాబాద్, 500 082.




శ్రీచంద్ర..






# చతుర సమీక్ష



ఈ శీర్షిక ద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా అవసరమైన మేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్-500 082 అనే చిరునామాకు పోస్ట్‌చేయాలి.

★ మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రూ. 100/- ప్రథమ బహుమతి, రూ. 75/- ద్వితీయ బహుమతి, రూ. 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, పఠనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

**కూపన్**

మార్చి చతుర నవల **మృగ-తృష్ణ**

చిరునామా: ______________________

______________________

______________________

______________________

తెల్లబోయి చూశాడు కన్నబాబు.

"అమాయకుడా! పువ్వుని సుతారంగా రెండు వేళ్లతో చెట్టు నుంచి తుంపలేకపోతే ఏం చేస్తావు? "

జవాబు తోచక అయోమయంగా చూశాడు కన్నబాబు.

వికటంగా నవ్వుతూ అన్నాడు దీనబంధు, "కొమ్మతోబాటుగా విరిచేస్తావు. గుప్పిట్లో బిగించి గుంజేస్తావు. పువ్వు నీది కావాలని పంతం వుండాలిగాని అలా వదిలిపెడ్తావా? ప్రొసీడ్. ఎంతకయినా తెగించు! ఎంజాయ్ మై బోయ్, ఎంజాయ్! వెనక నేనున్నాను!"

తన్మయత్వం చెందాడు కన్నబాబు. "మామయ్యా కన్నకొడుకుని కాదని ఈ కన్నబాబు మీద ఎందుకింత ప్రేమ మామయ్యా!? "

ముఖం దగ్గరగా పెట్టి అతని కళ్లల్లోకి చూస్తూ, "సూటి జవాబు! నాకు... నీవల్ల కావలసిన రాచకార్యం వుంది కాబట్టి" అన్నాడు దీనబంధు.



"నా వల్లా? ! హౌ? "

"యస్. నీ వల్లేరా చిట్టితండ్రీ! మీ నాన్న నన్ను రాజకీయాల్లో ఎదగడానికి ప్రోత్సహించాలంటే నా నుంచి అక్కయ్యనుంచే కాక ఆయనగారిమీద పడవలసిన థర్డ్ ప్రెషర్ ఏకైక సంతానానివి నీ నుంచి కావాలి. అవకాశం దొరికినప్పుడల్లా ఈ మామయ్య మీ నాన్నకి చేసిన సేవల్ని గుర్తుచేసి కృతజ్ఞత తీర్చుకోమంటూ ఊదరగొడ్తూ ఊపిరి సలుపుకోనివ్వక అతగాడు నాకు సహాయం చేయక తప్పనిసరి పరిస్థితిని ఈ రాజకుమారుడు కల్పించాలి!"

కొద్దిగా భయపడ్డాడు కన్నబాబు, "అంత పని నేను... చేయగలనా మామయ్యా? "

"నీ ఆనందానికి ముగ్ధని నేను 'కన్యాదానం' ఇస్తున్నాను. నా ఆనందానికి ఓ పద విని 'తిలాదానం' ఇప్పించలేవురా? "

"మామయ్యా!"

"ఆలోచించు! మార్గం అదే దొరుకుతుంది. రాజకీయాల్లో ఎదగడానికి కావలసింది 'బరితెగింపురా' చిట్టినాగన్న. తల్లి, తండ్రి, భార్య, పిల్లలూ ఎవ్వరూ శాశ్వతం కాదు మనమూ, మనం ఒక్కరమే శాశ్వతం అన్న జ్ఞానోదయం కలగాలి! డబ్బు లేనివాడు డబ్బుకి కొరగాడు అని నానుడి. డబ్బొక్కటే కాదు- పదవి, పలుకుబడి, అధికారం ఏది లేకపోయినా బతుకు వృధాయే. నువ్వింకా పసిగుడ్డువి కాదు. పందెం గుర్రానివి. లే పరుగెత్తు. నువ్వను కున్న ఆనందాలని అందుకుంటూ ముందుకు ఉరుకు! అడ్డొచ్చిన అక్కుపక్షుల్ని నీ గిట్టల కింద అణగతొక్కేయ్! నిన్ను అంచెలంచెలుగా అందలాలు ఎక్కిస్తూ, ఈ దేశానికి ప్రధానమంత్రిగా చూడాలనేది నా చిన్న కోరికరా చిట్టికన్నా"

కన్నబాబు ఉబ్బితబ్బిబ్బయిపోయాడు.

ఊరిపోయాడు.

వెర్రెక్కిపోయాడు.

'మామయ్యా' అంటూ పూర్తిగా లొంగిపోయి, దీనబంధుని కౌగలించుకున్నాడు.

దీనబంధు ముఖం విజయంతో వెలిగింది.

ఆనందంతో లోనుండి తన్నుకొస్తున్న నవ్వుని, బలవంతాన మునిపంట నొక్కిపట్టాడు.

ప్రకాశం ఇంట్లో పండగ వాతావరణం గోచరిస్తోంది.

తమ్ముడికీ, చెల్లాయికీ కొత్త యూనిఫా

రాలు తొడిగి, కొత్త బ్యాగుల్లో పుస్తకాలు సర్ది, చక్కటి, కమ్మని భోజనం పెట్టి రిక్షాల్లో స్కూలుకి పంపించాడు

తల్లిని తీసుకుని ఆటోలో నగరంలోనే పేరున్న ప్రైవేటు హాస్పిటల్‌కి బయల్దేరాడు.

గుమ్మం దాటుతూండగా ఎదురుపడి, బాకీ తీర్చమని కూర్చున్న పాలవాడికి బాకీ తీర్చేశాడు.

తల్లిని ఆప్యాయంగా చుట్టూ చేయివేసి పట్టుకుని ప్రయాణం చేస్తున్నాడు. మంచి హాస్పిటల్‌కి వెళ్తున్నాంకదమ్మా. అన్నివిధాలా చక్కగా టెస్టులు చేస్తారు వాళ్లు. నీకు త్వరలోనే తగ్గిపోతుంది. పూర్తి ఆరోగ్యం వచ్చేస్తుంది. తమ్ముడ్నీ, చెల్లాయినీ కూడా ఆ స్కూల్లోంచి మంచి స్కూలుకి మార్పించేస్తాను. వాళ్లు పెద్ద పెద్ద చదువులు చదవాలి. నాన్నగారు చనిపోతూ, వాళ్లిద్దరివైపూ బెంగగా చూసిన చూపు నాకు బాగా జ్ఞాపకం. 'వాళ్ళ గురించి నువ్వు బెంగపడకు నాన్నా. వాళ్ళ పూర్తి బాధ్యత నాది' అని నాన్నగారి చేతిలో చేయివేసి ప్రమాణం చేశాను. నా మాట నిలబెట్టుకుంటాను"

మాలక్ష్మమ్మకి కలా, నిజమా అన్న సందేహం కలుగుతోంది.

తన పక్కన కూర్చుని, తనతో మాట్లాడుతున్నది తన కొడుకేనా?

తన కొడుకు ముఖంలోనేనా ఇంత కాంతి, ఆశ! గత కొంతకాలంగా ఎంత నిరాశకి గురయిపోయాడు వాడూ? తన గురించి, తమ్ముడు, చెల్లాయిల గురించి ఎంత బెంగ పెట్టేసుకున్నాడు? తను గమనించడంలేదనుకుని తండ్రి ఫొటో దగ్గర నిల్చుని, 'నాన్నగారూ నేను మీకిచ్చిన మాటని నిలబెట్టుకోలేపోతున్నాను! అమ్మని మంచి డాక్టరుకి చూపించలేకపోతున్నాను. తమ్ముడికీ, చెల్లాయికీ చదువు కాదుకదా, మంచి భోజనమయినా పెట్టలేకపోతున్నాను. నా పెర్సనాలిటీ, నా చదువు, నా తెలివితేటలూ, అన్నీ... ఎందుకూ పనికిరావడంలేదు. ఒక అప్రయోజకుడిగా మిగిలిపోతున్నాను' అంటూ ఎన్నిసార్లు కంటనీరు పెట్టుకోలేదు వాడు? అలాంటిది రెండు మూడు రోజుల్నుంచీ ఎంత మార్పొచ్చింది వాడిలో. వాడిలో ఏదో కొత్త శక్తి... కొత్త జీవం... కొత్త ఆశ... ఇంటికోసం పెడ్తున్న ఖర్చు ఎలా వస్తోంది? ఉద్యోగంలో చేరానన్నాడు ముందే జీతం ఇచ్చేస్తారా?!

"నాన్నా ప్రకాశం ఇంత పెద్ద హాస్పిటల్‌కి ఎందుకురా నన్ను తీసుకెళ్ళడం? బోలెడు డబ్బు గుంజుతారు వాళ్లు. నువ్వు తూగలేవురా నాన్నా. గవర్నమెంటు హాస్పిటల్‌కి వెళ్దాం పదరా!" అంది మళ్ళీ పొద్దున్నుంచీ పాడుతున్న పాటే పాడుతూ.

"అమ్మా! నువ్వేం మాట్లాడొద్దు ఇంక! డబ్బు గురించేకదా నీ ఆందోళన? నువ్వు ఆరోగ్యంగా నా కళ్ల ముందు కనిపిస్తుండాలే గానీ అమ్మా, వంద రెట్ల ఉత్సాహంతో నా మెదడుకి పదునుపెట్టి లక్షలు గడిస్తాను" అన్నాడు ప్రకాశం ఉత్సాహంగా.

"ఆ దేవుడి దయవలన నీకు మంచి ఉద్యోగం దొరికి, అందరిచేతా 'భళా' అనిపించుకుని, మీనాన్నగారి పేరు నిలబెట్టాలి నువ్వు అనేదే నా కోరికరా నాన్నా. అవునురా నాన్నా, నిన్నట్నుంచీ ఇంటికోసం బాగా ఖర్చుపెడ్తున్నావు, ఎక్కడిదిరా అంత డబ్బు?"

"చెప్పానుగా అమ్మా- ఉద్యోగంలో చేరానని. అడ్వాన్సు తీసుకున్నాను"

హాస్పిటల్‌కి చేరింది ఆటో.

వీల్ ఛెయిర్ తెప్పించి, అందులో తల్లిని కూర్చోబెట్టి, ఛెయిర్‌తోపాటే లోపలికి నడిచాడు ప్రకాశం.

★ ★ ★

అర్ధరాత్రి పన్నెండు గంటలవేళ-

నిర్మానుష్యంగా వుందా వీధి. అప్పుడొకరూ, అప్పుడొకరూ తప్పనిసరయి బయటకు రావలసిన వాళ్లు, ఆలస్యంగా గూటికి

చేరుతూన్నవాళ్లూ తప్పితే- చొరవచేసి బయటకొస్తూన్న వాళ్లెవరూ లేరు.

నగరంలోని అన్నివీధుల పరిస్థితీ ఇంతే.

కర్రలతో, బల్లాలతో గస్తీలు తిరుగుతూన్న కుర్రకారు- తమ జట్లలో కనీసం పది తలకాయలేనా వుండేలా జాగ్రత్తపడుతున్నారు.

వింతవింతలుగా పేపర్లలో రాస్తూన్న ఆ భయంకర కోతిని తాము చూడాలని వువ్విళ్ళూరుతున్నారు. అంతలోనే అది ఎదురుపడితే, తమ జట్టు చెదిరిపోతే అది తమ ఒక్కర్నీ టార్గెట్ చేసి దెబ్బకొడితే అని భయపడుతున్నారు కూడా.

అందరితోపాటు విధిగా గస్తీ తిరగాల్సివచ్చి కొందరు, అంతమందితో చావయినా పండగేనన్న భావనతో కొందరూ, తాము తప్పించుకుని ఇంట్లో ముసుగుతన్ని పడుకోవడం ధర్మం కాదని కొందరూ, ఒకవేళ అది తారసపడి దాని ఖర్మకాలి పట్టుబడితే, పట్టుకున్న హీరోల జాబితాలో తామూ చేరిపోయి, పేపర్లకీ, టీవీలకీ ఎక్కొచ్చనే ఆశతో కొందరూ... వీధులన్నీ గాలిస్తున్నారు. ఊరికే తిరగడం బోరు కాబట్టి, "అదుగదుగో కోతి..." అంటూ చీకట్లోకి చూపిస్తూ, ఇతరుల్ని భయపెడ్తూన్న వాళ్లు కొందరు. అలా తమాషా చేసినందుకు జెల్లకాయలు తింటున్నవాళ్లు కొందరు. నిజంగా డిటెక్టివ్‌లులాగ ఫీలయిపోయి ఆకు ఆకుని, కొమ్మ కొమ్మని గుచ్చిగుచ్చి చూస్తూన్నవాళ్లు కొందరు. కాంపౌండులోకి టార్చిలైటు వేసి చూస్తున్నట్లు నటిస్తూ, మధ్యమధ్య ఫోకస్‌ని ఇళ్ల బెడ్‌రూములవైపు తిప్పుతూన్న పోకిరీలు కొందరు.

గస్తీలు... గస్తీలు... అన్ని కాలనీల్లో గస్తీలు... కాని ఎన్ని జట్లు గస్తీలు తిరిగినా... ఎన్ని పోలీసు వ్యానులు రౌండ్లు తిరిగినా... తిరుగులేని చాకచక్యంతో వింత కోతి నలుగుర్ని 'అటాక్' చేసిందన్న నమ్మకమైన వార్త కంట్రోల్ రూంకి రానే వచ్చింది.

వైర్‌లెస్‌లు ఖంగుమన్నాయి.

జీప్‌లు, వ్యాన్‌లు స్టార్టయ్యాయి.

విజిల్స్ చెవులను గింగిర్లెత్తించాయి

పోలీసుబూట్లు కదనుతొక్కాయి.

అటాక్ జరిగిన చోటుకి క్షణాల్లో అందరూ జేరారు.

కోతి మాత్రం కనబళ్ళేదు.

మేయర్ కళ్యాణచక్రవర్తి మండిపడుతున్నాడు అందరిమీదా.

మహా అసహనంగా వున్నాడు మనిషి- ఆయన వ్యక్తిత్వానికి పూర్తి భిన్నంగా, శాంతానికి మారుపేరయిన ఆయన అలా వుండడం, ఇంటిలోనివారికి, బయటవారికి కూడా ఇబ్బందిగానూ, ఆయన మీదున్న అభిమానంకొద్దీ బాధగానూ కూడా వుంది.

చక్రవర్తికి కూడా తన ప్రవర్తన తనకే వింతగా, ఇబ్బందికరంగా, అవమానకరంగా తోస్తోంది.

అందరూ ప్రయత్నిస్తున్నా ఫలితం రాకపోవడంతో పదవిలో వున్న తను ఏమీ చెయ్యలేకపోతుండడంతో ఉడుకుమోతుతనంగా కూడా వుంది. మరో ప్రజాహిత కార్యక్రమం చేబట్టడానికి లేకుండా, ఈ సమస్య పెద్ద ఆటంకంగా కూడా వుంది.

ఆఫీసులోనూ మనసు ఏ పనిమీదా లగ్నం కావడంలేదు.

ఇంటిదగ్గరా నిద్రాహారాలకు భంగం కలుగుతోంది.

తరచూ కేశవగారిచేతో, ముగ్ధచేతో వేదాంత విషయాలో, మంచి పద్యాలో చెప్పించుకుని, కొంత ఉపశమనం పొందడం జరుగుతోంది.

కొంత ప్రశాంతత కూర్చుకుని, కళ్లు మూసుకుని వెనక్కు వాలితే, 'అయ్యా' అంటూ బావురుమంటూ, దెబ్బలతో తన ఎదురుగా నిల్చిన కిష్టయ్యే కనబడుతున్నాడు. ఎప్పుడూ చిరునవ్వుతో కనిపించే కిష్టయ్య పాపం ఎంత బాధపడి వుంటాడు? ఎంత భయపడి వుంటాడు?

కిష్టయ్యని గురించిన ఆలోచన్లు వెనక్కి

పరుగెత్తాయి.

కిష్టయ్యతో తన అనుబంధం ఎంత బలంగా అల్లుకుపోయిందో, దానికి మూల కేంద్రమయిన సంఘటన ఏదో... అన్నీ బుర్రలో తిరుగుతున్నాయి.

ఆరోజు...

రాయుడి మనుషులు తమ పొలాలని ఆక్రమించుకుంటున్నారని, ధాన్యాన్ని దొంగతనంగా తన కొట్టాలకి తరలించుకుంటున్నారని తెలిసి, కిష్టయ్యని తీసుకుని పోలీసులతోపాటు పల్లెటూరికెళ్ళి, రాయుడితో సమస్య సెటిల్‌మెంటు చేసుకుని తిరిగొస్తున్నాడు బండిలో. పోలీసులు సమస్య తీరాక వెళ్లిపోయారు. తామిద్దరూ ఒకసారి అక్కడి రైతుకి కొన్నిజాగ్రత్తలు చెప్పి, ఆలస్యంగా బయలుదేరారు.

సిటీలో కాంక్రీట్ జంగిల్‌లో రోజూ వూపిరి ఆడక వుక్కిరిబిక్కిరి అవుతూ, జీవితాన్ని గడిపే చక్రవర్తికి పచ్చటి పొలాలు కనువిందు చేస్తున్నాయి. బాటకిరువైపులా గలగలా పారుతూన్న పిల్లకాలువలు మనసులోని అలజడిని తగ్గిస్తున్నాయి. ఆనందంగా, పరవశంగా వూగుతూన్నట్లు తలలూపుతోన్న కొబ్బరిచెట్లు చల్లని గాలిని అందిస్తున్నాయి. ఆయనకి తెలియకుండానే నిద్రలోకి జారిపోయాడు చక్రవర్తి.

ఇంతలో-

"అయ్యగారూ! లేవండి బాబో..." అన్న పెద్ద పెడబొబ్బ వినిపించి, అదిరిపడి కళ్లు తెరిచాడు చక్రవర్తి.

కిష్టయ్య తనని తట్టి లేపుతున్నాడు. "అయ్యగారూ- అదుగో, ఆ రాయుడి మనుషులు బానా కర్రలతో పొలాలకి అడ్డం పడొస్తున్నారు బాబూ. మనం జాగ్రత్తగా వుండాలి" అన్నాడు.

దూరంగా... కర్రలెత్తి పట్టుకుని పొలాల్లోంచి వస్తూన్న మనుషులు కనిపిస్తున్నారు. చక్రవర్తి కంగారుపడ్డాడు. బండివాడితో తొందరగా పోనివ్వమని హెచ్చరించాడు. బండివాడు నడుపుతున్నాడుగానీ, వాడిచూపు క్రమేపీ దగ్గరవుతున్న రాయుడి మనుషులమీదే వుంది.

"అయ్యా సెమించండి. నేను బండి నడపలేను. ఆళ్లు మీతోపాటు నన్నూ సంపేత్తారు. నేపోతా..." అంటూ బండి మీద నుంచి దూకి, వెనక్కి తిరిగి చూడకుండా పారిపోయాడు వాడు.

చక్రవర్తి మరింత కంగారు పడిపోయాడు.

బండివాడికి ధైర్యం చెబుతూ, వెనక్కిరమ్మని అరిచాడు కిష్టయ్య.

వాడు కనీసం వెనక్కయినా చూడకుండా ఉడాయించాడు.

"ఇప్పుడెలా కిష్టయ్యా?" అన్నాడు చక్రవర్తి.

"ఏం ఫరవాలేదు బాబూ- నేన్నడుపుతా..." అని పగ్గాలు అందుకున్నాడు కిష్టయ్య. కొత్త వ్యక్తి చేతిలో పగ్గాలు పడడంతో ఎద్దు సరిగ్గా పరుగెత్తడంలేదు. కిష్టయ్య, "ఎహెయ్...ఎహెహెయ్..." అంటూ చర్నాకోల ఝుళిపిస్తూ, పాదంతో పొడుస్తూ, ఎద్దుని వేగంగా పరుగెత్తించడానికి విశ్వప్రయత్నం చేస్తున్నాడు. గతుకుల బాటలో అది పరుగుతీస్తూ, తన యజమాని కానివాడి మాట వినడానికి మొరాయిస్తూ, గింజుకుంటూ, ఒంకరటింకరగా పరుగెత్తడంలో, కాలు గోతులోపడి, మడతపడింది. అమాంతం బండి ముందుకు ఒరిగిపోవడంతో చక్రవర్తి బండిలోంచి బయటకు పడిపోయాడు. లేచి నిలబడడానికి చాలా కష్టమనిపించింది. కాలిమడమ బెణికింది.

రాయుడి మనుషులకి, బండికి మధ్య దూరం తగ్గుతోంది.

కిష్టయ్య చువ్వలా లేచి, ఎద్దుని వుత్సాహపరిచి లేపడానికి మానవప్రయత్నం అంతా చేశాడు. కాని అది లేవలేదు. బహుశా దాని కాలుకి దెబ్బ తగిలినట్లు వుంది. మడతబడి

వుంది. అది లేవలేకపోతోంది.

ఇంక తాత్సారం చెయ్యదలుచుకోలేదు కిష్టయ్య. ఎద్దుని బండినించి వేరుచేశాడు. చక్రవర్తికి చేయూతనిచ్చి బండిలో కుదేశాడు. బండికి తానే ఎద్దై బరబరా లాగసాగాడు.

చక్రవర్తి కళ్లల్లో నీళ్లు తిరిగాయి.

కన్నీటితెరల వెనగ్గా- ఓ పక్క శక్తికొద్దీ పరుగుతీస్తూ, బలంకొద్దీ బండిని లాగుతూ చెమటలు కక్కుతూన్న కిష్టయ్య, మరో దిక్కు నుంచి రణకేకలు పెడ్తూ ఉరికి వస్తూన్న రాయుడి మనుషులు కనిపిస్తున్నారు.

రాయుడి మనుషులు తమని అందుకునే లోగా రేవుకి చేరింది బండి.

రేవులో పడవ అయితే వుందిగానీ, పడవ నడిపేవాడు లేడు.

చక్రవర్తిని పడవలోకి చేర్చి, కట్టు విప్పి తెడ్డు అందుకున్నాడు కిష్టయ్య. పడవ ముందుకు సాగుతోంది.

రాయుడి మనుషులు రేవుకి చేరుకు న్నారు.

వెంబడించడానికి మరో పడవ అక్కడ లేదు.

ఆవేశంగా ఒళ్లు తెలియక నీట్లో దూకి, కొంతదూరం కొందరు వెంబడించారు కర్ర లతో నీటిమీద బాదుతూ.

పడవ అందలేదు వాళ్లకి.

ఒడ్డున వున్నవాళ్లు చేతికందిన రాళ్లు తీసు కుని, పడవమీదకు కసిగా విసరసాగారు. రాళ్లు పడవలోకి వచ్చిపడుతున్నాయి.

"అయ్యగారూ- మీరీ తెడ్డుని ఇలా ఇటు వైపు నీటిని తోస్తూ ఆడించండి బాబూ కొద్ది సేపు" అని చక్రవర్తికి తెడ్డు అందించి, ఆయ నమీద ఒక్క రాయికూడా పడకుండా ఆయ నను పూర్తిగా కప్పుతూ చేతులు చాచి నిల బడ్డ కిష్టయ్య మీద రాళ్లు పడుతూనే వున్నాయి.

కానీ అతను చలించలేదు.

రాళ్ల దెబ్బలకి అందనంత దూరం పడవ సాగాక తెడ్డు అందుకున్నాడు కిష్టయ్య.

అప్పుడు చూశాడు చక్రవర్తి పరిశీలనగా కిష్టయ్యని.

కిష్టయ్య తలమీంచి, భుజాలమీదనుంచి ధారాపాతంగా రక్తం కారుతోంది. ఏడుపుని ఆపుకోవడం చక్రవర్తి తరంకాలేదు. కిష్ట య్యని గాఢంగా కౌగలించుకున్నాడు. తన పైబట్టని అతని తలకి రక్తస్రావం మరింత కాకుండా గట్టిగా చుట్టాడు. తన పంచె చింపి, ఒంటిమీద గాయాలకు కూడా కట్లు కట్టాడు, కిష్టయ్య ఎంత వారిస్తూన్నా పట్టిం చుకోకుండా.

పడవ ఇవతలి ఒడ్డుకొచ్చాక, బాగా రక్త స్రావం అయి స్పృహ తప్పిపోయిన కిష్ట య్యని టాక్సీలో ఒక మంచి హాస్పిటల్ కి చేర్చి, కంటికి రెప్పలా చూసుకుంటూ ట్రీట్ మెంట్ ఇప్పించాడు.

అప్పట్నించీ తన ప్రాణాల్లో ప్రాణమయి పోయాడు కిష్టయ్య.

అతని ఋణం ఈ జన్మలో తీర్చుకోలేనిది అనిపించింది.

'అటువంటి కిష్టయ్య... ఈరోజు అంతగా దెబ్బతిని... బేలగా తనదగ్గరకొచ్చి మొరపె ట్టుకున్నాడంటే' చక్రవర్తి మనస్సు వికలం అయిపోయింది. 'ఈ సమస్య తీరేదెలా...ఎ లా...ఎలా...? '

★ ★ ★

చక్రవర్తి ఇంటికొచ్చేసరికి, ఇంటి ముందు రెండు అంబాసిడరు కార్లు ఆగివుండడం చూసి, ఆశ్చర్యపోతూనే ఆఫీసురూములోకి అడుగుపెట్టాడు. సోఫాల్లో కూర్చుని వున్న వ్యక్తుల్ని చూస్తూనే ఆశ్చర్యం కలిగింది.

వాళ్లు తన ఎక్స్ పార్టీ అధినేత చింతల నాయుడూ, అతని అనుచరులు.

చేతులు జోడిస్తూ నిలబడ్డారు వాళ్లు చిరు నవ్వుని బలవంతంగా ముఖంమీద పులు ముకుని.

వాళ్లెందుకొచ్చుంటారో వూహించలేకపోతు న్నాడు చక్రవర్తి.

అప్రయత్నంగానే ప్రతినమస్కరించి, వాళ్లని కూర్చోమని సంజ్ఞచేస్తూ తనూ కూర్చున్నాడు. లోపలనుంచి సింహాచలం చల్లని మంచినీళ్లని తెచ్చిచ్చాడు చక్రవర్తికి. అందరికీ కాఫీ తెస్తున్నానని సంజ్ఞ ద్వారా చెప్పాడు.

"కేశవరావుగారు రాలేదా?" అని అడిగాడు చక్రవర్తి.

తన మణికట్టుని పట్టుకుని 'జ్వరం' అని సంజ్ఞలతో చెప్పాడు సింహాచలం.

"దీనబంధు?"

దీనబంధు బయటకు వెళ్లినట్లు అభినయించాడు సింహాచలం.

"సరే, నువ్వెళ్లి కాఫీలు తీసుకురా"

సింహాచలం తలవూపి లోపలకి వెళ్లిపోయాడు.

'చెప్పండి' అన్నట్లుగా చింతలనాయుడివైపు చూశాడు చక్రవర్తి.

"చక్రవర్తిగారూ, నగరాన్ని భయంకర కోతి సమస్య గడగడలాడిస్తోంది కదా..." అన్నాడు చింతలనాయుడు.

ఎటువంటి ఉపోద్ఘాతం లేకుండా, నేరుగా ముఖ్యవిషయంలోకి అతను వచ్చేశాడంటే, బాగా రిహార్సల్సు వేసుకునే తనతో మాట్లాడ్డానికి వచ్చాడని గ్రహించాడు చక్రవర్తి. యాంత్రికంగా తల నిలువుగా వూపాడు, "అయితే ఏమంటావు?" అన్నట్లుగా.

చింతలనాయుడు మళ్లీ అందుకున్నాడు, "పాపం, మీరు మేయర్‌గా గెలిచిన తర్వాతనే ఈ సమస్య రావడం మీకు చాలా మనస్తాపాన్ని కలిగిస్తుందని మాకు తెలుసు. మీరు తమకేమేమో చేస్తారని ఆశించిన ప్రజలు, ఏదేదో చేసెయ్యాలని వూహించిన మీరు కూడా ముందు పాపం, ఈ కోతి సమస్యనుంచే బయటపడలేకపోతున్నారు"

సూటిగా, చలనంలేకుండా చూస్తున్నాడు చక్రవర్తి.

"పోలీసు డిపార్టుమెంటువాళ్లు చూసుకుంటార్లే అని మీరు, మన మునిసిపల్ డిపార్ట్‌మెంటు వాళ్లు చూసుకుంటార్లెమ్మని ఆ డిపార్ట్‌మెంటువాళ్లు వూరుకుంటున్నట్లున్నారు. ఏమంటారు?"

మాట్లాడకుండా చక్రవర్తి అలాగే చూస్తున్నాడు.

సింహాచలం కాఫీలు తెచ్చాడు.

అతని వెనగ్గానే దీనబంధు వచ్చాడు.

దీనబంధు రావడం చక్రవర్తికి కొంత ధైర్యాన్నిచ్చింది. "రావయ్యా, రా" అన్నాడు తన పక్కసీటు చూపిస్తూ. బావగారికి సపోర్ట్ కోసమే వచ్చినంత ఉత్సాహంగానూ వచ్చి ఆయన పక్కనే కూర్చున్నాడు దీనబంధు.

సింహాచలం అందరికీ కాఫీలు అందించాడు.

ఖాళీ కప్పు టీపాయ్ మీద ఉంచుతూ గొంతు సవరించుకుని దృఢంగా అన్నాడు చక్రవర్తి. "చూడండి చింతల్నాయుడుగారూ! కోతి ప్రజల్ని భయంలో ముంచుతోందన్న విషయంలో నాకెటువంటి సందేహం లేదు. కానీ సమస్యని మరో డిపార్ట్‌మెంట్ మీదకో, ఇతరుల మీదకో తోసేసి నాకు చెడ్డ పేరు రాకుండా వుంటే చాలు అనుకోవడానికి పదవే ప్రధానం అనుకునే మనిషిని కాదు నేను. ఇక సమస్య అంటారా... దానికేం చెయ్యాలీ అనేది...."

"ఏంచెయ్యాలీ అనేది మీరు మీనమేషం లెక్కపెట్టుకుంటూ కూర్చుంటే అవతల ప్రజలు అల్లల్లాడిపోతున్నారండీ. ప్రజల శ్రేయస్సే మీ శ్రేయస్సుగా భావించే మేము గిజగిజలాడిపోతున్నాం. అన్నం సహించడం లేదు. గుండెల్లో గునపాలు గుచ్చినట్టుగా ఉంది..." ఆవేశపడిపోతున్నాడు చింతల్నాయుడు.

దీనబంధు కలగచేసుకున్నాడు.

"మీరెందుకు అంతగా ఆవేశపడిపోతున్నారు? ఆవేశంతో తీర్చగలిగే సమస్యకాదు ఇది. ఆలోచనతో తేల్చాల్సింది" అన్నాడు తెగేసి.

"మరో సంవత్సరానికి తడుతుందా ఆలో

చన? ఏం మాట్లాడతారండీ? ఒక్కరోజు ప్రజలు కష్టపడినా మా గుండెలు బద్దలవు తాయే, మీరేమో తాపీగా ఆలోచిస్తామంటా రేమిటీ?" చింతలనాయుడు మండిపడ్డాడు.

ఏంమాట్లాడలేక దీనబంధు అలా చూస్తూ ఉండిపోయాడు.

చింతలనాయుడు చక్రవర్తివైపు తిరిగి సానునయంగా అన్నాడు. "చక్రవర్తిగారూ! ఏదో మీతో పోట్లాట వేసుకోవడానికి మీ ఇంటికి మేము వచ్చినట్టుగా కనిపిస్తోంది. కానీ అందుక్కాదండీ మేం వచ్చింది. సమస్య చాలా విషమంగా ఉంది. మన రాష్ట్రంలో కాదు... మనదేశంలోని అన్ని పేపర్లో మన నగరంలోని ఈ సమస్య గురించి కథలుకథలుగా రాస్తున్నాయి. మీకు ప్రతిపక్షినయినా నా మనసులో మీమీద అభిమానం ఉండబట్టి చెబుతు న్నాను. ఇది మీ ఒక్కరివల్ల తీరే సమస్య కాదు. మేం తలుచుకుని కార్యరంగంలోకి దూకుదామన్నా మాకు పవర్ లేదుకదా! తెలివితేటలు, సాహసం, పవర్ కలిస్తేనే సమస్య తీరుతుంది. ఏమంటారు?"

చక్రవర్తి పెదవి విప్పకుండా చింతలనా యుడు ఇంకా ఏమంటాడో అననియ్యి అన్న ట్టుగా చూస్తున్నాడు.

"చక్రవర్తిగారూ! నిన్నగాక మొన్న పదవి లోకి వచ్చిన మిమ్మల్ని నిరుత్సాహపరిచి పదవిని వదులుకోమని చెప్పేంత దుర్మా ర్గులం కాదు చక్రవర్తిగారూ, మేం కోరేదేమి టంటే, మా బ్లాకుల్లో అధికారాన్ని మాకుపూ ర్తిగా వదిలెయ్యండి. కోతి సమస్య వీలయి నంత త్వరలో మేం తేలుస్తాం..."

"చింతలనాయుడుగారూ, మీరు వెంటనే వెళ్లిపోండి అని నా నోటితో నేను చెప్పాలా...?" చక్రవర్తి గొంతు తీవ్రంగా ధ్వనించింది.

"అక్కర్లేదు, మీ చూపు చాలు మేం అర్థం చేసుకుని వెళ్లిపోతాం. కానీ..." అర్థోక్తిగా ఆగాడు చింతలనాయుడు.

"కానీ..." రెట్టించాడు దీనబంధు.

"కానీ... ఈ కోతి సమస్య అల్లాగే వుంటుంది!" నొక్కి పలికి, రివ్వున లేచి అను చరులతో బయటకు వెళ్ళిపోయాడు చింతల నాయుడు.

"సమస్య అల్లాగే వుంటుందీ" అని వీడె లాగ చెబ్తున్నాడు అని ఆలోచిస్తూ, తల పంకించాడు దీనబంధు!

మనసు పాడయిన చక్రవర్తి కళ్లు మూసు కుని, వెనక్కివాలి అల్లాగే కూర్చుండిపో యాడు.

★ ★ ★

కన్నబాబు కాలేజి ఎలక్షన్ల జోరు పెరుగు తోంది.

మనిషి బాగా టెన్షన్‌గా వున్నాడు.

డబ్బు విచ్చలవిడిగా ఖర్చుపెడ్తున్నాడు. తండ్రికి తెలియకుండా తల్లినుంచి బాగానే ముడుతోంది. మామయ్య దీనబంధు మరో రెండు కార్లనీ, ఓ జీపునీ, కొందరు కిరాయి మనుషుల్నీ కూడా సప్లై చేశాడు. ఆ కిరాయి మనుషుల్లో ముఖ్యుడు రౌడీ సత్తులు. సన్నగా రివటలా, లోతుకళ్లతో, పొడుచుకొ చ్చిన దవడ ఎముకల్తో, నిక్కబొడుచుకున్న జుట్టుతో భయంకరంగా వుంటాడు వాడు. ఆకారాన్నిమించి భయంకరమైనది వాడి ప్రవర్తన. మంచి అనేపదానికి వాడి డిక్షన రీలో స్థానంలేదు. ప్రాణం విలువ ఎంతో వాడికస్సలు తెలియదు. డబ్బుకోసం, సారా కోసం వాడు ఎవరికోసమయినా, ఏం చెయ్య డానికయినా సిద్ధమే.

'కన్నబాబునీ, వాడి అనుచరుల్నీ, వాడి ఆర్భాటాన్నీ చూసి, ఆకర్షితులై కొందరు, భయపడి కొందరు వాడికి ఓటు వేస్తామం టున్నారుగాని మంచి విద్యార్థిగా, స్పోర్ట్స్‌మ న్‌గా, పేరున్న ప్రత్యర్థే తన వాగ్ధాటితో, ప్రవర్తనతో అందర్నీ ఆకర్షిస్తున్నాడని, ప్రెసి డెంట్ షిప్ గెలుచుకుపోతాడేమోనని భయం పట్టుకుంది కన్నబాబుకి. ఎంత కవ్వించినా దెబ్బలాటకు దిగని వాడ్ని

కొట్టడం, బెదిరించడం చేస్తే పరిస్థితి మరింత చెడిపోయేలాగుంది. తనంటే మరింత ద్వేషం పెరిగి, అందరూ వాడికే ఓట్లు గుద్దెయ్యవచ్చు

అందుకే అందర్నీ ఆకర్షించడానికి ముగ్ధ అందం, వాక్చాతుర్యం, నంది నాటకాల అనుభవం ఎంతో ఉపయోగపడతాయి అనిపించింది కన్నబాబుకి. ఒకసారి వాళ్లని అడిగి భంగపడ్డప్పటికీ ఇంకోసారి ప్రయత్నించడంలో తప్పులేదనిపించింది కన్నబాబుకి.

క్యాంటీన్‌లో కూర్చుని, స్నేహితులకి నాటకం డైలాగులు చెబ్తూ, ఆనందంలో తేలిపోతున్న నంది దగ్గరకి ఒంటరిగా వెళ్లాడు కన్నబాబు.

"హాయ్ నందీ"

"హల్లో... ఏమిటి కన్నబాబూ ఒక్కడివే వచ్చావు? "

"మా బావ నంది దగ్గరకు రావడానికి నా చుట్టూ ఎంతమంది వుండాలేమిటి? అయినా నువ్వు నా వెల్ విషర్‌వేగాని ఎనిమీవి కాదుకదా? "

ఎనిమీనని నేనన్నానా? చెప్పు ఏమిటి పని? "

"ఏంలేదు. మా నందిచేత ఓ మాంఛి నాటకం వేయించాలనిపించింది. వెంటనే వచ్చేశాను"

"ఏం నాటకం? ఎప్పుడు? " ఉత్సాహం ఉరకలు వేసింది నందిలో.

"నువ్వు వెయ్యదలుచుకున్న ఏ నాటకం అయినా సరే. ఇంక ఎప్పుడు అంటే ఇదుగో, మన కాలేజీ ఎలక్షన్ల హడావుడి అయిపోయాక"

నిరుత్సాహపడ్డ నంది ముఖం పక్కకు తిప్పుకున్నాడు.

"అలా నిరుత్సాహ పడిపోకు. ముందీ ఎలక్షన్లలో నేను ప్రెసిడెంట్‌గా ఎలక్ట్ అయిపోతే, ఆ తర్వాత ఆ ఆనందంలో మీ నాటకం ఏర్పాటు చేయడం ఎంతసేపు? నీ నాటకం విషయంలో నేను, నా ఎలక్షన్ విషయంలో నువ్వు మెయిన్ రోల్ ప్లే చేస్తామన్నమాట" రాజకీయం మాట్లాడాడు కన్నబాబు.

"సారీ డబ్బుంది కాబట్టి నా నాటకానికి నువ్వు సాయపడగలవేమోగాని, నీ ఎలక్షన్‌కి నేను ఏమీ ఉపయోగపడలేను" ఖచ్చితంగానే చెప్పేశాడు నంది.

"అలా అనేస్తే ఎలా నందీ. దగ్గర చుట్టాలం, మనం సాయంచేసుకోకపోతే ఎలా! ఏం లేదు. మంచి డ్రామా యాక్టరుగా నువ్వు స్టూడెంట్సుందరికీ తెలుసుకదా! కనక సరదాగా నీ ట్రూప్‌తో చిన్నచిన్న స్కిట్స్ వేస్తూ నా గురించి ప్రచారం చేస్తే మంచి ఉపయోగం వుంటుంది... ప్లీజ్"

"సారీ భయంకర కోతి గురించి జనానికి ధైర్యంచెబ్తూ, స్కిట్స్ ప్రదర్శిస్తూ కాలనీలన్నీ తిరిగే ప్రయత్నంలో వున్నాం. ఎలక్షన్ల విషయంలో అస్సలు ఇంట్రస్టు లేదు" మిత్రులతోబాటు లేచి, వెళ్ళిపోయాడు నంది.

పళ్లు కొరుకుతూ మిగిలిపోయాడు కన్నబాబు. కళ్లు మూసుకుని, కణతలు నొక్కుకుంటుండగా "ఏమిటి కన్నబాబూ! ఒంటరిగా కూర్చుని, ఏదో బాధపడుతున్నావు? " అంటూ వసంతంలా వచ్చింది ముగ్ధ.

ప్రాణం లేచి వచ్చినట్లయ్యింది కన్నబాబుకి.

"హాయ్ ముగ్ధా రా రా కూర్చో" అని మర్యాదగా ఆహ్వానించాడు కన్నబాబు.

కన్నబాబు అంత మర్యాదగా ఆహ్వానించడం వింత అనిపించింది ముగ్ధకి. అతని ఎదురు కుర్చీలో కూర్చుని అతన్తో మాట్లాడిద్దామా వద్దా అని ఒకక్షణం తటపటాయించింది ముగ్ధ.

"కూర్చో ముగ్ధా ప్లీజ్" రిక్వెస్టు చేశాడు కన్నబాబు.

అంతగా రిక్వెస్టు చేస్తున్నప్పుడు కూర్చోక తప్పలేదు ముగ్ధకి.

తను అసలు అతన్ని పలకరించి పొరబాటు చేశానేమోననిపించింది ఆమెకి. వెళ్ళి రెండు కాఫీలు తెచ్చాడు కన్నబాబు.

కాఫీ సిప్‌చేస్తూ, "చెప్పు- ఎందుకు కూర్చో మన్నావు? " అంది ముగ్ధ.

"కారణం చెప్పకపోతే, లేచి వెళ్ళిపోయేలా గున్నావే" అంటూ గట్టిగా, అనవసరంగా నవ్వాడు కన్నబాబు.

ముగ్ధ నవ్వలేదు. 'త్వరగా విషయం బయటపెడ్తేబాగుండును' అన్నట్లుగా చూస్తోంది.

"ఏంలేదు ముగ్ధా ఎలక్షన్ క్యాంపెయిన్ గురించే. చెప్పాగా... నీ అవసరం నాకుం దని... ప్లీజ్ ముగ్ధా. ఈరోజునుంచే నువ్వు నా తరపున క్యాంపెయినింగ్‌కి రావాలి. నీ స్పీచ్ నాకు బాగా వుపయోగపడుతుంది. నేను గెలిస్తే నీ రుణం వుంచుకోను. నీకు ఏ రూపంలో కావాలంటే ఆ రూపంలో రుణం తీర్చుకుంటాను, ఓకే"

ముగ్ధ ఏం మాట్లాడలేదు.

వెళ్ళిపోవడానికి సిద్ధపడుతూ లేచి నిలబ డింది.

"ముగ్ధా-ప్లీజ్ వెళ్ళిపోవద్దు"

"వెళ్తాను- నాకు ఈ ఎలక్షన్స్ అవీ యింట్రస్టులేదు. నందితో బాటు రాక్షసకోతి విషయంలో భయపడొద్దని ధైర్యం చెబ్తూ కాలనీల్లో ప్రోగ్రాములు ఇవ్వడానికి నేనూ వెళ్తున్నాను"

"ముగ్ధా- నేను చాలా మొండివాణ్ని. ఓట మిని అంగీకరించలేను. నేను గెలవాలని అనుకుంటే, గెలిచి తీరవలసిందే. అలాగే ఎవరితోనయినా ఏపనయినా చేయించుకో వాలంటే చేయించుకుతీరాల్సిందే. ఆ పని చెయ్యలేకపోతే చచ్చిపోవాలనిపిస్తుంది నాకు"

"ఏమో-నాకు తెలియదు. నీ దారి నీది, నాదారి నాది"

"నా మాటలు నీకు అర్థంకాలేదన్నమాట. నా కోరికని కాదన్న ఎవర్నీ నేను క్షమిం చను. ఎంతకయినా తెగిస్తాను"

"బెదిరించొద్దు కన్నబాబూ"

"బెదిరించడం కాదు. జాగర్త పడమని వార్నింగిస్తున్నాను. మర్యాదగా నావైపు రమ్మని ఆహ్వానిస్తున్నాను. నన్ను పిచ్చి వాణ్ని చెయ్యొద్దని, ఆ తర్వాత ఎవరు విచా రించినా ప్రయోజనం వుండదని హెచ్చరిస్తు న్నాను"

"భయం చావుతో సమానమని మా నాన్నగారు చెప్పారు. మంచి పనిని నిర్భ యంగా చేయాలని చెప్పారు, వస్తా" చర చరా వెళ్లిపోయింది.

బొమ్మయిపోయాడు కన్నబాబు. అతని చేతిలో గాజుగ్లాసు పగిలింది.

★ ★ ★

"ఏటి ఓబులేసుగోడు కాపడ్డేంటి? " అన్నాడు ఫుల్‌గా తాగొచ్చి, భోజనానికి కూర్చుని, చికెన్ బిర్యానీ తింటూ లారీ డ్రయివరు చలపతి. అసలు చలపతి తాగాక ఇంటికి రావడం ప్రారంభించింది గత నాలుగయిదు రోజులుగానే. అదీ రాత్రి పదవ్వకముందే వచ్చేస్తున్నాడు. అది భార్యా బిడ్డలమీద ప్రేమ కొద్దీ కాదు. ఊళ్లో తిరు గుతున్న రాక్షసకోతి మీదున్న భయంకొద్దీ. ఫుల్‌గా తాగి ఒళ్లు తెలియక రోడ్డుమీదెక్క డన్నా పడిపోతే, అదిగాని చూసిందంటే, దాని గోళ్లతో పనసపండుని చీల్చినట్టే చీల్చి పారేస్తుందనే భయం కొద్దీ అంతే. అందు కనే బాటిల్స్‌ని కూడా ఇంటికి దగ్గర్లోనే ఏ మెకానిక్ షాపులోనో, కిళ్లీబడ్డీలోనో కూర్చుని, ఖాళీ చేస్తున్నారు చలపతి అతని సావాసగాళ్లు.

భార్య గంగి మాట్లాడకుండా బిర్యానీ వడ్డి స్తోంది, భయంభయంగా.

"ఏటి మాటాడవేంటీ- మాట పడిపో నాదా. ఓబులేసుగోడేడీ? " అరిచాడు చల పతి.

గంగి బలవంతంమీద గొంతుపెగల్చుకుని అంది. "ఆడి పెండింట్లో టీవీలో ఉప్పుడు రంతం పిక్చరు సూపిత్తారంట. ఆ పిక్చరు సూసి, బేగానే వొచ్చేత్తానని ఎల్లాడు" ఆమె కళ్లల్లో భయం తాండవిస్తోంది.

చ(్రున లేచాడు చలపతి, "ఓసినీయమ్మ ఊళ్లో కోతి మీసాలు తిరిగిన వొస్తాదుల్ని సైతం బయంతో సంపేత్తాంటే, బొడ్డూడని బుడ్డోడ్ని వూళ్లోకి పంపిత్తావంటే ఎదవ ముండా" అంటూ లేచి, ఆమెని వంచి, వీపు మీద దభీదభీమని గుద్దేసి, కంగారుగా బయటకు పరుగెత్తి, అంతలోనే ధైర్యం చాలక లోపలకొచ్చి, తలుపులు బిగించి, కిటికీలోంచి కొడుకు కోసం బయటకు చూడసాగాడు.

గంగికి కూడా మొగుడు కొట్టాడనే బాధ కంటే కొడుకుని గురించిన భయం ఎక్కువ కాసాగింది. భర్త వెనగ్గా నిల్చుని కొంగు నోట్లో కుక్కుకుని, ఏడవసాగింది. "సాల్లే ఆపు ఏడుపు- ఈ ఏడుపు బుడ్డోడ్ని బయటకు పంపేటప్పుడుండాలి" అన్నాడు చలపతి గొంతులో తీవ్రత తగ్గించి.

నుదుటిమీద మొత్తుకుంటూ అంది గంగి, "పాపిస్టిదాన్ని- పెమాదం గురించి ఆలోసించలేదు. ఏదో కుర్రోడు టీవీ సూడ్డానికి సరదాపడుతున్నాడు. ఎల్లనిద్దాం. నువ్వొచ్చాక తంతే పడదాం అనుకున్నానుగాని 'కోతిగాని కుర్రోడ్ని సూత్తేనో...' అని అస్సలు తలవలేదు. ఇప్పుడు నేనేంసేతు?" అంటూ రోదించసాగింది, కింద కూలబడి.

"ఆపవే నీ ఏడుపు- మతి పనిసేయకుండా ఈ ఏడుపేటి?" అని కసిరాడు చలపతి. అయినా అతని గొంతూ ఒణికింది. గుండెల్ని భయం చుట్టేసింది.

"పోనీ మావా- నానెల్లి సూసిరానా?" అంది గంగి, లేచి నిలబడి.

"సాల్సాల్లే వూర్కో- దేవుడి దయుంటే ఆడికేం కాదులే"

"అన్నట్లు- ఆడన్నాడూ, మా ఫెండూ ఆల్ల అమ్మా నాన్నా సాలామంచోల్లూ, ఉండిపొమ్మంటే రేత్రికి వుండిపోతానాల్ల ఇంటికాడే అని కూడా అన్నాడు. ఒకేల వుండిపోనాడేమో" సడన్‌గా గుర్తొచ్చి చెప్పింది గంగి.

"ఓసినీయమ్మ- ఆ యిసయం సెప్పవేం యిందాకట్నుంచీని. అదీ అయ్యుంటుంది, ఇంత నేటయ్యిందంటే ఆడు ఆల్లింట్లోనే తొంగుని వుంటాడులే. ఇంక భయంలేదు. నడు, నిద్రోదువుగాని" అంటూ భార్యతో పక్కమీదకు చేరాడు చలపతి.

నిజానికి ఓబులేసు చెప్పినంత మంచివాళ్లేంకాదు వాడి ఫ్రెండు తల్లిదండ్రులు. టి.వి.లో సినిమా వస్తున్నంతసేపూ వాడి చేత వేరుశనగకాయలు ఒలిపించుకుని, సినిమా అయిపోయాక వాడిచేతిలో నాలుగు గింజలుంచి, "పొద్దుపోయింది యింక ఇంటికి పోరా" అని, బయటకు పంపించేసి, తలుపులు బిగించుకున్నారు.

బయట వీధి పొడవునా నిర్మానుష్యంగా వుంది. మానవమాత్రుడెవ్వరూ వీధిలో తిరగడంలేదు. సినిమా చూస్తుండిపోయాడుగానీ తను ఇంటికెలా వెళ్ళాలీ అని ఆలోచించలేదు. అందులో వీధులు యింత నిర్మానుష్యంగా వుంటాయి అనుకోలేదు.

గుండెలు అరచేతిలో పట్టుకుని దేవుడ్ని తలుచుకుంటూ, గబగబ నడక సాగించాడు ఓబులేసు. నాలుగయిదు మలుపులు తిరిగాడు. అన్ని వీధులూ నరసంచారంలేక బావురుమంటున్నాయి.

మెయిన్ రోడ్డుమీద కొచ్చాడు ఓబులేసు.

గబగబా నడుస్తున్నాడు. మధ్యమధ్యన పరుగులు తీస్తున్నాడు. మళ్లీ నడుస్తున్నాడు.

పోలీసు వ్యాను వాయువేగంతో వస్తోంది.

పోలీసులంటే వాడికి చచ్చే భయం. "ఒక్కడివీ ఎందుకు రోడ్డుమీద తిరుగుతున్నావురా దొంగలమ్డీకొడకా" అని తంతారేమోనని భయపడి, చటుక్కున ఓ చెట్టుచాటుకు దాక్కున్నాడు.

పోలీసు వ్యాను ముందుకు దూసుకుపోయింది.

'హమ్మయ్య' అనుకుని బయటకొచ్చి పరుగు సాగించాడు ఓబులేసు.

సగందూరం వచ్చేసినట్లే... ఓ కాలనీ దగ్గరవుతోంది.

కాని, యింతలో...

"హమ్మో... కోతి...!" అని పెద్ద పెడ బొబ్బ. వెంటనే భయంతో అనేక అరుపులు... ఏడుపులు... కిటికీ తలుపులు సైతం బిగించుకుంటున్న చప్పుళ్లు... "రక్షించండీ... రక్షించండీ" అంటూ ఓ వ్యక్తి చావు భయంతో మెయిన్‌రోడ్డుకి ఈ పక్కనుంచి ఆ పక్కకు పరుగెత్తి, చీకట్లో కలిసిపోయాడు.

భయంతో కాళ్లు ఒణికాయి ఓబులేసుకి.

వెనక్కి తిరిగి వచ్చిన దారినే పరుగెత్తసాగాడు శక్తికొద్దీ.

కానీ... కానీ... కోతి... పెద్దకోతి... భయంకర కోతి... రోడ్డుపక్కనుంచి, మెయిన్‌రోడ్‌మీదకి వచ్చి, చేతులు చాచి తనవైపే వస్తోంది.

పైప్రాణాలు పైనే పోయాయి ఓబులేసుకి.

గుండె ఆగిపోయినంత భయంవేసింది.

కానీ శక్తి తెచ్చుకున్నాడు.

విపరీతమయిన భయం వేసినప్పుడు దేవుడ్ని తలుచుకోవాలని, ఆచార్యులుగారు పురాణం చెబ్తున్నప్పుడు విన్నాడు. అందులోనూ చీకట్లో ఒంటరిగా వున్నప్పుడు ముఖ్యంగా ఆంజనేయుడ్ని తలుచుకుంటే భయం పటాపంచలు అయిపోతుందని ఆయన చెప్పారు. అందుకనే ధైర్యాన్ని కూడ గట్టుకుని, గట్టిగా "ఆంజనేయా, వీరాంజనేయా, కాపాడూ నేను చచ్చిపోతే మా అమ్మ ఏడుస్తుంది. మా అమ్మా చచ్చిపోతుందీ. కాపాడూ. ఆంజనేయా, వీరాంజనేయా" అంటూ అరుస్తూ వెనక్కి తిరిగి, పిక్కబలంకొద్దీ పరుగెడ్తూ... పరుగెడ్తూ గోతిలో పడిపోయాడు.

స్పృహ తప్పిపోయింది.

అయితే రాక్షసకోతి ఆగలేదు. అలాగే వేగంగా వచ్చింది. ఒంగి, మోకాళ్లమీద అన్చుకుంటూ గోతిలోకి ఒంగి తన పొడవైన చేతుల్తో ఓబులేసుని ఒడుపుగా పట్టుకుని, ఒక్క వూపులో పైకిలాగి, చేతుల్లోకి ఎత్తుకుని, ఒక ఇంటి దగ్గరకు నడిచి, అరుగుమీద ఓబులేసుని పడుకోబెట్టి, దగ్గర్లో వున్న కిళ్లీకొట్టుదగ్గరున్న నీటితొట్లోంచి దోసిళ్లతో నీళ్లు తెచ్చి ఓబులేసు మొహంమీద జల్లింది.

ఒక్కసారి మెలకువ వచ్చినట్లయింది ఓబులేసుకి. కానీ కళ్లు తెరవడానికి సాహసించలేకపోయాడు. బెణికిన తన కాళ్లని ఎవరో సవరదీస్తున్నట్లనిపించి, "ఆంజనేయా కాపాడు. వీరాంజనేయా కాపాడు..." అంటూ నెమ్మదిగా కళ్లు తెరిచి భయంతో కెవ్వుమన్నాడు.

తన కాళ్లను సాగదీసి నొప్పి తగ్గడానికి ఒత్తుతున్నది రాక్షస కోతి.

తన అరుపు వింటూనే అది అదిరిపడిపడి, 'భయంలేదు' అన్నట్లుగా హస్తముద్రలు పెట్టి వేగంగా పారిపోయింది చీకట్లోకి.

మతిపోయింది ఓబులేసుకి.

అంటే- తనని గోతిలోంచి రక్షించి, ముఖం మీద నీళ్లుజల్లి, తన కాళ్లని సవరదీసి, తనకి అభయం చెప్పింది రాక్షసకోతా? ! ఇది కలా-నిజమా! ఆనందంతో కాలనీ దద్దరిల్లిపోయేలా "ఆంజనేయా, వీరాంజనేయా" అంటూ కేకలు పెడ్తూ, తన్మయత్వంతో గెంతుతూ, ముందుకు సాగుతున్నాడు ఓబులేసు.

ఇళ్లల్లో టపటపా లైట్లు వెలిగాయి.

నెమ్మదిగా కిటికీ తలుపులు తెరుచుకున్నాయి.

నిర్భయంగా ఓ బాలుడు ఆంజనేయుడ్ని తలుచుకుంటూ రాత్రివేళ పహిల్వాన్లే భయంతో ఇళ్లల్లో తలుపులు బిగించుకు కూర్చున్న ఈ రోజుల్లో... ఒంటరిగా అలా వెళ్లడం గమనించిన తలకాయలు నోళ్లు వెళ్లబెట్టాయి.

ఇంతలో పోలీసు విజిల్స్. సర్రున వ్యాను వచ్చి ఆగింది.

వాళ్ల ఎదురుగా నిర్భయంగా ఓబులేసు "ఆంజనేయా, వీరాంజనేయా" అంటూ నాట్యం చేయసాగాడు, తనకొచ్చిన స్టెప్పులతో.

మతులుపోయిన పోలీసులు- కోతి చుట్టుపక్కల ఎక్కడా లేదుకదా అని కళ్లు పొడు

చుకు చూసి జాగర్తపడి మరీ వ్యానులోంచి దిగారు లోడ్ చేసివున్న తుపాకులు చేత పట్టి.

వాళ్లముందు, వాళ్లని చుట్టి తిరుగుతూ, పూనకం వచ్చినవాడిలా రెచ్చిపోయి మరీ గెంతసాగాడు. "ఆంజనేయా, వీరాంజనేయా" అంటూ ఓబులేసు.

తెల్లబోయి మొహాలు చూసుకున్నారు పోలీసులు. "ఒరేయ్, ఒరేయ్ ఆగరా... ఆగరా... ఆగరా నాయినా" అంటూ బతిమాలి, బెదిరించి ఆపుచేశారు వాడ్ని. "ఎవరివిరా నువ్వు? ఒంటరిగా ఇంత రాత్రివేళ ఇలా గెంతుతున్నావు భయంలేకుండా" అనడిగారు.

పోలీసు వ్యానుని చూసిన ధైర్యంతో ఇళ్లల్లోనివాళ్లు తలుపులు తెరుచుకుని, ఒకొక్కరుగా బయట కొచ్చి ఓబులేసుని వింతగా చూస్తూ నిలబడ్డారు.



జనం ఒక్కొక్కరే వచ్చి తనని ప్రత్యేకంగా చూస్తుండడంతో మరింత రెచ్చిపోయాడు ఓబులేసు. మళ్ళీ "ఆంజనేయా, వీరాంజనేయా" అంటూ గెంతసాగాడు.

"ఈసారి మళ్ళీ ఎగిరావంటే లాఠీతో కుళ్లబొడుస్తాను. ఆగు" అని గర్జించాడు ఇన్‌స్పెక్టరు.

ఆగాడు ఓబులేసు భయంతో కాదు ధైర్యంగానే. భయంకర కోతినుంచే ప్రాణాలతో బయటపడ్డ తను వీళ్లకి భయపడ్డమేమిటీ అన్నట్లుగా ధైర్యంగా నిలబడ్డాడు. 'ఎవరివిరా నువ్వు, ఇంత రాత్రివేళ ఇలా ధైర్యంగా, ఒంటరిగా ఎందుకు గెంతుతున్నావురా?' అని ఈసారి పోలీసులతో బాటు జనం కూడా అడిగారు.

"సెబ్తానుగానీ- నమ్మరు మీరు" అన్నాడు ఓబులేసు.

"నమ్ముతాంగానీ- చెప్పరా" అన్నారు అందరూ.

"ఆంజనేయుడిమీద ఒట్టేసి, నిజంసెబ్తున్నా- ఇనండి" అంటూ వాడు జరిగిందంతా పూసగుచ్చినట్లు చెప్పాడు.

అందరూ నోళ్లు వెళ్లబెట్టి విన్నారు.

"ఆంజనేయా, వీరాంజనేయా రక్షించు" అంటూ అందరూ పోలీసుల్తోసహా అప్రయత్నంగా గొంతెత్తి అరిచారు. పోలీసులయినా మనుషులే కదా. భయం, భక్తి అందరికీ సమానమేకదా. దేవుడు, దెయ్యం అందరికీ ఒకటేకదా. అందులో రాక్షసకోతి విషయంలో పోలీసులూ మామూలు జనంలాగే భయపడ్తున్నారు. పైకి విధినిర్వహణలో భాగంగా ధైర్యాన్ని ప్రదర్శిస్తున్నారంతే.

క్షణాల్లో సమాచారం పత్రికల ఆఫీసులకి జేరిపోయింది.

పోలీసు వ్యానులో ఓబులేసుని ఇంటిదగ్గర క్షేమంగా దింపి, టపటపా ఫొటోలు తీసుకుని, పక్షుల్లా ఎగిరిపోయారు అందరూ.

పొద్దున్నే న్యూస్‌పేపర్లు చూస్తూనే మతిపోయింది దీనబంధుకి.

'బాలుడ్ని ఆపదనుంచి రక్షించిన రాక్షసకోతి', 'రాక్షసకోతి కాదది- సాక్షాత్తూ ఆంజనేయస్వామి- బాలుడి కథనం' అన్న హెడ్డింగులని రెప్పవాల్చకుండా గుడ్లప్పగించి చూస్తున్నాడు దీనబంధు.

"పేపర్లలో వార్తలు చదివారా దీనబంధూ. ఎంత వింతగా వుందీ! అర్ధరాత్రివేళ బాలుడ్ని గోతిలోంచి బయటకుతీసి,

సపర్యలు చేసి రక్షించిందిట రాక్షసకోతి. పేపర్లే కాదు పోలీసు కమీషనర్‌గారు కూడా ఇందాకా మాట్లాడారు ఫోనులో. ఆ కుర్రాడ్ని పిలిపించి ఆయన స్వయంగా మాట్లాడా రుట. 'కుర్రాడి మాటలు పూర్తిగా నమ్మదగ్గ విగా వున్నాయి' అంటున్నారాయన. ఏవిటీ వింత? " అంటూ ఓ విధమైన ఆశ్చర్యం, మరోవిధమయిన ఆనందంతో ప్రశ్నిస్తూ లోపలికొస్తున్న చక్రవర్తిని మిడిగుడ్లతో చూస్తున్నాడు దీనబంధు.

మళ్లీ చక్రవర్తే అడిగాడు, "ఏవిటంటా వయ్యా ఇదంతా- ఏదయినా మాయో, మంత్రమో అంటావా? "

ఏమీ చెప్పలేక పెదవి విరిచాడు దీన బంధు అన్యమనస్కంగా.

"అదేవిటయ్యా, ఎంతటి విషమపరిస్థితు ల్లోనయినా నవ్వుతూ కనిపించి, తోచిన సల హాయిచ్చి, టెన్షన్ తగ్గించడానికి ప్రయత్ని స్తావు. అల్లాంటిది ఈరోజు రాక్షసకోతి బాధితులకి బదులు రాక్షసకోతిచేత రక్షింప బడ్డ వ్యక్తి అని పేపర్లో చదివి, నా మనస్సు ఎంతో తేలికపడి, నేనాశ్చర్యపోతుంటే నువ్వు మాట్లాడవేమిటీ? " అని చక్రవర్తి అంటూం డగా, లోపల్నుంచి ఇంద్రాణి పరుగెత్తుకొ చ్చింది హడావిడిగా.

"ఏమండీ, ఇది విన్నారా! ఇన్నిరోజులూ మీరు రాక్షసకోతి రాక్షసకోతి అంటూ భయ పడ్డారు చూడండీ- అది రాక్షసకోతి కాదట, సాక్షాత్తూ ఆ ఆంజనేయస్వామేట. సిద్ధాంతి గారి భార్య ఫోనుచేసింది" అని ఆమె చెబ్తూండగా ఫోను రింగయ్యింది.

"చక్రవర్తి హియర్"

"సార్ కమీషనర్ మాట్లాడుతున్నాను. మీరు ఓ గంటలో క్లాక్ టవర్‌దగ్గర ఆంజనే యస్వామి గుడికి సతీసమేతంగా రండి. ఊళ్లో ఎలైట్ అంతా వస్తున్నారు. స్వామి నిత్యా నంద ఏదో ముఖ్యమైన ప్రకటన చేస్తారుట"

"అలాగా- తప్పకుండా వస్తాం. దేనికి సంబంధించి ప్రకటన? "

"రాక్షసకోతి గురించే. ఈవాళ పేపర్లు హోరెత్తిస్తున్న విషయం గురించే"

"ఓకే- వస్తాం"

"ఉంటానండీ- నమస్తే"

"నమస్తే" అని ఫోను కట్‌చేసి, "ఇంద్రాణీ త్వరగా తయారవ్వు. క్లాక్‌టవర్ ఆంజనే యుడి గుడిదగ్గర సిటీ పెద్దలందరూ జమ అవుతున్నార్ట. స్వామి నిత్యానంద కూడా వస్తున్నార్ట. ఈ కోతికి సంబంధించి ఏదో ముఖ్యప్రకటన కూడా చేస్తార్ట" అన్నాడు హడావుడిగా లేస్తూ.

"అల్లాగా- తప్పకుండా వెళ్దాం. అయిదుని ముషాల్లో నేను తయారైపోతాను. తమ్ముడూ నువ్వూ రారా" అని అతని రియాక్షన్ కోసం లేచి చూడకుండా, ఉత్సా హంగా లోపలకి వెళ్ళిపోయిందావిడ.

"ఏం దీనబంధూ- నువ్వూ తయారవుతు న్నావుగా" అన్నాడు చక్రవర్తి.

"లేదు బావగారూ. మీరు వెళ్లండి. నాకి వాళ కొంచెం ఒంట్లో నలతగా వుంది" అన్నాడు దీనబంధు నీరసంగా.

"సరే- విశ్రాంతి తీసుకో. ఆ ఆంజనేయ స్వామి దయవలన ఈ సమస్య తీరిపోతే, గట్టున పడతాం మనం" అంటూ లోపల గదిలోకి వెళ్లాడు చక్రవర్తి.

దీనబంధు పళ్లు గిట్టకరుచుకున్నాయి.

★ ★ ★

చక్రవర్తి కారు ఆంజనేయుడి గుడిని చేరింది.

కారులోంచి దిగుతూ అక్కడ అప్పటికే చేరిన జనంలోని పెద్దల్ని సంభ్రమాశ్చర్యా లతో చూశాడు చక్రవర్తి. పెద్దపెద్ద ఉద్యోగ స్తులూ, పెద్దపెద్ద వ్యాపారులతోబాటు చాలామంది రాజకీయ నాయకులు, చింతల నాయుడు, అతని అనుచరులూ కూడా వున్నారు.

కొందరు వూరిపెద్దలూ, పోలీసు ఉద్యోగ స్తులూ వచ్చి చక్రవర్తి దంపతుల్ని ఆహ్వా నించి, తీసుకుపోయి షామియానా కింద

ముందు వరస కుర్చీల్లో కూర్చోబెట్టారు. కూర్చుంటూ, వేదికమీద కూర్చునివున్న స్వామి నిత్యానందకి చేతులు జోడించి నమస్కరించాడు చక్రవర్తి. ఆశీర్వదించి గొంతు సవరించుకున్నారు స్వామి నిత్యానంద.

"మేము వూహించినది నిజమని నిర్ధారణ అయ్యింది. నిన్న రాత్రి సంఘటన దాన్ని నిర్ధారించింది. రాక్షసకోతి అంటూ సంబోధిస్తూ మనం ఎంతో ఈ అయిదారురోజులూ అపచారం చేశాం. రాక్షసకోతిగా మూర్ఖత్వంతో ప్రజలు భయపడ్డది మనిషి తన పాపాన్ని మరింత పెంచుకోవడానికే! రాక్షసకోతి రూపంలో మన నగర సంచారం చేస్తున్నది ఒక కోతి కాదు. సాక్షాత్తూ ఆంజనేయస్వామే! ఉగ్ర ఆంజనేయస్వామి! ఏదో అహంకారంతో ఆయనపట్ల అపచారం చేసివుంటాం. అందుకే ఆగ్రహించి ఆయన రౌద్రరూపంతో సంచరిస్తున్నాడు. బాలుడ్ని రక్షించి, మరి కొందర్ని శిక్షించాడంటే ఆ కొందరూ ఆ వాయుపుత్రుడిపట్ల అపచారం చేసివుండొచ్చు. బాలుడ్ని రక్షించి, మంచివాళ్లకి, నిర్మలమైన మనసున్న పసివాళ్లకి తన రక్ష ఎప్పుడూ వుంటుందని ఆయన నిరూపించాడు. సాక్షాత్తూ ఆంజనేయస్వామి ఈవిధంగా సంచరిస్తున్నాడు కాబట్టే, ఇన్ని ప్రయత్నాలు చేసి, ఇంత బలగం వుండీ మనం ఏమీచేయలేక చతికిలబడ్డాం. ఇక ఈ సమస్యకి విముక్తి మార్గం దొరికింది. ఈ ఆంజనేయస్వామి దేవాలయాన్ని వుద్ధరించి, సర్వసుందరంగా మనం తీర్చిదిద్ది, పక్షంరోజులు నిత్యాన్నదానం చేయాలి పాప పరిహారానికి. మనం అందరం తలుచుకుంటే అది ఒక పెద్ద సమస్య కాదు. ఈ ఆరుబయట స్థలం మధ్యలో ఏభయి అడుగుల ఎత్తున ప్రసన్నాంజనేయస్వామి విగ్రహాన్ని మనం ప్రతిష్ఠించాలి. అప్పుడే ఆయన రౌద్రం కాకుండా, ప్రసన్నవీక్షణాలని మన నగరం మీద సారిస్తాడు. ఈ నిర్ణయానికి మీరందరూ సమ్మతి తెలిపిన మరుక్షణం నుంచే, ఆ స్వామి చల్లబడడం ప్రారంభిస్తాడు. ఏదీ అందరం ఒక్కసారి గొంతులు విప్పి భక్తితో స్వామిని కొలుద్దాం..."

అందరూ వువ్వెత్తుగా లేచారు భక్తిశ్రద్ధలతో.

అంతా ముక్తకంఠంతో నిత్యానందస్వామితో గొంతు కలిపి, "వీరాంజనేయా రక్షించు ప్రసన్నాంజనేయా పాహిమాం" అంటూ దిక్కులు పిక్కటిల్లేలా నినాదాలు ఇచ్చారు.

దేవాలయాన్ని ఉద్ధరించడానికీ, స్వామి ఏభయి అడుగుల విగ్రహ ప్రతిష్ఠకీ క్షణాల్లో నిర్ణయం జరిగిపోయింది. మైకులో విరాళాలు చదివించడం కూడా ప్రారంభమయిపోయింది.

"ఇంతటి ఉదాత్తమైన, పవిత్రమైన నిర్ణయం మనం తీసుకున్నాం కాబట్టి ఇక మనం నిర్భయంగా బతకొచ్చు ఈ రోజు నుంచే. ఊరికే అనవసరపు తిరుగుళ్లు తిరగమని మేము చెప్పంగానీ అవసరానికి అందరూ మునుపటిలాగే రాత్రి సమయంలోనయినా నిర్భీతిగా బయటకు రావొచ్చని, శ్రీ ఆంజనేయస్వామి రక్ష వుంటుందనీ, భయంకర కోతి పేరుతో ఇంక భయం ఎవరికీ అవసరం లేదని మేము తెలియజేస్తున్నాం" స్వామీ నిత్యానంద గొంతు మళ్లీ ఖంగుమంది.

అందరూ ఆనందంగా, తృప్తిగా ఇంటి ముఖం పట్టారు.

"ఇంతటి పవిత్రమైన కార్యక్రమంలో పాల్గొనడానికి మా తమ్ముడు కూడా వచ్చివుంటే బాగుండునండీ. ఒంట్లో బాగులేక ఇంటి దగ్గరే వుండిపోయాడు" అంది ఇంద్రాణి నొచ్చుకుంటూ.

కానీ ఆమెకేం తెలుసూ, దీనబంధు ఇప్పుడు ఇంటి వద్ద లేడనీ, వేగంగా కారు తోలుతూ ప్రకాశం ఇంటివైపుకి దూసుకుపోతున్నాడనీ!

★ ★ ★

దీనబంధుకి మనసు మనసులో లేదు.

మెదడు వేడెక్కిపోతోంది. గుండెలు మండి పోతున్నాయి.

ప్రకాశం ఇంటిని చేరింది కారు.

తటాలున తలుపు తెరచి కారు దిగి, ఇంటిలోకి దూసుకెళ్లాడు దీనబంధు.

ప్రకాశం లేడు ఇంట్లో. అతని తల్లి కూడా లేదు. పిల్లలిద్దరూ వున్నారు.

"ప్రకాశం లేడా ఇంట్లో? " కసుర్తూ అడిగారు దీనబంధు.

"అన్నయ్య లేడు. అమ్మ హాస్పిటల్లో వుందిగా అక్కడికెళ్లాడు" బిక్కుబిక్కుమంటూ కూర్చున్న పిల్లలిద్దరూ భయం భయంగా చెప్పారు.

"ఏ హాస్పిటలు? "

చెప్పారు.

హాస్పిటల్ వైపు దూసుకుపోయింది కారు.

హాస్పిటల్‌ని చేరుతూనే లోపలకి పరుగు తీసి పేషెంటు పేరు చెప్పి ప్రకాశం కోసం రిసెప్షన్‌లో వాకబు చేశాడు దీనబంధు. పేషెంటు ఇన్సెన్టివ్ కేర్ యూనిట్‌లో వుందనీ, అటెండెంట్ ఆ చుట్టుపక్కల ఎక్కడయినా వుండి వుండొచ్చనీ చెప్పారు.

దీనబంధు తటపటాయించాడు. ముందుకు వెళ్లడమా, వెనక్కి వెళ్లడమా అన్న మీమాంసలో పడ్డాడు. ముందుకు వెళ్తే ప్రకాశం దొరుకుతాడు కానీ తల్లి ఇన్సెన్టివ్ కేర్‌లో వున్నప్పుడు కొడుకు ఆలోచన్లు అన్నీ ఆమె మీదే వుంటాయి. విపరీతమైన ఆందోళనతో వుంటాడు. ఇప్పుడు వేరే ఏ విషయం ఎత్తినా మనిషి రెచ్చిపోతాడు కోపంతో. అవతలి వాడెవడయినా లెక్కచేయడు. ఏమాత్రం లౌక్యం తెలుసున్న వాడయినా ఈ సమయంలో కోపం, తొందర పనికిరాదు.

వెనుతిరిగాడు దీనబంధు.

కారు వేగంగా అక్కగారింటికి చేరేసరికి అప్పటికే వచ్చివున్నారు అక్కాబావగారు.

"ఏవిటి దీనబంధూ! ఒంట్లో బాగాలేదన్నావు ఎక్కడికెళ్లావు? "

"డాక్టరుగారికోమారు చూపించుకుని వస్తున్నాను బావగారూ. ఇటువంటి టెన్షన్ సమయంలో నేను అడ్డంపడితే కష్టంగదా అందుకని"

"ఏవన్నాడురా డాక్టరు? " ఆందోళనగా అడిగింది ఇంద్రాణి.

"ఏం ఫరవాలేదన్నాడు అక్కా! కొద్దిగా టెంపరేచరు తగిలిందంతే. కొద్దిగా బి.పి కూడా పెరిగింది. దేని గురించయినా ఎక్కువగా ఆలోచిస్తున్నారా అని అడిగాడు. అదే రాక్షసకోతి విషయంలో బావగారు మనసు పాడుచేసుకుంటుంటే చూడలేక నేను విపరీతంగా ఆందోళన చెందుతున్నాను అని చెప్పేశాను. సెన్సిటివ్ మనసులు ఎక్కువగా ఆందోళన పడితే ఆరోగ్యం పాడవుతుందండీ అనీ హెచ్చరించాడు. ఏదయినా మన చేతుల్లో వుందా? సరే నా విషయం వదిలెయ్యండి. గుడి దగ్గరకు అందరూ వచ్చారా! ఏవిటి విశేషాలు? "

"మనం ఇన్ని రోజులుగా అనుకుంటున్నట్లు ఇది రాక్షసకోతి కాదుట్రా తమ్ముడూ! సాక్షాత్తూ ఆ ఆంజనేయస్వామేట. ఆ స్వామి విషయంలో అపచారం జరిగిందట. అందుకనే ఆయన ఆగ్రహించి అందర్నీ ఒళ్లు తెలుసుకు మసలుకోండిరా అని హెచ్చరించడానికే రాత్రుళ్లు ఇలా స్వైరవిహారం చేస్తున్నార్ట. స్వామి నిత్యానంద చెప్పారు. ఆంజనేయస్వామి కాబట్టే ఎవ్వరూ సాహసించి ఇన్ని రోజులూ పట్టుకోలేకపోయారు" అంది ఇంద్రాణి.

"మరి ఇప్పుడు ఏం చెయ్యాలిట? " పదాల్ని తూచితూచి పలికాడు దీనబంధు.

"ఆంజనేయ దేవాలయాన్ని ఉద్ధరించడానికి, ఏభయి అడుగుల ఎత్తున్న ప్రసన్నాంజనేయస్వామి విగ్రహాన్ని బయట ఆవరణలో ప్రతిష్ఠించడానికి, పదిహేను రోజుల బాటు అన్నదానం జరపడానికి నిర్ణయం జరిగిపోయింది. నిజంగా ఇప్పుడు చాలా

# ఏరినముత్యాలు

- కష్టించి పని చేసే ప్రజలున్న దేశమే సంపన్నమైన దేశము.

  – థియోడర్ హెర్జల్

- మనుషులు చేసే తప్పొప్పులను కోరికలే ప్రోత్సహిస్తాయి.

  – బెర్ట్రాండ్‌రస్సెల్

- పరమాత్మను తెలుసుకోవడం, ఆయనను సేవించడం ఇంతకుమించిన జ్ఞానం వేరేలేదు.

  – గురునానక్

- ఎప్పుడయితే స్వాతంత్ర్యము, లైసెన్సు సంపాదించుకుంటుందో అప్పుడు నిరంకుశాధికారం దగ్గరపడిందన్న మాటే.

  – విల్‌డ్యూరంట్

- ఒక జాతి లేక మనిషియొక్క ఉన్నతికి అవరోధమే అతృప్తి.

  – ఆస్కార్‌వైల్డ్

- నూరుగురు ఫాదరీలకంటే ఒక ఉత్తమ ఉపాధ్యాయుడు వల్ల ఎంతో ఉపయోగమున్నది.

  – థామస్‌పెయిక్

- సృజన వాంఛే శాస్త్ర పరిశోధనకు ప్రధానమైన ప్రేరణ.

  – సి.వి.రామన్

- ప్రజలలో లోపించింది బలం కాదు సంకల్పం.

  – విక్టర్‌హ్యూగో

- ఏ స్త్రీ అయితే అన్నిరంగాలలో ప్రవేశిస్తుందో మరన్ని విషయాలలో అత్యంత చొరవగా జొరబడుతుందో ఆ స్త్రీ ఉత్తమ ఇల్లాలు మాత్రమేకాదు ఉత్తమ మాతృమూర్తి కూడా.

  – ఇందిరాగాంధీ

- బాలెట్ పత్రము లేని ఓటర్ బుల్లెట్స్ లేని తుపాకి పట్టుకున్న సిపాయి లాంటివాడు.

  – ఈసెన్‌హోవర్

- గాలిమేడలు కట్టుకోవడంకన్నా ఎన్నో పనులు సౌలభ్యంగా ధ్యానం వలన ఏర్పడతాయి.

  – టెన్నిసన్

- న్యాయశీలత లేని విజ్ఞానం అపాయకరం, భయోత్పాతకం.

  – శామ్యూల్‌జాన్సన్

సేకరణ: ఎ. రాంబాబు

ప్రశాంతంగా వుంది నాకు దీనబంధూ! స్వామివారు చెప్పారు, ఇంక ఎటువంటి ఇబ్బందులూ ప్రజలకు కలగవని. మనం వేరే సమస్యలని గురించి ఇంక ఆలోచించొచ్చు" అన్నాడు చక్రవర్తి రిలాక్స్‌డుగా.

"అదే నిజమయితే అంతకంటే ఆనందం ఏముంటుంది బావగారూ"

"అదేవిటీ, నీకు అనుమానమా ఇంకా? "

"దేన్నయినా లోతుగా, రేషనల్‌గా ఆలోచించే తత్వం కదా నాది. అందుకని ఇటువంటి విషయాల్ని ఓ పట్టాన నమ్మలేను బావగారూ" నవ్వాడు దీనబంధు.

"కొన్ని విషయాలు నమ్మక తప్పదుగా. అది నిజంగా కోతి అయితే కుర్రాడ్ని రక్కి వదిలిపెట్టాలిగానీ, గోతిలోంచి పైకి తీసి సపర్యలు చేసి ఎందుకు రక్షిస్తుందీ? ఆశ్చర్యంగా లేదూ? "

"అవును చాలా ఆశ్చర్యంగా వుంది" సాలోచనగా అన్నాడు దీనబంధు.

★ ★ ★

గోధూళివేళ...

మీటింగులతో విసిగి వేసారిపోయి అలసిపోయి ఇంటికి వచ్చిన కళ్యాణ చక్రవర్తి కోరిక మీద భగవద్గీతలోని రెండు శ్లోకాలని, వాటి అర్థాలని చెప్పి ఆయన దగ్గర శలవు తీసుకుని ఇంటికొచ్చారు కేశవరావుగారు. రోజూలాగే చక్రవర్తి కారులో పంపిస్తానన్నా మర్యాదగా తిరస్కరించి సిటీ బస్సులో ఇంటికొచ్చేసరికి ఏడున్నరయింది.

అప్పటికే ముగ్ధ తులసి కోట దగ్గర, పూజా మందిరంలోనూ దీపాలు వెలిగించి వంట పూర్తి చేసేసి, తండ్రి రాకకోసం గుమ్మం దగ్గర ఎదురుచూస్తోంది.

గేటు తీసుకు లోపలకొస్తూ గుమ్మం దగ్గరే ఎదురయిన ముద్దుల కూతురు ముగ్ధని చూస్తూనే రోజంతా పడ్డ శ్రమ మరిచిపోయి, ఎంతో హాయిని అనుభవిస్తూ "బంగారం ఏం చేస్తున్నావురా" అన్నారు.

రివ్వున తూనీగలా దూసుకొచ్చి, తండ్రిని చుట్టేసుకుంటూ "నాన్నగారూ" అంది ముగ్ధ.

"నా బంగారుతల్లే నా వరాలమూటే..." అంటూ కూతుర్ని పొదివి పట్టుకుని లోపలకి నడిచారాయన.

తండ్రి బట్టలు మార్చుకోగానే తువ్వాలు అందించింది స్నానానికి.

"తల్లీ నేను స్నానం చేసొచ్చి అన్నం వండేస్తానే" అన్నారు కేశవరావుగారు.

"మీరు వండక్కర్లేదు నాన్నగారూ"

"అదేం? "

"నేను వండేశాను కాబట్టి" గలగలా నవ్వేసింది ముగ్ధ.

"అదా! ఏమిటి తల్లీ. చక్కగా ఆడుతూ పాడుతూ చదువుకోవలసిన వయసులో ఈ వంటలూ, ఇంటి పనులూ నీకెందుకు చెప్పు? నేనున్నానుగా నీకోసం"

"నేనూ వున్నానుగా మీ కోసం నాన్నగారూ"

"ఉన్నావు తల్లీ! నువ్వున్నావు కాబట్టే నిన్ను చూసుకుంటూనే నేను బతికున్నాను. వెయ్యేళ్లు మహాలక్ష్మిలా వర్ధిల్లు తల్లీ. నా బంగారం వర్ధిల్లు..." అంటూ తువ్వాలు అందుకుని స్నానం చేయడానికి వెళ్లారాయన.

తండ్రి స్నానం చేసి రాగానే భోజనం వడ్డించడానికి సిద్ధం చేసింది ముగ్ధ. స్నానం ముగించి దైవప్రార్థన చేసుకుని భోజనానికి కూర్చున్నారు కేశవరావుగారు. పదార్థాలు వడ్డించింది ముగ్ధ.

అన్నం కలిపి "మొదటి ముద్ద నా బంగారు తల్లికి..." అంటూ కూతురి నోటికి అందించారు. నోరు చిన్నగా తెరచి ముద్దని అందుకుంది ముగ్ధ. వెంటనే తనూ ఓ ముద్ద కలిపి తండ్రి నోటికి అందించింది. తన్మయుడై నోరు తెరచి ముద్దని అందుకున్నాడాయన. తర్వాత ఇద్దరూ భోజనాలు చేశారు.

"నాన్నగారూ"

"ఊఁ"

"నేను ఇప్పుడే మా పేరిందేవి ఇంటికి వెళ్లి ఓ నోట్ పుస్తకం తీసుకుని వచ్చేస్తానేం"

"ఇప్పుడా? రాత్రి వేళ ఎందుకులే తల్లీ, పొద్దున్నే వెళ్దువుగాని"

"కాదు నాన్నగారూ, ఇక్కడున్నట్లు వచ్చేస్తాగా. చాలా ఇంపార్టెంటు నోట్సు నాన్నగారూ! రేపు క్లాసులో ప్రశ్నలు వేస్తారు దానిమీద. అందుకనీ"

"నేను రానా? "

"ఎందుకండీ! మీరు బాగా అలసిపోయి వున్నారు. విశ్రాంతి తీసుకోండి. నేను త్వరగా వచ్చేస్తాగా" అంటూ బయటకు నడిచింది ముగ్ధ.

"జాగ్రత్త తల్లీ! వెంటనే వచ్చెయ్" అంటూ పడక కుర్చీలో వాలారు కేశవరావుగారు.

వీధిలోకి వచ్చిన ముగ్ధ గబగబా అడుగులు వేయసాగింది.

ఇంక భయంకర కోతి భయం లేదని తెలిసినా జన సంచారం అప్పుడే బాగా పలచబడిపోయింది.

అక్కడొకరూ, అక్కడొకరూ కనిపిస్తున్నారు. వాళ్లయినా వేగంగా, హడావుడిగా, దిక్కులు చూడకుండా నడుస్తూ పోతున్నారు. కిళ్లీ షాపులవాళ్లు, కిరాణా దుకాణాలవాళ్లూ బేరాలు లేక కొట్లు మూసేసే హడావుడిలో వున్నారు. ఊరకుక్కలు కూడా అరవడానికి భయపడ్తూ రోడ్డు మూలలకి పోయి సన్నగా మూలుగుతూ పడుకుంటున్నాయి.

ముగ్ధ అడుగులు వేగంగా పడుతున్నాయి.

త్వరగా వెళ్లి పుస్తకం తీసుకుని, వెంటనే తిరిగి వెళ్లిపోవాలి. ఏమాత్రం ఆలస్యమయినా నాన్నగారు కంగారుపడ్తారు. నంది, ఇతర స్నేహితుల్తో కలిసి వాడల్లోనూ, కాలనీల్లోనూ, జంక్షన్‌లలోనూ జనాన్ని పోగుచేసి కోతి గురించి భయపడొద్దని, జట్లుజట్లుగా వుండి దాన్ని ఎదుర్కోమని ప్రచారం చేసినా ఈ రోజు పేపర్లలో అది మృగం కాదు ఆంజనేయస్వామేనని ప్రచారం జరిగినా భయమనేది మనుషుల్ని ఇళ్లవద్దే కట్టిపడేసిందన్నమాట. అయినా ఏం పాపం చేశారని మా నగర ప్రజలకే రావాలి ఈ సమస్య? అందులో చక్రవర్తిగారి లాంటి వుత్తముడు మేయర్‌గా గెలిచాక ఈ సమస్య మొదలవడం ఎంత విడ్డూరం? పాపం, ఆయన మానసికంగా ఎంత కృంగిపోతున్నాడో చూస్తుంటే కన్నీళ్లొస్తున్నాయి.. ఇలా ఆలోచిస్తూ వేగంగా నడుస్తున్న ముగ్ధ తన పక్కనే తనకు రాసుకుంటూనే ఓ పొడుగాటి కారు కీచుమంటూ బ్రేకులు పడుతుండగా ఆగేసరికి ఉలిక్కిపడి రోడ్డువారగా జరిగింది బెదిరి. ధైర్యం తెచ్చుకుని, కారులోని మనుషులవైపు పరికించి చూస్తుండగా తలుపులు తటాలున తెరచుకున్నాయి. ఆమె బలం కూడగట్టుకుని పరుగెత్తబోయింది కానీ...

★ ★ ★

ప్రకాశంకి విపరీతమయిన టెన్షన్‌గా వుంది. తల్లి పరిస్థితి విషమంగా వుంది. ఈమధ్య సంపాదించుకున్న డబ్బంతా ఆమె వైద్యానికి ఖర్చయిపోయింది. ఇంక చేతిలో డబ్బులేదు. డబ్బు కావాలి. ఇంటెన్సివ్ కేర్‌లో వున్న తల్లి కోసం డబ్బు ఖర్చుపెట్టాలి. తప్పదు. హాస్పిటల్ వాళ్లు తన మీద జాలిపడరు. పేషెంట్లమీద, వాళ్ల తాలూకు మనుషుల మీద జాలిపడితే వాళ్లు హాస్పిటల్స్‌ని ఫైవ్‌స్టార్ హోదాలో నడపలేరుకూడా. బాగా డబ్బున్న వాళ్లకోసం ఈ హాస్పిటల్స్. అయితే ప్రాణతీపి, పేగుబంధం, మమతానురాగాలు మానవులకి డబ్బుతో ముడిపడి వుండక పోవచ్చు కొందరి విషయంలో. ఎంత ఖర్చయినా అయిన వారిని బతికించుకోవాలనే తాపత్రయంతో తన బోటి అతి సామాన్యుడు కూడా అయిన వారిని ఇటువంటి హాస్పిటల్స్‌కి తీసుకొస్తాడు. కానీ తను తూగగలడా? మార్గం ఏమిటి? ఇప్పుడు డబ్బెక్కడ్నించి వస్తుంది? తన పర్సనాలిటీ, చదువూ, తెలివితేటలూ ఇటువంటి క్లిష్టసమయంలోనైనా వుపయోగపడవా?

చక్రవర్తిగారిని కలవడం ఒక్కటే మార్గ మని తోచింది ప్రకాశానికి.

మరో ఆలోచన లేకుండా నిలువునా లేచాడు.

గబగబా పెద్దపెద్ద అంగల్తో బయటకు నడిచాడు.

చక్రవర్తిగారింటిని చేరుకున్నాడు.

గేటు దగ్గర ప్రకాశాన్ని ఆపేశాడు గూర్ఖా.

చక్రవర్తిగారిని అర్జంటుగా కలవవలసిన అవసరం వుందని బతిమలాడ్తూ చెప్పాడు ప్రకాశం హిందీలో.

వీల్లేదన్నాడు గూర్ఖా.

తనని అర్థం చేసుకోమని, తన తల్లి చావు బతుకుల మధ్య వుందని, ఒక్కసారి కలవ నివ్వమని బతిమలాడాడు ప్రకాశం.

తన డ్యూటీ తనని సక్రమంగా చెయ్యనీ యమని, ఇబ్బంది పెట్టొద్దని గూర్ఖా కూడా మంచిగానే చెప్పి వెళ్లిపొమ్మన్నాడు ప్రకా శాన్ని.

తనని కలవనివ్వకపోతే తర్వాత చక్రవర్తి గారికి తెలిస్తే చాలా కోప్పడతారనీ కూడా గూర్ఖాకి చెప్పి చూశాడు ప్రకాశం.

ఏదయినా పర్మిషన్ లేనిదే పంపించను అన్నాడు గూర్ఖా.

అదుగో అప్పుడు బాల్కనీలోకి వచ్చిన దీనబంధు కళ్లల్లో పడ్డాడు ప్రకాశం. దీన బంధు అంతా గమనించాడు. ప్రకాశాన్ని వదిలిపెట్టమని గూర్ఖాని ఆజ్ఞాపించాడు అక్కడ్నుంచే.

లోపలకి వెళ్లమన్నాడు గూర్ఖా.

ప్రకాశం గబగబా నడుస్తూ లోపలకి ప్రవేశించాడు.

దీనబంధు కూడా అదే వేగంతో మెట్లు దిగి అతనికి ఎదురొచ్చాడు.

దీనబంధుని తప్పించుకుని లోపలకి పరి కించి చూస్తూ ముందుకు వెళ్లబోయాడు ప్రకాశం.

చేతులు అడ్డుపెట్టాడు దీనబంధు.

"ప్రకాశం ఎక్కడికి? " అన్నాడు కంగా రుగా.

"లోపలికి" నిశ్చయంగా పలికాడు ప్రకాశం.

ఖంగుతిన్నాడు దీనబంధు. 'తనని కలవ డానికొచ్చాడనుకున్నాడు లోపలికంటాడే విటి? '

"ఏవిటి పని? "

"మేయర్ గారిని కలవాలి" నిర్భయంగా నిబ్బరంగా పలికాడు ప్రకాశం. అదిరిప డ్డాడు దీనబంధు!

ప్రకాశం జబ్బ పట్టుకుని చుట్టూ కంగా రుగా చూసి మెట్లవైపు చూపిస్తూ "పైకి వెళ్దాంపద" అన్నాడు రహస్యంగా.

ప్రకాశం జబ్బ విడిపించుకుని మొండిగా ముందుకు వెళ్లబోయాడు.

దీనబంధు ఒడుపుగా ఇంకో జబ్బ కూడా పట్టుకుని "ప్రకాశం ప్లీజ్ నా మాట విను! నీకు మంచి జరుగుతుంది" అన్నాడు దీనంగా ముఖంపెట్టి, నమ్మకంగా ఆ చూపు లకి ఆ మాటలకి లొంగిపోయాడు ప్రకాశం.

దీనబంధుతోబాటే మెట్లెక్కి అతని రూములోకి నడిచాడు.

తలుపు గడియపెట్టొచ్చి ప్రకాశం ఎదు రుగా కూర్చుంటూ "ఏవిటి ప్రకాశం ఇది. చిలక్కి చెప్పినట్లు చెప్పానుగా, బావగారిని కలవవలసిన అవసరంలేదూ, నేను నీకు హెల్ప్ చేస్తానని, నీకంతా మంచి జరుగు తుందనీ" అన్నాడు మంచిగా.

చటుక్కున ప్రకాశం కళ్లల్లో నీళ్లు చిమ్మాయి. గొంతు బొంగురుపోయింది. "మీరు మీరు" అంటూ ఏదో అనబోయాడు గానీ మాట పెగల్లేదు. ముఖం చేతుల్లో దాచుకుని ఆపుకోలేక దుఃఖించాడు.

అతనికి మరింత దగ్గరగా జరిగి అతని వీపు నిమురుస్తూ కూర్చున్నాడు దీనబంధు.

రెండు నిముషాలుపాటు ప్రకాశాన్ని ఏడ వనిచ్చాడు. అలా అతన్ని వదిలి పెట్టడమే ఉత్తమమనిపించింది. ఆ తర్వాత నెమ్మ

దిగా అతని గడ్డం కింద చేయి వుంచి అనునయంగా చూస్తూ ముఖాన్ని పైకి ఎత్తి ధైర్యం కలిగిస్తూ కళ్లల్లోకి చూశాడు.

ప్రయత్నపూర్వకంగా గొంతు విప్పుకుని అన్నాడు ప్రకాశం, "మీరు నాకు హెల్ప్ చేయడంలేదు. తీవ్రమనస్తాపానికి గురి చేస్తున్నారు. విపరీతమయిన గాభరాకి గురి చేస్తున్నారు. చాలా భయంగా వుంది నాకు. అన్నం నోటికి ఎక్కడం లేదు. కంటికి నిద్రలేదు. చావు భయం వెంటాడుతోంది" మళ్లీ ముఖాన్ని చేతుల్లో దాచుకున్నాడు.

ప్రకాశంవైపే తదేకంగా చూస్తూ అతని జబ్బల్ని ఒక్కసారి నొక్కి వదిలి, ధైర్యం కలిగించడానికి ప్రయత్నిస్తూ "ప్రకాశం... కొద్ది రోజులు... కొద్దిరోజులంతే. ఓపికపట్టు నీ కలలు నెరవేరతాయి" అన్నాడు నమ్మకంగా దీనబంధు.

తల అడ్డంగా వూపాడు ప్రకాశం.

లేచి బయటకు వెళ్లిపోబోయాడు.

అతన్ని బలవంతంగా కూర్చోబెడుతూ, "నేను నిజం చెబుతున్నా నమ్ము" అన్నాడు దీనబంధు మళ్లీ.

ప్రకాశం నిరాశగా అన్నాడు తల అడ్డంగా వూపుతూ, "నాకు నమ్మకంలేదు. పిచ్చెక్కిపోవడం ఖాయం నాకు. అవతల మా అమ్మకు రోగం తీవ్రమై ఆవిడ చావుకి దగ్గరవుతోంది. వెంటనే నాకు ఉద్యోగం కావాలి... డబ్బు కావాలి... నేను చదివిన చదువు, నా మేధస్సు ఈ సొసైటీకి ఉపయోగపడాలి. మా నాన్నగారి కలలు నెరవేరాలి. మా అమ్మ కళ్లల్లో వెలుగు నిండాలి! అంతేకాని" రోషంగా గొంతు హెచ్చింది. ముఖం ఎర్రబడింది. గుండెలు ఆవేశంతో ఎగిసిపడుతున్నాయి. ఆందోళనతో బాధతో చెంపలూ, పెదాలు వణుకుతున్నాయి. నిరాశతో, నిస్పృహతో తలని పదేపదే విసుర్తున్నాడు.

టక్కున అతని నోటికి చెయ్యి అడ్డుపెట్టాడు దీనబంధు. చరచరా వెళ్లి కిటికీ తలుపులు కూడా మూసి వచ్చాడు. ప్రకాశానికి మరింత దగ్గర్లో కూర్చుంటూ, రహస్యంగా కసుర్తూ, "ప్రకాశం నీకేమయినా పిచ్చా అలా గొంతు హెచ్చిస్తున్నావు? నువ్వు ఎవరి ముందు వున్నావో తెల్సా? " అన్నాడు హెచ్చరిస్తున్నట్లు.

చటుక్కున తలెత్తి చూశాడు ప్రకాశం.

ఆమాత్రం హెచ్చరిక చాలనిపించింది దీనబంధుకి. ఆ హెచ్చరికలోని అర్థాన్నే వేరేవిధంగా మార్చి చెబ్తూ, "నువ్వు ఎదురుగా కూర్చున్నది ఒక సర్వసమర్థుడి ముందు. నమ్మకంగా చెబుతున్నాను భవిష్యత్తులో ఈ రాష్ట్రానికి కాబోయే ఒక ముఖ్య నాయకుడి ముందు. నీ శ్రమ, తెలివితేటలు వృధాపోవు. నీ చదువునీ, మేధస్సునీ, నీ ఇంటి పరిస్థితినీ క్షుణ్ణంగా అర్థం చేసుకున్న వాడిని నేనొక్కడ్నే. ఒక్క రెండు రోజుల్లో నీ సమస్యలన్నిటి నుంచీ నిన్ను విముక్తుడ్ని చేస్తాను"

ప్రకాశం కళ్లు మెరిశాయి. "నిజంగా? రెండు రోజుల్లోనా? నమ్మమంటారా? " అన్నాడు ఇంకా పూర్తిగా వీడని సంశయంతో.

కనురెప్పలు టపటపలాడించి నమ్మకంగా అన్నాడు దీనబంధు.

"మీ అమ్మగారు నాకూ తల్లిలాంటి వారే ఆమె మీద ఒట్టు!"

చటుక్కున ప్రకాశం కళ్లల్లో మళ్లీ నీళ్లూరాయి.

అప్రయత్నంగా దీనబంధుకి చేతులు జోడించి నమస్కరించాడు.

దీనబంధు నవ్వుతూ లేచి అలమార్లోంచి కొన్ని వంద రూపాయల నోట్లు తెచ్చి జోడించివున్న ప్రకాశం చేతుల్ని విప్పి అందులో వుంచి "ఉంచు" అన్నాడు.

పూర్తిగా లొంగిపోయాడు ప్రకాశం. నమ్రతతో తలవంచాడు.

దీనబంధులేచి నిలబడ్డాడు. దూరంగా జరిగాడు.

అతను అలా ఎందుకు జరిగాడో అర్థం కాక, ప్రకాశం అతనివైపే చూడసాగాడు.

దీనబంధు సిగరెట్టు వెలిగించాడు.

రెండు నిముషాలు మౌనంగా పచార్లు చేశాడు.

తను ఇంక వెళ్లొచ్చో, అలాగే కూర్చో వాలో, అర్థంకాక దీనబంధు ఆజ్ఞకోసం ఎదురు చూస్తున్నాడు ప్రకాశం.

పచార్లు చేస్తూన్న వాడల్లా చటుక్కున ఆగాడు దీనబంధు.

"ప్రకాశం! నమ్మినబంటయిన వాడు పారి తోషికాన్ని ఆశించడంలో తప్పులేదుగానీ అప్పగించిన పనిని సరిగా నిర్వర్తించకపో వడం తప్పుకదూ? "

ఉలిక్కిపడ్డాడు ప్రకాశం.

తటాలున దీనబంధు కళ్లల్లోకి చూశాడు.

వెంటనే తల దించుకున్నాడు.

"నేనన్నది కరెక్టా, కాదా? " రెట్టించాడు దీనబంధు.

తలదించుకున్న ప్రకాశం కళ్లముందు అరిచేతుల్లో దాగున్న క్యాష్ కనిపిస్తోంది. హాస్పిటల్లో అల్లాడుతూన్న తల్లి ప్రాణం గుర్తొస్తోంది.. "సారీసర్" అన్నాడు గుటక మింగి.

"సారీ అంటే సరా? నీ సారీ విలువ ఎంతో నీకు తెలియదు. తేలిగ్గా రెండు అక్ష రాలని పలికి వూపిరి పీల్చుకుంటున్నావు. కానీ రాత్రి నువ్వు" అంటూ తీవ్రంగా ఏదో అనబోతూండగా "డాడీ... డాడీ" అంటూ నంది తలుపులు బాదుతూంటే విసురుగా వెళ్లి తలుపులు తీశాడు దీనబంధు.

"డాడీ మా నాటకానికి పరిషత్తులో మొదటి బహుమతి వచ్చింది" అన్నాడు నంది వెలిగిపోతున్న ముఖంతో.

లాగి లెంపకాయ కొడ్దామన్నంత కోపం వచ్చిన దీనబంధు ప్రయత్నపూర్వకంగా కంట్రోల్ చేసుకున్నాడు.

నంది దృష్టి ప్రకాశం మీద పడింది.

"హాయ్ ఇతనెవరూ? ఎంత పెద్ద పెర్స నాలిటీనో? సార్ మా నాటకాల్లో వేస్తారా? " అన్నాడు నంది ప్రకాశంతో.

"వేస్తాడులే! ఒక్క రెండు రోజులాగితే అతను పూర్తిగా ఫ్రీ అయిపోతాడు. అప్పుడు తప్పకుండా వేస్తాడులే. నేను వేయిస్తాగా" అన్నాడు నమ్మకంగా దీనబంధు.

"థాంక్యూ డాడీ, థాంక్యూ సర్" అంటూ బయటకు వెళ్లిపోయాడు నంది. మళ్లీ తలు పులు బిగించాడు దీనబంధు.

ప్రకాశంవైపుకి తిరిగాడు విసురుగా "నువ్వు... నువ్వు నిన్న చేసిన పని బాగుందా? నాకెదురు పడలేదు కాబట్టి బతికిపోయావు. అంతకోపం వచ్చింది నాకు" అన్నాడు ఆవేశంగా.

"సర్ నేను మనిషిని సర్"

"కానీ మాట తప్పిన మనిషివి"

"కాదు సర్! మానవత్వమున్న మనిషిని"

"మిలట్రీవాళ్లకి మానవత్వం లేదం టావా? మరి వాళ్లెందుకు శత్రువు దొరగ్గానే నిర్దాక్షిణ్యంగా కాల్చి పారేస్తారు?

"..."

"ఓకే...ఓకే... ఒక్క రెండు రోజులు అంతే. చెప్పాగా! ఆ తర్వాత నీకు పూర్తి స్వేచ్ఛ. ఈ రోజింక ఇంటికి వెళ్లక్కర్లేదు కదా? "

"లేదు సర్ ఈ రోజు మీరు నన్ను వది లెయ్యాలి. మా అమ్మే కళ్ల ముందు మెదు లుతోంది. ఈ డబ్బు కట్టి, మంచి వైద్యం చెయ్యమని హాస్పిటల్ వాళ్లని బతిమలాడు కుంటాను. ప్లీజ్ సర్" బతిమలాడాడు ప్రకాశం.

"ఎలాగయ్యా ముఖ్యమైన రోజుల్లోనే నువ్వు డ్యూటీ చెయ్యనంటే ఏం చెప్పాలి? " విసుక్కున్నాడు దీనబంధు.

"ఈ ఒక్కరోజుకీ నన్ను ఒదిలెయ్యండి సార్ ప్లీజ్"

"అయితే నువ్వింకోరోజు డ్యూటీ చేయాల్సి వస్తుంది"

"అలాగే సర్"

"సరే జాగ్రత్తగా పోయిరా" పంపించాడు గది బయటకు, తలుపులు తీసి.

డబ్బుని లోపలిజేబులో పెట్టుకుని దీన బంధుకి నమస్కరించి మెట్లు దిగాడు ప్రకాశం.

"ప్రకాశం" పిలిచాడు దీనబంధు మళ్లీ.

వెనక్కి తిరిగి పైకి చూసి "సార్" అన్నాడు ప్రకాశం.

"ఏం లేదూ జాగర్త. చాలా జాగర్త" అని హెచ్చరించాడు ప్రకాశాన్ని దీనబంధు, మెట్లు దిగి వస్తూ.

"నాకు తెలుసు సర్ మీరు నిశ్చింతగా వుండండి."

బయటకు వెళ్లిపోయాడు ప్రకాశం.

తదుపరి కార్యక్రమం గురించి తీవ్రంగా ఆలోచిస్తూ మెట్లెక్కసాగాడు దీనబంధు.

★ ★ ★

ఇంటిముందు ఆగిన కారులోంచి దిగుతున్న కన్నబాబుని, రౌడీ సత్తుల్ని బాల్కనీ లోంచి చూస్తున్నాడు దీనబంధు.

కన్నబాబు ఒకసారి అటూ, యిటూ చూసి, కారు డిక్కీ ఎత్తి చూసుకుని, మూసేసి లాక్‌చేసి, ఇంటి కాంపౌండులో ప్రవేశిస్తూ, పైకి చూసి, దీనబంధువైపు చెయ్యి వూపాడు.

అతన్ని, ఆ వెనకే గుమ్మందగ్గరే ఆగిపోయిన సత్తుల్నీ మేడమీదికి రమ్మని చెయ్యి వూపి పిల్చాడు దీనబంధు. దీనబంధు వెనకే వచ్చి నిల్చున్న ఇంద్రాణి, "తమ్ముడూ వీళ్లిద్దరూ ఇంత రాత్రిదాకా ఎక్కడ తిరిగొస్తున్నారురా? " అంది.

కంగారుపడ్డాడు దీనబంధు. ఈ సమయంలో అక్కగారు వస్తుందని అతను ఏమాత్రం వూహించలేదు. కాని కంగారుని కప్పిపుచ్చుకున్నాడు. "గస్తీ అక్కా- కాలేజీ కుర్రాళ్లందరూ గస్తీలు తిరుగుతున్నారు కదా వీళ్లూ తిరిగి వస్తున్నారు"

"ఇంకా గస్తీలెందుకురా. అది ఆంజనేయ స్వామి ఆగ్రహం అని తేలిపోయిందిగా. ఈ వుదయంనుంచి పూజలు అవీ మొదలుపెట్టారు కాబట్టి ఇక ఈ రాత్రినుంచీ ఏ భయం అఖ్ఖర్లేదు ఎవ్వరికీ. అందులో అందరిళ్లకీ ఆంజనేయస్వామి స్టిక్కర్లు అంటించారు కూడా కదా"

"నాకయితే నమ్మకం లేదక్కా. ఇది ఆంజనేయస్వామి ఆగ్రహం కాదు ఏంకాదు. ఖచ్చితంగా యిది భయంకరకోతి పనే. ఖచ్చితంగా చెప్పగలను"

"అయితే భయంకర కోతి వుందనే అంటావా? " అని అనుమానంతోనూ, భయంతోనూ ప్రశ్నిస్తుండగా కన్నబాబు, సత్తులు పైకొచ్చారు.

కన్నబాబు బాగా బెదిరిపోయివున్నాడు. మనిషి బాగా కంగారుపడ్తున్నాడు. తల్లివైపే చూడడానికి భయపడ్తున్నాడు.

సత్తులు బాగా రెక్‌లెస్‌గా వున్నాడు. ఆనందంగా కూడా వున్నాడు.

"ఏరా కన్నా, మళ్ళీ గస్తీతిరగడానికి వెళ్లావా? నీకెందుకురా నాన్నా, ఈ గస్తీలు కుస్తీలు? పనివాళ్లున్నారు, పోలీసులున్నారు. అయినా యిది పెద్దవాళ్లు ఆలోచించవలసిన విషయం. చక్కగా భోజనంచేసి, ఏసీ రూంలో టీవీ చూసుకుంటూ కూర్చోక ఈ తిరుగుళ్లెందుకురా నాన్నా? " అంది ఇంద్రాణి కొడుకుకి దగ్గరవుతూ.

"ఆc ఆc... ఆగు, దగ్గరకు రాకు" అన్నాడు కన్నబాబు కంగారుగా.

బెదిరిపోయింది ఆవిడ. "ఏం? ఏంరా నాన్నా? " అంది.

"ఆ... ఏంలేదమ్మా. ఇందాక ఒక ముసలి తాత లారీకింద పడ్డాడు. మేము అతన్ని మా చేతులమీద తీసుకెళ్ళి డాక్టరుగారికి చూపించాంగానీ, అప్పటికే ఆ తాత మా చేతుల్లోనే ప్రాణం విడిచాడు అన్నాడు డాక్టరు. అందుకని... స్నానం చేయాలిగా. అందుకని ముట్టుకోవద్దన్నాను"

మతిపోయినట్లయి చూస్తున్న దీనబంధు. 'హమ్మ వెధవా క్షణాల్లో అబద్ధాలు

అల్లేయగలుగుతున్నావంటే మంచి రాజకీయనాయకుడివే అయిపోతావు త్వరలో నిన్ను మరీ ఎదగనిస్తే, నాకే ఎసరుపెడ్తావురా ముద్దుల మేనల్లుడా' అనుకున్నాడు లోలోనే.

"అలాగురా నాన్నా, అయితే వేణ్ణీళ్లు పెట్టిస్తానూ స్నానం చెయ్యి. పోన్లే, బాధపడకు. పాపం, నీ తప్పు లేకుండా ఆ తాతని కాపాడుదాం అనుకున్నావు. వాడికి ఆయుష్షు లేకపోతే నువ్వేం చెయ్యగలవు. మనస్సు పాడుచేసుకోకు నాన్నా" అంది.

"అక్కా వాడి విషయం నేను చూస్తానూ. నువ్వెళ్లి వేణ్ణీళ్లు పెట్టమని పురమాయించు" అన్నాడు దీనబంధు తొందరపెడ్తూ.

ఇంద్రాణి "అలాగే" అంటూ కిందకి వెళ్ళిపోయింది.

"నాన్నగారు ఇంటి దగ్గరే వున్నారా? " అన్నాడు కన్నబాబు భయంగా, కంగారుగా, గొంతు తగ్గించి.



"లేడు. ఆంజనేయస్వామి దేవాలయం ఉద్ధారణ కమిటీవాళ్ల మీటింగులో వున్నాడు. ఇంతకీ మీరేం వుద్ధరించి వచ్చారు? " అన్నాడు దీనబంధు, ఇద్దరి కళ్లల్లోకి సూటిగా చూస్తూ రహస్యంగా.

"సక్సెస్ మామయ్యా. అంతా సక్సెస్‌ఫుల్‌గా జరిగిపోయింది" అన్నాడు కన్నబాబు ధైర్యంగా.

"వెరీగుడ్ ఎక్కువ గలాభా చేశారా? "

"చ...చ్చ లేదండి. ఈ సత్తులుండగా ఏ పనయినా గుట్టుగా జరిగిపోద్ది" అంటూ సత్తులు ఓరగా నవ్వాడు.

"ఊఁ... ఆయుధం...? "

"కారులో వుంది మామయ్యా"

"ఊ కన్నబాబూ నువ్వెళ్లి కారుని ఇంటి ముందు నుంచి తీసేసి, మలుపులో చీకట్లో నిలుపు. ఇప్పుడే వస్తున్నా. సత్తులూ నువ్వుండు" అన్నాడు దీనబంధు ఆజ్ఞాపిస్తున్నట్లు.

కన్నబాబు తలూపి, కిందకు పరుగెత్తాడు.

సత్తులుతో, "సత్తులూ... కేసెట్? " అన్నాడు దీనబంధు.

వెధవ నవ్వులు చిందించాడు సత్తులు. "కేసెట్ పొద్దున్నే మీ సేతికొస్తుంది. మొత్తానికి బంగారు పిచ్చుకనే గుప్పిట్లో పెట్టుకున్నావే? " అంటూ మళ్ళీ నవ్వి, "ఎప్పటికయినా నువ్వు ఈ రాష్ట్రానికి ముఖ్యమంత్రివైపోవడం గ్యారంటీ" అన్నాడు.

"చాల్చాల్లేరా పొగడ్తలూ" అంటూనే వుబ్బిపోయి "పద కిందకెళ్లి ఆయుధ పూజ చేద్దాం" అన్నాడు దీనబంధు.

ఇద్దరూ క్రిందకు దిగి, మలుపులో చీకట్లో వున్న కారు దగ్గరకు నడిచారు. డిక్కీ తెరిచాడు కన్నబాబు. డ్రస్సునీ, హ్యాండ్‌గ్లోవ్స్‌నీ తీసి చూపించాడు.

విజయగర్వంతో దీనబంధు పైపెదవి ఓరగా పైకి లేచింది.

అప్రయత్నంగానే రెండు చేతులూ జోడించి ఆ డ్రస్సుకీ, హ్యాండ్ గ్లోవ్స్‌కీ నమస్కరించాడు.

కన్నబాబు తెల్లబోయి చూస్తుంటే, సత్తులు వూగుతూ నవ్వాడు.

ఆంజనేయస్వామి ఆలయ వుద్ధారణ సంఘం మీటింగులో పాల్గొని, ఆలయ

వుద్ధారణ, విగ్రహ ప్రతిష్ట, ఏటేటా వారంరోజులు ఉత్సవాలు జరపడానికి నిర్ధారించి, ఆంజనేయస్వామికి మనసా నమస్కరించి, ఇంటికొచ్చిన చక్రవర్తి గతరాత్రి తృప్తిగా నిద్రపోయాడు.

ఇంక ఈ రాత్రినుంచీ ఎటువంటి దారుణాలూ జరగవని కొండంత మనశ్శాంతితో హాయిగా నిద్రపోయాడు.

కానీ

నిద్ర లేస్తూనే విన్న పిడుగులాంటి వార్తకి ప్రమాన్పడిపోయాడు.

శిలాప్రతిమ అయిపోయాడు.

భర్తని చూస్తుంటే ముచ్చెమటలు పోస్తున్నాయి ఇంద్రాణికి. రాత్రి జరిగింది ఘోరాతి ఘోరమయినా, ఆ వార్త విని తామందరూ పడే బాధ వేరు, చక్రవర్తి అనుభవించే బాధ వేరు. ఎంతో సున్నితమయిన మనసున్న ఆయన ఇంతటి దారుణమయిన వార్తని భరించలేడు. ఆ వార్త ఆయన చెవిన పడకుండా ఏ శక్తి అయినా ఆపగలిగితే ఎంత బాగుండును! ఇప్పుడా మనిషిని మామూలు మనిషిని చెయ్యడం ఎలా? రాత్రి ఆయన నిశ్చింతగా నిద్రపోయినందుకు ఎంతో సంతోషించింది తను. గత అయిదారు రోజులుగా ఆయన కంటికి నిద్రేలేదు. ఇప్పుడీ వార్తతో ఇక జన్మలో నిద్రేపోడేమో, అసలు మామూలు మనిషి కాలేడేమో. వణికిపోయింది ఇంద్రాణి.

మంచంమీద చేతిలో న్యూసుపేపరుతో శిలాప్రతిమలా కూర్చుని వున్నాడు చక్రవర్తి.

ఆయన నిద్రలేచేసరికి మంచంమీద వుండాలి న్యూసుపేపర్లు. అది రూలు.

నిద్రలేస్తూనే ముఖ్యమైన హెడ్డింగులు, మరీ ముఖ్యమైన వార్తలు చదవడం ఆయన అలవాటు. అసలు ఈరోజు పేపర్లోని వార్త చదివి తనే నిలబడలేక దుఃఖానికి లొంగిపోయి చతికిలబడిపోయింది. అలాంటిది, ఆయన నిలదొక్కుకోగలరా? అందుకనే పేపర్లు ఆయన కంట పడకుండా దాచేద్దామనుకుంది మొదట. అంతలోనే, 'నా పిచ్చిగానీ- ఆయన కళ్లు తెరుస్తూనే ఒక్క క్షణంలో ఆయన ముందు వాల్తాయి పేపర్లు. గాలిలో లీనమై ప్రపంచమంతా చుట్టే వార్తల్ని ఆయన చెవినబడకుండా ఆపడం నా తరమా?' అని భావించి, భయంభయంగానే ఆయన మంచం దగ్గరుంచింది తను. నిద్రలేచి మెయిన్ హెడ్డింగు, నాలుగు లైన్లు న్యూసు చదువుతూనే తలమీద బలమైన ఆయుధంతో మోదినట్లు చలనంలేకుండా అలా నిలువుగుడ్లతో శిలాప్రతిమలా కూర్చుండిపోయాడు ఆయన.

బెదిరిపోయింది ఇంద్రాణి.

గుండెలదిరిపోతున్నాయి.

ఇంతలో తమ్ముడు దీనబంధు లోపలికొస్తూ కనిపించాడు. ఆమెకి ఎంతో ధైర్యం వచ్చింది. "తమ్ముడూ" అంటూ అతని దగ్గరకు పరుగెత్తి బావురుమంది. అక్కగార్ని దగ్గరకు తీసుకుని, "ఊరుకో అక్కా ఊరుకో" అంటూ ఓదార్చాడు దీనబంధు.

"మీ బావగారీ వార్తని జీర్ణించుకోలేకపోతున్నార్రా, నువ్వే ఏదో దారి చూడరా" అంది ఏడుస్తూ.

గబగబా బావగారి మంచం దగ్గరకి నడిచి, ఆయనకి దగ్గర్లో కూర్చుని, కళ్లు తుడుచుకుంటూ, గొంతు పూడుకుపోతూంటే పెగల్చుకుని, ఆయన చేతిమీద చేయివేసి, "బావగారూ- బావగారూ" అన్నాడు దీనబంధు.

ఒక్కసారిగా నిద్రలోంచి మేల్కొన్నట్లు చలనం కలిగింది చక్రవర్తిలో.

మనిషి నిలువెల్లా కంపించిపోయాడు.

ఎవరో కుదుపుతున్నట్లు కదిలిపోతూ, వెల్లువలా లోనుండి పైకి పొంగి వచ్చిన దుఃఖానికి చిన్నపిల్లాడిలా లొంగిపోయాడు. ఎటువంటి బిడియం, సంశయం లేకుండా వలవల ఏడ్చాడు.

అతనలా ఏడుస్తుంటే బాధ అనిపిం

చినప్పటికీ, అతను షాక్‌నుంచి తేరుకుని మామూలు మనిషిలా ప్రవర్తిస్తున్నందుకు సంతోషించింది ఇంద్రాణి. ఆయన ముందున్న పేపర్లని తీసెయ్యబోయింది.

వారిస్తూ, మళ్ళీ చదవడానికి ప్రయత్నిం చాడు చక్రవర్తి. కన్నీళ్ల పొరలగుండా చద వడం కష్టసాధ్యమయ్యింది. నేప్‌కిన్‌తో కన్నీళ్లు తుడుచుకుని చదివాడు.

'మళ్ళీ విజృంభించిన రాక్షసకోతి'

'రాక్షసకోతి చేతుల్లో అబల దారుణమ రణం'

మరోసారి దుఃఖం వుబికి వచ్చింది.

దీనబంధు కూడా కన్నీళ్లు తుడుచుకుని బావగారిని ఓదార్చాడు.

నెమ్మదిగా తేరుకున్న చక్రవర్తి, "దీన బంధూ మనం వెంటనే కేశవరావుగారింటికి వెళ్లాలి" అన్నాడు దృఢనిశ్చయంగా.

"ఎందుకు బావగారూ. ఆయన్నే మనిం టికి తీసుకొస్తాను"

ఇంద్రాణి తమ్ముణ్ని సపోర్ట్ చేస్తూ అంది, "ఆ పని చెయ్యరా తమ్ముడూ. ఇప్పుడు ఈ బాధలో బావగారు ఎందుకూ బయటకు కదలడం"

"కాదు!" అరిచాడు చక్రవర్తి. "మనమే ఆయన ఇంటికి వెళ్లాలి. అంతే!"

ఎవ్వరూ నోరెత్తలేదు.

అయిదు నిమిషాల్లో ముఖం కడుక్కుని, సిద్ధమయ్యాడు చక్రవర్తి.

దీనబంధు బావగారితోసహా కారులో కేశ వరావుగారింటికి చేరాడు. అతని మస్తిష్కం చురుగ్గా పనిచేస్తోంది. తనమీద తనకే విప రీతమయిన నమ్మకం పెరిగిపోతోంది. ఏవో సుందరలోకాలు కళ్లముందు దృశ్యాలు దృశ్యాలుగా కదిలిపోతున్నాయి.

కేశవరావుగారింటి ముందుదాకా పోని య్యకుండా కొంచెం దూరంలోనే ఆపుచే యించాడు చక్రవర్తి కారుని.

ప్రయత్నంమీద కారులోంచి దిగి, కాళ్ళీ డ్చుకుంటూ ఇంటివైపు నడవసాగాడు.

తలవంచుకుని, మౌనంగా అనుసరిం చాడు దీనబంధు.

ఇంటివద్ద చాలామంది జనం గుమిగూడి వున్నారు.

మొదటి గదిలో చాపమీద వుంది ముగ్ధ ప్రాణంలేని శరీరం.

బంధువులలోని స్త్రీలు చుట్టూ కూర్చుని వున్నారు. అంతటా భయంకర నిశ్శబ్దం. మధ్యమధ్య ఒకరిద్దరు దుఃఖం ఆపుకోలేక వెక్కుతున్నారు.

బంధువులలోని మగవాళ్లు చక్రవర్తిని చూస్తూనే పరుగెత్తుకొచ్చి, లోపలకి దారి చూపించారు.

నెమ్మదిగా మెట్లెక్కి లోపలకి అడుగు పెట్ట బోయి, గుండెల్లో బల్లెంతో పొడిచినట్లయి, అడుగు తడబడి, చటుక్కున వెనుతిరిగి మెట్లు దిగిపోయాడు చక్రవర్తి "నేను చూడ లేనయ్యా" అంటూ.

"కేశవరావుగారెక్కడా? " అన్నాడు దీన బంధు బంధువులతో.

ఇంటిపక్కనుంచి దారి చూపిస్తూ, వెనకవైపు గదిలోకి తీసుకెళ్లారు వాళ్లు చక్ర వర్తిని, దీనబంధుని.

చక్రవర్తిని చూస్తూనే పరుగెత్తుకొచ్చి బాబుగారూ అంటూ, బావురుమంటూ, చేతులు జోడించి కాళ్లమీద వాలిపోయారు కేశవరావుగారు.

ఆయన్ని మధ్యలోనే అందుకుని గుండె లకి హత్తుకున్నాడు చక్రవర్తి. తను పడుతు న్నంత క్షోభ చక్రవర్తీ పడుతుంటాడని ఎరిగి వున్న కేశవరావుగారు తననితాను కంట్రోల్ చేసుకుంటూ, మంచం చూపిస్తూ, "కూర్చోండి బాబుగారూ, కూర్చోండి నాయినా" అన్నారు ఇద్దరితో.

కేశవరావుగారిని కూడా పక్కనే కూర్చోబె ట్టుకున్నాడు చక్రవర్తి.

దీనబంధు చేతులు కట్టుకుని నిలబడే ఉన్నాడు.

"చాలా ఘోరం జరిగిపోయింది కేశవరా

వుగారూ!... ' చాలా ఘోరం జరిగిపోయింది. అసలెలా జరిగిందిది? అమ్మాయి ఆ రాక్షసకోతి బారినెలా పడిందండీ? ..." అని అడిగాడు చక్రవర్తి కళ్లు తుడుచుకుంటూ.

"ఏంచెప్పను బాబుగారూ! ప్రారబ్ధం అంతే. ఏ జన్మలోనో ఏ పుణ్యాత్ముడికో ఘోర అపకారం చేసి ఉంటాను. అందుకే భగవంతుడు ఈ జన్మలో నాకీ గర్భశోకాన్నిచ్చాడు. లేకపోతే... లేకపోతే... ఓ అమాయకురాలి జీవితాన్ని ఇలా మొగ్గలోనే తుంచేస్తాడా? ముసలిపీనుగని నన్ను తీసుకుపోవచ్చుగదా!" దుఃఖం ఆగలేదు ఆయనకి.

"కేశవరావుగారూ! ప్లీజ్, కంట్రోల్ చేసుకోండి" అని బతిమిలాడాడు దీనబంధు.

"ఏం మిగిలిందయ్యా నాకు ఇంక జీవితంలో ఆనందం. బంగారుబొమ్మని ఇస్తూనే దాని తల్లిని తీసుకుపోయాడు. నా బంగారుతల్లిలోనే సర్వస్వాన్ని చూసుకుంటూ బాధని మరిచిపోయి బతుకుతూంటే ఇప్పుడిలా..." గొంతే పెగల్లేదు.

"నిజంగా చాలా అన్యాయమే చేశాడు భగవంతుడు. భగవంతుడు ఇంత కఠినంగా ప్రవర్తిస్తాడని నేను కలలో కూడా ఊహించలేదు. అదేం విచిత్రమో... మంచివాళ్లకే కష్టాలు తెస్తాడాయన. దొంగలు, దోపిడిదారులు, అత్యాచారాలు చేసేవాళ్లు, హంతకులూ ఆనందంగానే బతికేస్తుంటారు. న్యాయం, ధర్మం, నమ్ముకుని నలుగురికీ మంచిని పంచే మీవంటివారికే ఈ కష్టాలు. అసలు ఎలా జరిగింది కేశవులుగారూ? ఆ సమయంలో అమ్మాయి ఒంటరిగా ఉందా? రోడ్డుమీద అంతా నిర్మానుష్యంగా ఉందా? " ముగ్ధకి ఇంత ఘోరం జరిగిందంటే ఇంకా నమ్మలేక బాధపడ్తూ అడిగాడు చక్రవర్తి.

"రాత్రి ఎనిమిది గంటలవేళ బాబుగారూ! నేనింటికి వచ్చేసరికే నా కోసం వంటకూడా చేసేసి, గుమ్మం దగ్గర ఎదురు చూస్తోంది. నాకు భోజనం పెట్టి, 'ఓ ఫ్రెండింటికి వెళ్లి పుస్తకం తెచ్చుకుంటా నాన్నగారూ ఇప్పుడే వచ్చేస్తా' అంటూ వెళ్లింది. పాపిష్టి వెధవని నేనూ తోడు వెళ్ళొచ్చుగా వెళ్లలేదు. నా బంగారుతల్లి నొక్కర్తినీ పంపించాను" అంటూ మళ్ళీ ఏడ్చి, గుక్కతిప్పుకుని, 'ఇప్పుడే వచ్చేస్తానని వెళ్ళిన నా చిట్టి తల్లి తొమ్మిది, పది ఎంతయినా రాకపోయేసరికి నాకు గాభరా ఎక్కువై వీధిన పడ్డాను. ఆ స్నేహితురాలి యిల్లు ఎక్కడో తెలియదు. వీధివీధి, సందూ, గొందూ అంతా వెతికాను. వీధుల్లో జనసంచారంలేదు. ఓచోట జనం కర్రలతో, బరిసెలుతో గుంపులుగా నిలబడి వుంటే గాభరాగా అటు పరుగెత్తాను. వయసులో వున్న ఓ అమ్మాయిని దుండగులెవరో కారులో బలవంతంగా లాక్కుపోయారని అక్కడివాళ్లు చెప్పారు. నా ప్రాణాలు పైనే పోయాయి"

గబుక్కున కలుగచేసుకుంటూ అన్నాడు దీనబంధు, "ఆ అమ్మాయి కేసు వేరే కేశవరావుగారూ. ఆ కారుని లొకేట్ చేసి, ఆ అమ్మాయిని రక్షించినట్లు ఓల్డ్‌సిటీనుంచి రాత్రే ఇన్‌ఫర్మేషన్ వచ్చింది. మన అమ్మాయి చావుకి కారణం ఆ రాక్షసకోతేట. పోలీసులు చెప్పారు"

"ఏదయితేనేం నాయినా... నా బిడ్డ నా నుంచి దూరమైపోయింది. ఇంక జన్మలో నాతో మాట్లాడదు. మరో కొద్దిగంటల్లో ఆ శరీరం కూడా మళ్ళీ కనిపించకుండా మాయమైపోతుంది" వెక్కివెక్కి ఏడ్చారు.

దీనబంధు తన శాయశక్తులా ఓదార్చాడు ఆయన్ని. తన దుఃఖాన్ని కంట్రోల్ చేసుకోలేకపోతున్న చక్రవర్తి అలా కన్నీళ్లతో చూస్తూ వుండిపోయాడు.

కేశవరావుగారు తేరుకుని "పదండి బాబుగారూ కడసారి చూపులకి" అన్నారు గద్గదికంతో అమ్మాయి శవం వున్న గదివైపు చూపిస్తూ.

"లేదు కేశవయ్యగారూ, నేను చూడలేను!

నా కళ్లముందు యింకా లేడిపిల్లలా గెంతుతున్న ముగ్ధ ఆకారమే మెదులుతోంది. దాన్ని నేను తుడిచెయ్యలేను. నన్ను క్షమించండి" అంటూ బయటకు నడిచి వెనకే వచ్చిన దీనబంధుతో, "నువ్వు నన్ను దింపి ఇక్కడికిరా. కేశవరావుగారికి అవసరమయిన ఏర్పాట్లన్నీ చూడు. కార్యక్రమం అంతా అయిపోయాక బలవంతంగానయినా సరే, ఆయన్ని మనింటికి తీసుకురా. కొన్నాళ్లు మనింట్లో వుంటే నెమ్మదినెమ్మదిగా మామూలు మనిషి అవుతారు" అన్నాడు.

"అలాగే బావగారూ" అన్నాడు దీనబంధు కళ్లు తుడుచుకుంటూ.

కారు ముందుకు సాగుతోంది.

వెనకసీట్లో వాలిపోయినట్లు కూర్చున్న చక్రవర్తికి కేశవరావుగారితో వున్న గాఢ అనుబంధం గుర్తొస్తోంది! ఎంతటి గొప్ప మనిషి ఆయన! ఎంతటి గొప్ప నమ్మిన బంటు! ఎంతటి గొప్ప ఆత్మబంధువు!

ఆరోజు మేయర్ పదవికి తను నామినేషన్ దాఖలు చేసినరోజు.

తను నామినేషన్ వెయ్యనుగాక వెయ్యను అని మొరాయిస్తే దీనబంధు, ఇతర పార్టీసభ్యులు, చివరికి అధిష్టానవర్గం ప్రతినిధులు బలవంతంచేసి తనకి నామినేషన్ వెయ్యక తప్పనిసరి చేసినరోజు. మనసు దిట్టం చేసుకోవడానికి కేశవరావుగారిమీద తను నిర్ణయాన్ని వదిలిపెడ్తే భగవద్గీతలో అర్జునుడితో కృష్ణుడు అన్న 'కర్మణ్యే వాధికారస్య...' అన్న శ్లోకం దాని అర్థం మరోసారి గుర్తుచేసి, "అందరికీ అభిమాన నాయకుడిగా మీ కర్తవ్యం మీరు నెరవేర్చండయ్యా, ఫలితం భగవంతుడు చూసుకుంటాడు" అని ప్రోత్సహించి పంపినరోజు.

నామినేషన్ దాఖలుచేసి, ఇంటికి వచ్చిన పది నిముషాలకు ప్రత్యర్థి చింతలనాయుడి ముఖ్య అనుచరులు నలుగురు వచ్చారు. నొసట బొట్లు, చెవుల్లో పూలతో అప్పుడే గుడి నుంచి పూజచేసి వస్తున్నట్లున్నారు. చక్రవర్తికి చిరునవ్వుతో భక్తిగా నమస్కరించారు.

ప్రతి నమస్కారం చేసి ఆఫీసురూములోకి ఆహ్వానించాడు చక్రవర్తి.

"సర్ మీరు తన ప్రత్యర్థిగా పోటీ చేస్తున్నందుకు చింతలనాయుడుగారు చాలా సంతోషిస్తున్నారు. నీతినియమాలున్న ఓ ఉత్తముడు నాకు పోటీగా నిలబడుతున్నందుకు నాకు చాలా ఆనందంగా వుంది అంటున్నారు. ఈ పోటీలో గెలిచినా ఓడినా నాకు విజయమే. ఎవరు గెలిచినా నగరానికి మంచి జరుగుతుంది అంటున్నారు. అందుకనే ఈ ఆనందాన్ని కలిగించిన భగవంతుడికి కృతజ్ఞతలు చెబ్తూ, వెంకటేశ్వరస్వామి గుళ్లో పూజలు చేయించారు. ఇదుగో, ప్రసాదం పంపించారు తీసుకోండి. అసలు వారే స్వయంగా వద్దామనుకున్నారుగానీ తీరా బయలుదేరబోతుండగా, వారి భార్యకు కొద్దిగా గుండెల్లో పోటు వచ్చింది. అందుకని మేం యిస్తాం చక్రవర్తిగారికి, మీరు, మేడమ్‌ని అటెండ్ అవ్వండీ అని చెప్పి, మేము తెచ్చాం. అయ్యా మరి మాకు శెలవు! ఆల్ ద బెస్ట్ సర్. మన నగరం వర్ధిల్లాలి, వర్ధిల్లుతుంది!" అని వెళ్లిపోయారు.

చక్రవర్తికి చాలా ముచ్చటవేసింది. పోటీ అంటే అలా వుండాలి. ఎవరు గెలిస్తే ఏమిటి, ప్రజలకు మంచి జరగాలిగాని. తన కంటే ముందు ప్రత్యర్థికి యింత మంచి ఆలోచన వచ్చినందుకు మనసారా అభినందించాడు చింతలనాయుడ్ని లోలోనే. చేతిలోని ప్రసాదాన్ని కళ్లకద్దుకుని, "స్వామీ విజయంకోసం వెంపర్లాడే మనస్తత్వంలేని ఇద్దరు వ్యక్తులం పోటీపడుతున్నాం. నీ నిర్ణయం ఏదయినా శిరోధార్యమే మాకు! ఎవరు గెలిచినా మరొకరం శక్తివంచన లేకుండా, మంచి పాలనకి, నగర అభివృద్ధికి తోడ్పడతాం. మమ్మల్ని ఆశీర్వదించు" అని మొక్కుకుని, ప్రసాదాన్ని నోట్లో వేసుకోబోయారు.

చటుక్కున ఆయన చేతిని ఆపుచేశారు

కేశవరావుగారు.

ఆయనంత చనువు తీసుకుని తన చేతిని అందుకుని, ప్రసాదం తినకుండా ఆపడం తటాలున కోపాన్ని తెప్పించగా, సూటిగా విసురుగా చూశాడు ఆయన కళ్లల్లోకి.

"క్షమించండయ్యా" అంటూ ప్రసాదం లోంచి కొంత చొరవగా తీసుకుని నోట్లో వేసుకుని తినేశాడాయన.

కోపం అధికం అయ్యింది చక్రవర్తిలో.

'ఏమిటిది ఎందుకింత అమర్యాదగా ప్రవర్తిస్తున్నాడీయన? ఎవరిచ్చారు ఈ చనువు, అధికారం. ఇచ్చినా దానికీ హద్దులుండవా?' అనుకుంటూ, 'మీ ప్రవర్తన హద్దుమీరి వుంది కేశవరావుగారూ' అని చెప్పడానికి ఆయన ముఖంలోకి తీవ్రంగా చూసి... కంగారుపడిపోయాడు చక్రవర్తి.

ఆయన ముఖం పాలిపోతోంది. రంగు మారిపోతోంది. కళ్లు బరువుగా మూతలు పడుతున్నాయి. క్షణాల్లో చెమటలు పోట మరించాయి. మనిషి నిలువెల్లా ఒణికి పోతూ నిలబడలేక కూలిపోయాడు. నోట్లోంచి నురగలు వస్తున్నాయి.

నిలువెల్లా కంపించిపోయాడు చక్రవర్తి.

నౌకర్లకోసం గట్టిగా కేకలు పెట్టి, కారులో హాస్పిటల్ కి ఆయన్ని ఆఘమేఘాలమీద తీసుకెళ్ళి వైద్యం చేయించాడు. ఆయన కోలుకునేవరకు అన్నం ముట్టలేదు. ఆయన పూర్తిగా కోలుకున్నాక, ఇంటికి తీసుకొచ్చి, ఆయన కాళ్లకు నమస్కరించి, కౌగలించుకుని, కొత్తబట్టలు పెట్టి ఆనందంతో కళ్లనీళ్లు నింపుకున్నాడు. సమయస్ఫూర్తితో ఆయన తన ప్రాణం కాపాడినందుకు జన్మంతా రుణపడివుంటానని చెప్పాడు. కానీ ప్రాణ త్యాగానికి సిద్ధపడడం దుస్సాహసమని తన కోసం అంతటిత్యాగం చెయ్యడానికి ఆయన తొందరపడి వుండకూడదని చెప్పాడు.

వినయంగా తల దించుకున్నాడేగాని కేశవరావుగారు తన త్యాగాన్ని స్వంతానికి వుపయోగించుకోవడానికి ఏనాడూ ప్రయత్నించలేదు. ఆయనగాని, ఆయన కూతురు గాని ఎప్పుడూ నిస్వార్థంగానే ప్రవర్తిస్తూ, తనకి ఆనందాన్ని కలిగిస్తూ, తన జీవితానికి ఓ పరమార్థాన్ని కలిగిస్తూ, తన ప్రాణంలో ప్రాణంగా మసల్తూ వస్తున్నారు.. అటువంటి ఉత్తములకి. ఈరోజు... ఇంత భయంకరమైన శిక్షా?

కారు ఇంటికి చేరింది.

డోర్ తెరచి బావగారిని ఇంటిలోపలికి నడిపించుకువెళ్లాడు దీనబంధు. అతని మెదడుకి జరుగుతున్న దానిమీదకాక, జరగబోయే దానిమీదే ఎక్కువగా ఆలోచించడం అలవాటు. అది చురుగ్గా పనిచేస్తూనే వుంది.

★ ★ ★

ముగ్ధ మరణవార్త వింటూనే మ్రాన్పడిపోయాడు నంది.

నిలువునా కుప్పకూలిపోయాడు. స్పృహ తప్పిపోయాడు.

రాత్రంతా నాటకం రిహార్సల్సు వేసి, రిహార్సల్సు రూములోనే పడుకున్నాడు. పొద్దున్న బాగా ఆలస్యంగా నిద్రలేచాడు. రాత్రి రిహార్సల్సు సంతృప్తిగా వచ్చినందుకు చాలా ఆనందంగా వుండి, ప్రశాంతంగా గాఢంగా నిద్రపోయాడు. రెండు మూడు సార్లు మెలుకువ వచ్చి, లేద్దామా అనుకున్నాడుగాని, లేచి చేసేదేముందిలే అని అలా పడుకునే వున్నాడు.

ఇంతలో.

"గురూ ఘోరం జరిగిపోయింది" అంటూ గుండెలు బాదుకుంటూ పరుగెత్తుకొచ్చాడు సూరబ్బాయి.

నంది, నందితోబాటే మిగిలిన నటులూ అదిరిపడి లేచి కూర్చున్నారు కళ్లు నులుముకుంటూ.

మళ్లీ "ఘోరం జరిగిపోయింది గురూ" అంటూ కింద కూలబడి ఏడవసాగాడు సూరబ్బాయి. అంతా గభాలున లేచి అతని చుట్టూ చేరారు. అందరిలోనూ ఆతృత,

ఉత్కంఠ, భయం... "ఎలా చెప్పను గురూ! ఇంత ఘోరవార్త? " అంటూ కన్నీరు మున్నీరుగా ఏడుస్తున్నాడు వాడు.

మిగిలిన వాళ్లని పక్కకు తప్పించి నంది నెమ్మదిగా సూరబ్బాయి పక్కకు వచ్చి కూర్చుని సానునయంగా అడిగాడు. "సూరబ్బాయి! ఏం జరిగిందిరా చెప్పరా" అని.

నంది ముఖంలోకి చూస్తూనే వాడు మరీ బాధకు గురయిపోయి "నందీ" అంటూ బావురుమన్నాడు.

"చెప్పరా" అన్నాడు నంది గుండెలు అదురుతుండగా.

"గురూ దారుణం గురూ... ఇంతటి దుర్వార్తని నీతో నేను చెప్పలేను గురూ" అంటూ వాడు హిస్టీరిక్‌గా అరిచి లేచి బయటకు పరుగెత్తబోయాడు. '

అందరూ పరుగెత్తి, వాడ్ని అందుకుని "చెప్పరా ఫరవాలేదు" అంటూ ధైర్యం చెప్పారు.



వాడు గుక్క తిప్పుకుని ఇంకా ఆగని వెక్కిళ్లతో "ముగ్ధ... మన ముగ్ధరా... చచ్చిపోయింది" అంటూ మళ్లీ భోరుమన్నాడు.

ఒక్కసారిగా అందరూ ఆపుకోలేక ఘొల్లుమన్నారు.

బ్రమాన్పడిపోయాడు నంది. నిలువునా కుప్పకూలిపోయాడు... స్పృహ తప్పిపోయాడు.

నందిని చూసి అందరూ భయపడిపోయారు. సేవలు చేసి స్పృహ తెప్పించారు. దుఃఖం లోనుంచి లావాలా తన్నుకొస్తుండగా క్రమేపీ దుఃఖానికి లొంగిపోయి పిచ్చిగా ఏడ్చాడు నంది.

అందరూ కేశవరావుగారింటి వైపు పరుగెత్తారు.

చెరగని నవ్వు ముఖంలో ఘనీభవించిన కోపం, భయం, ఆందోళన, అసహ్యం కలిగిన భావాలతో, ముఖంనిండా రక్కులతో, రేగిపోయిన జుట్టుతో, చిరిగిపోయిన బట్టలతో నిర్జీవంగా... చలనం లేకుండా చూడలేక గుండెలు బాదుకున్నారు నట బృందం.

కాళ్లు తడబడుతూండగా, తప్పటడుగులతో ఆమె శవంవైపు నడిచి కాళ్లలో పట్టుసడలి, క్రింద కూలబడి, ఆమె ముఖంలోకే కన్నీటి పొరల వెనగ్గా చూస్తుండిపోయాడు నంది.

**బా**వగారిని ఇంటిలో దిగబెట్టిన దీనబంధు సెల్ ఫోనులో ఎవరెవరికో ఫోన్లు చేసి అడ్రస్సు చెప్పి కేశవరావుగారింటికి చేరాడు కారులో.

కారు దిగి, దిగులు నిండిన ముఖంతో నెమ్మదిగా అడుగులో అడుగు వేసుకుంటూ మెట్లెక్కి ముగ్ధ ముఖంవైపు చూడబోయి పక్కనే బొమ్మలా కనురెప్పలు వాల్చకుండా ఆమె ముఖంలోకే చూస్తూ ధారాపాతంగా కన్నీళ్లు కార్చుతున్న కొడుకు నందిని చూసి నిలబడిపోయాడు. నిజమే తనకి తట్టనేలేదు. వాడు ఆ పిల్లని ప్రాణంగా ప్రేమిస్తున్నాడు కదూ! ఆమె మరణవార్త వాడ్ని బాగా కుదిపేస్తుంది. వాడ్ని ఆమె జ్ఞాపకాలు వెంటాడుతాయి. వాడు ప్రపంచం తెలియని ఒట్టి అమాయకపు వెధవ. ఈ సంఘటనని వాడు తట్టుకోలేడు. అసలే తల్లిలేని వాడు ఇప్పుడు ప్రేమించిన పిల్ల కూడా చచ్చిపోయింది. వాడ్ని మామూలు మనిషిని చెయ్యడం చాలా కష్టమయిన కార్యమే! కానీ తప్పదు

తనకి వారసుడు వాడు. వాడ్ని మామూలు మనిషిని చెయ్యాలి. వాడ్ని ప్రపంచాన్ని తెలుసుకున్న మనిషిని చేయాలి. వాడ్ని లౌక్యం తెలుసుకున్న మనిషిని చేయాలి. వాడ్ని రాజకీయం తెలుసుకున్న మనిషిని చేయాలి. మొత్తం మీద వాడ్ని తనంతటి వాడ్ని చేయాలి! తన శ్రమ, పట్టుదల, కార్య దీక్ష అంతా తను, వాడు సుఖపడడానికికాక ఇంకెవరికోసం?

నెమ్మదిగా వాడి పక్కన కూర్చుని వాడి తలమీద చెయ్యివేశాడు దీనబంధు. యాంత్రికంగా తల తిప్పాడు నంది. వాడి కళ్లల్లోకి చూస్తూ పెదవుల్ని ఒణికిస్తూ "నం...దీ" అన్నాడు ముగ్ధవైపు ఎంత అన్యాయం జరిగిపోయిందో చూడరా అన్నట్లు చూపిస్తూ. వాడు ఆపుకోలేక తనని కౌగలించుకుని బావురుమంటాడని వూహిం చాడు. కాని అలా జరగలేదు. నంది ఎంత యాంత్రికంగా తండ్రి కళ్లల్లోకి చూశాడో, అంత యాంత్రికంగానూ తలని మళ్లీ తిప్పే సుకుని ముగ్ధ ముఖంలోకే చూడసాగాడు.

దెబ్బతిన్నాడు దీనబంధు.

నంది ప్రవర్తనకి భయపడ్డాడు కూడా. ఎప్పటికయినా వీడు మన లోకంలోకి వస్తాడా అని.

ఇంతలో పోలీసు వ్యాను, అంబులెన్సు వచ్చాయి.

బయట హడావుడి పెరిగింది.

అదే సమయంలో కన్నబాబు, అతని మిత్రులు రెండు కార్లలో హడావుడిగా వచ్చారు. కార్లు దిగుతూనే "ముగ్ధ అమర్ హై, సాహస వనిత ముగ్ధ అమర్ హై, నారీలోకానికి ఆదర్శ వనిత ముగ్ధ అమర్ హై, మా నాయకురాలు ముగ్ధ అమర్ హై" అంటూ పెద్ద పెట్టున నినాదాలు చేశారు.

అసలే దుఃఖంలో మునిగి వున్న కేశవరా వుగారు బయట అలజడికి నెమ్మదిగా తడ బడే అడుగుల్తో బయటకొచ్చి పోలీసు వ్యానుని, అంబులెన్స్‌నీ చూసి పరిస్థితి అర్థమై "వీల్లేదు... వీల్లేదు! నా బంగారుతల్లికి పోస్ట్‌మార్టం చెయ్యడానికి నేనొప్పుకోను" అంటూ ఉన్మాదిలా కేకలుపెట్టి కూతురి శవం పక్కనే కూలబడి ఆమె తలని తన ఒడిలోకి తీసుకుని ఆమె ముఖం మీదుగా ఆమె గుండెల మీదకు వాలిపోయారు.

"అవును! వీల్లేదు.. వీల్లేదు" అంటూ నంది స్నేహితులు కూడా గొడవ చేశారు.

నందిలో మాత్రం చలనం లేదు. ఒక యంత్రంలా మరబొమ్మలా...

దీనబంధు నెమ్మదిగా కొడుకు చేతులు పట్టుకుని లేవనెత్తి, అక్కడున్న కుర్చీలో కూర్చోబెట్టి కేశవరావుగారి దగ్గరకొచ్చి ఆయన్ని సముదాయిస్తూ "కేశవరావుగారూ! పెద్దవారు మీకు చెప్పేటంతటి శక్తిమంతు డ్నికాను. కానీ ఇటువంటి కేసుల్లో మరి పోలీసులు తమ డ్యూటీ చెయ్యక తప్పదు కదా! తీసుకెళ్లనీయండి. మళ్లీ ఓ రెండు గంటల్లో తీసుకొచ్చేస్తారు. ప్లీజ్ కంట్రోల్ చేసుకోండి. అమ్మాయి మరణాన్ని మించి నదా ఈ పోస్ట్‌మార్టం. ప్రాణంలేని కట్టెకి ఇంక ఏం చేసినా ఒక్కటేకదా" అన్నాడు.

"హయ్యో" అంటూ కేశవరావుగారు నొసలు చేతుల్తో బాదుకుంటూ వెనక్కి గోడకి జేర్లపడిపోయారు.

పోలీసుల సాయంతో ముగ్ధ శరీరాన్ని అంబులెన్స్‌లోకి చేర్చారు.

పోలీసు వ్యాను కదుల్తోండగా వ్యాను ఎక్కుతూ ఇన్‌స్పెక్టర్ దీనబంధు వైపు చూసిన చూపు యాంత్రికంగా గుడ్లప్పగించి చూస్తున్న నంది కంటపడింది. అప్పుడు కొట్టుకున్నాయి వాడి కంటి రెప్పలు రెండు సార్లు. చాలాసేపటి తర్వాత తల తిప్పి తన వైపు చూస్తున్న కన్నబాబు చూపులో ధైర్యాన్ని కలిగిస్తూ చూపుని కలిపాడు దీన బంధు. అదీ నంది కంటపడింది.

రెచ్చిపోయిన కన్నబాబు మళ్లీ "ముగ్ధ అమర్ హై" అంటూ స్లోగన్లు ఇచ్చాడు.

కోరస్ పలికారు అతని మిత్రబృందం.

నంది మిత్రులు నంది చుట్టూ చేరి ఊర డిస్తున్నారు.

"మిగతా ఏర్పాట్లు చూస్తాను మావయ్యా" అని కన్నబాబు స్నేహితులతో సహా కార్లెక్కి వెళ్లిపోయాడు.

మెట్లెక్కి కేశవరావు గారి వైపు నడిచాడు దీనబంధు.

★ ★ ★

భార్య ఇంద్రాణిని కేశవరావు గారింటికి పంపించి సోఫాలో అలా బొమ్మలా కూర్చుని వుండిపోయాడు చక్రవర్తి. నౌకరు సింహాచలం ఎంత బతిమలాడినా పచ్చిమం చినీళ్లు కూడా ముట్టలేదు.

ఫోన్ల మీద ఫోన్లు వస్తున్నాయి రాక్షస కోతి చేష్టలకి ఆందోళన చెందుతూ.

వాటి మధ్యలో చింతల నాయుడి ఫోను, పరామర్శ నటిస్తూ. మళ్లీ అందులో పుష్కలంగా వ్యంగ్యం తన అసమర్థతని తెలివిగా ఎత్తిచూపడం. తనని వీలయినంతగా కృంగ దీయాలని చేసే ప్రయత్నం.

అవమానంకంటే ముగ్ధ చనిపోయిందన్న బాధే ఎక్కువ కృంగదీస్తోంది చక్రవర్తిని.

మధ్యలో రెండుసార్లు ఫోను చేసి బావ గారి క్షేమం కనుక్కున్నాడు దీనబంధు. ఏమీ విచారించొద్దనీ, కేశవరావుగారింటి దగ్గర ఏర్పాట్లన్నీ తను స్వయంగా చూస్తున్నాననీ చెప్పాడు. "డాక్టర్ని పంపిస్తాను. ఒక్కసారి టెస్టు చేస్తాడు మిమ్మల్ని. కాదన కండి ప్లీజ్" అన్నాడు. వద్దని ఖచ్చితంగా చెప్పేశాడు చక్రవర్తి.

ఇంతలో పార్టీ ప్రెసిడెంటు నుంచి ఫోను "సీయం మిమ్మల్ని ఒకసారి కలవమంటున్నా"రంటూ.

తప్పనిసరయి శక్తి తెచ్చుకుని సెక్రటేరియట్‌కి చేరి సి.యం ఛాంబర్‌కి వెళ్తూండగా పార్టీ ప్రెసిడెంటు కలిశాడు. ఇద్దరూ సి.యం ఛాంబర్‌లోకి వెళ్లారు.

సాదరమయిన చూపుతో లోపలకి ఆహ్వానించాడు సీయం, వీళ్లిద్దరూ పెట్టిన నమస్కారాలకు ప్రతినమస్కారం చేస్తూ.

గుండెల నిండా నిండిన బాధతో నెమ్మదిగా నడిచి కుర్చీలో కూర్చున్నాడు చక్రవర్తి.

"చక్రవర్తిగారూ! మీరెంత బాధలో ఎంత టెన్షన్‌లో వున్నారో నాకు తెలుసు" అన్నాడు సీయం సానుభూతిగా.

మనసు కొంచెం తేలిక అయినట్లయింది చక్రవర్తికి.

నెమ్మదిగా తలెత్తి ఆయన కళ్లల్లోకి చూశాడు మౌనంగా.

"అయితే పరిపాలన, రాజకీయాల విషయానికి వచ్చినప్పుడు మన బాధ, మన టెన్షన్‌లకంటే కూడా కర్తవ్యం, ఫలితం ఇవే ఎక్కువ విలువని సంపాదించుకుంటాయి. ముఖ్యంగా ఫలితం. మనం ఏ పరిస్థితుల్లో వున్నాం, ఏం ప్రయత్నాలు చేశాం, ఎందరు సహకరిస్తున్నారు, ఎన్ని ప్రయత్నాలు చేసినా మానవ సాధ్యమయిన పనేనా అనే వేవీ ఎక్స్క్యూజెస్‌గా ప్రజల ముందు నిలవవు. ప్రజలకు కావలసింది ఫలితం ఒక్కటే. మీ సామర్థ్యం మీద నాకు పూర్తి నమ్మకం వుంది. పోలీసు డిపార్ట్‌మెంట్‌నీ మీ డిపార్ట్‌మెంటునీ కోఆర్డినేట్ చేసుకుంటూ మీరూ, కమీషనరుగారూ ఓ కమిటీ వేసుకుని ఒకటి రెండు రోజుల్లో ఈ రాక్షసకోతి సమస్యని రూపుమాపాలి మీరు. ఓకే" అన్నారు చిరునవ్వు సాయంతో. ఆయన అన్నీ అలా చిరునవ్వు సాయంతోనే చెబ్తారనీ, కానీ విషయ గాంభీర్యం వుంటుందనీ చక్రవర్తికి తెలుసు.

అంగీకారంగా తలవూపి, బయటకొచ్చి పార్టీ ప్రెసిడెంటు దగ్గర శలవు తీసుకుని ఇంటి ముఖం పట్టాడు చక్రవర్తి.

★ ★ ★

రాత్రి హాస్పిటల్లో డబ్బు కట్టి తల్లికి ఆపరేషన్ జరుగుతున్నంతసేపూ బయట పచార్లు చేసి తిరిగి ఆమెను ఐ.సి.లోకి తీసుకు వెళ్లిపోతుంటే కంగారు పడిపో

యాడు ప్రకాశం.

అమ్మకు నయం కావాలి. తమ్ముడూ, చెల్లాయి అనాథలు కాకూడదు. తనకి తప్పకుండా బంగారు భవిష్యత్తుని చూపిస్తాడు దీనబంధుగారు. పూర్తి ఆరోగ్యవంతురాలైన అమ్మ, మంచి చదువుల్లో తోబుట్టువులు, మంచి వుద్యోగంలో తను... తన ఇల్లు కళ కళలాడాలి.

"ఎలావుంది డాక్టర్? " అనడిగాడు బయటకొచ్చిన డాక్టరుతో.

'చూడాలి' అన్నట్లుగా తలాడించి కేర్‌లెస్‌గా వెళ్లిపోయాడాయన.

అక్కడే చాలాసేపు పచార్లు చేశాడు ప్రకాశం.

"మీరు వెళ్లి లౌంజ్‌లో కూర్చోండి ఇక్కడ వుండకూడదు. పెద్ద డాక్టరు గారు రౌండ్స్‌లో వున్నారు" అని చెప్పింది నర్సు.

ప్రకాశం మెట్లు దిగి బయట వరండాలోకి వచ్చి సోఫాలో కూర్చుంటూ టీపాయ్ మీదున్న న్యూస్ పేపరందుకున్నాడు. మనసు మాత్రం తల్లిమీదే వుంది. తనని చూడనిస్తే బాగుండును. ఒక్కసారి ఆవిడ కళ్లు తెరచి తనతో మాట్లాడితే తనకి కొంత బెంగ తీరుతుంది. ఇంటికి వెళ్ళి తమ్ముడికీ, చెల్లాయికీ అన్నం పెడ్తూ, అమ్మతో మాట్లాడానని చెప్తే వాళ్ల కళ్లు మెరుస్తాయి. కానీ వీళ్లు అనుమతించరు. అమ్మ కండిషన్ ఏవిటో తెలియదు. అసలు అమ్మ రోగం నయం చేయించి ఇంటికి తీసుకు వెళ్లగలడో లేదో తెలియదు. పేపరు చదవబుద్ధిగా లేదు. దాన్ని తిరిగి టీపాయ్ మీద పడేస్తూ పడేస్తూ హెడ్డింగు చదివి... పిచ్చెక్కినట్లయి ఒళ్లు మరచి "నో" అని పెద్ద పెడబొబ్బ పెట్టాడు ప్రకాశం.

ఆ చుట్టుపక్కల వున్న వాళ్లంతా అదిరిపడ్డారు.

అంతా ప్రకాశంవైపు చూశారు కంగారుగా.

సెక్యూరిటీవాళ్లు పరుగెత్తుకొచ్చారు హడావుడిగా.

ఒకళ్లిద్దరు డాక్టర్లు, నర్సులూ, రిసెప్షనిస్టూ కూడా వచ్చారు.

అదుపు తప్పిన తన ఆందోళనతో తను అలా అరిచానని గ్రహించాడు ప్రకాశం. ఇంక ఆందోళనని ప్రదర్శిస్తే ప్రమాదం. బయటకు వెళ్లిపొమ్మంటారు కూడా. "సారీ సారీ అండి" అన్నాడు చుట్టూ వున్న వాళ్లతో.

"మీ వాళ్లెవరయినా హాస్పిటల్లో వున్నారా? " అనునయంగా అడిగింది నర్సు.

ఆ ప్రశ్న బాగా పనికొచ్చింది ప్రకాశానికి.

"అవును సిస్టర్! మా అమ్మగారు ఇన్టెన్సివ్ కేర్‌లో వున్నారు. ఆమె గురించే నాకు ఆందోళనగా వుంది. అందుకనే..."

"డోన్ట్‌వర్రీ, రిలాక్స్. ఎవ్విరిథింగ్ విల్ బి ఆల్రైట్" అంటూ భుజం మీద తట్టి తమ పని మీద వెళ్లి పోయారు డాక్టర్లు.

నర్సులూ, రిసెప్షనిస్టూ, సెక్యూరిటీ వాళ్లు కూడా వెళ్లిపోయారు.

దగ్గర్లో వచ్చి కూర్చుంటూ "మీ అమ్మకేంటి జబ్బా? " అనడిగాడు ఓ మాసిన గెడ్డం మనిషి. జబ్బేంటో చెబ్తే తర్వాత తన తాలూకు పేషెంటు జబ్బు గురించి చెప్పి హాస్పిటల్స్ గురించి, జబ్బుల గురించి, డాక్టర్ల నిర్లక్ష్యం గురించి ఇంక వ్యాఖ్యానాలు మొదలు పెడ్తాడన్నమాట.

ఒక్కసారి అతనివైపు ఎగాదిగా చూసి "ఏం లేదులే" అని, సీట్లోంచి లేచిపోయి దూరంగా పోయి ఓ మూలగా వున్న కుర్చీలో కూర్చుని మళ్లీ పేపరు మీద దృష్టి సారించాడు ప్రకాశం.

"మళ్లీ విజృంభించిన రాక్షసకోతి"

"రాక్షసకోతి చేతిలో అబల దారుణ మరణం"

ప్రకాశం కళ్లల్లో నీళ్లు చిమ్మాయి. చెంపలు అదిరాయి కోపంతో. గుండెలు ఎగిసి ఎగిసి పడ్డాయి బాధతో. న్యూసంతా కన్నీటి తెరలగుండా చదివాడు. మనసు

అల్లకల్లోలం అయిపోయింది. ఏవిటీ దారుణం? ఎందుకీ కిరాతకం? ఎక్కడుంది మానవత్వం? దరిద్రంకంటే రాక్షసత్వం ఘోరమైనదేనా? దరిద్రంలోంచి ధైర్యం పుట్టదా? దరిద్రంలోంచి దావానలం పుట్టదా? పుడుతుంది. పుట్టాలి. పిడికిళ్లు బిగిశాయి. లేచి నిలబడ్డాడు ఆవేశంగా!

"మిస్టర్ ప్రకాశం! మిస్టర్ ప్రకాశం! యూ మే అటెండ్ యువర్ పేషెంట్ నౌ" అని అనౌన్స్‌మెంటు వినిపించింది.

గబగబా పరుగెత్తాడు ప్రకాశం.

ఐ.సి.లోంచి స్ట్రెచర్ మీద ప్రకాశం తల్లిని బయటకు తెస్తున్నారు. అమ్మా అంటూ కంగారుగా ఆ స్ట్రెచర్ దగ్గరకు పరుగెత్తాడు ప్రకాశం. ఆశ్చర్యం కొడుకుని చూస్తూనే ఆవిడ నీరసంలోంచే శక్తిని తెచ్చుకుని ఆప్యాయంగా నవ్వింది.

ఆనందంతో కళ్ల నీళ్లయిపోయాడు ప్రకాశం.

'అమ్మ నవ్వింది. ఎన్నాళ్ల తర్వాత ఆమె నవ్వుని చూస్తున్నాడు తను. అందులో భయపెట్టిన జబ్బు నుంచి బయటపడి పెద్ద ఆపరేషన్ చేయించుకుని బయటకొచ్చి తనని చూస్తూ నవ్వింది. చాలు అమ్మ నవ్వింది'.

ప్రపంచాన్ని మరిచిపోయాడు ప్రకాశం.

దీనబంధు కళ్ల ముందు మెదిలాడు. అప్రయత్నంగా అతనికి నమస్సులు సమర్పించుకున్నాడు. తల్లి చేతిని తన చేతుల్లోకి తీసుకుని స్ట్రెచర్‌తో బాటే నడుస్తూ రూములోకి దారితీశాడు.

★ ★ ★

పోస్టుమార్టం తర్వాత ముగ్ధ శరీరాన్ని బట్టలతో కుట్టి అంబులెన్స్‌లో ఇంటికి తీసుకొచ్చి అప్పగించారు పోలీసులు.

మళ్లీ అంతా గొల్లుమన్నారు.

"తల్లీ రాత్రి ఆ దిక్కుమాలిన కోతి నిన్ను దారుణంగా హింసించి పొట్టనపెట్టుకుంది. ఇప్పుడు వీళ్లు ముక్కముక్కలుగా కోసి పరిక్షలు జరిపారా అమ్మా! ఇంకా దేనికోసమమ్మా పరిక్షలూ! అంతకంటే గునపాలతో నా గుండెల్లో గుచ్చేస్తే బాగుండేదిగా లేకపోతే ఆ కత్తులతోనే నన్ను ముక్కలు ముక్కలు చేసినా బాగుండేదిగా" అంటూ రోదించసాగారు కేశవరావుగారు.

దీనబంధు ఆయన్ని పొదివిపట్టుకుని ఓదార్చుతున్నాడు.

నంది ఓ మూల గోడకి జార్లపడి పిచ్చి చూపులు చూస్తున్నాడు.

ఓ ట్రక్కులో ప్లాట్‌ఫారం అమర్చి దానిని పూలదండల్తో కప్పి బ్యాండుతో బాటు వచ్చాడు కన్నబాబు. అతని స్నేహితులు కాలేజీ కుర్రాళ్లందర్నీ పోగుచేసుకుని వచ్చారు.

"ఈ బ్యాండుమేళం, ఈ పూలరథం దేనికయ్యా! నా బంగారుతల్లి పెళ్లా ఏమన్నానా? వద్దు నాయినా" అంటూ ఏడ్చాడు కేశవరావుగారు.

"కాదులెండి, ముగ్ధ అంటే కాలేజీ విద్యార్థులందరికీ ప్రాణం. అందులో కన్నబాబుకీ, నందికీ వాళ్లకీ మరీనూ. చిన్నప్పట్నుంచీ ప్రాణ స్నేహితుల్లా కలిసి తిరిగారు. ప్రాణం ఎలాగూ పోయలేరు. పూలతోనైనా నివాళి అర్పించనీయండి" అన్నాడు దీనబంధు సముదాయిస్తూ.

ముగ్ధ శరీరాన్ని చేతుల్లోకి తీసుకుని ట్రక్కులోని ప్లాట్‌ఫారం మీదకు చేర్చారు కన్నబాబు, అతని స్నేహితులు.

శవం మీద పూలదండలుంచారు.

కేశవరావు గారింట్లో వచ్చిన కష్టానికి కొడుకు సాయపడుతున్నందుకు సంతోషించింది కళ్ల నీళ్లు తుడుచుకుంటూ ఇంద్రాణి.

ట్రక్కు కదలబోతోంది.

కన్నబాబు నెమ్మదిగా నంది దగ్గరకొచ్చి "నందీ రా! ట్రక్కులో ఎక్కు" అన్నాడు. నంది తల అడ్డంగా వూపాడు. యాంత్రికంగా లేచి బయటకొచ్చి ముగ్ధ శరీరం వైపొకసారి చూసి వీడ్కోలు చెబుతున్నట్లుగా

గాలిలో చెయ్యి వూపి, తటాలున తల పక్కకు తిప్పుకుని విసురుగా వెళ్లిపోసాగాడు. అతని నట బృందం కూడా అతన్ని అనుసరించింది.

"ముగ్ధ అమర్ హై" అన్న నినాదాలతో ట్రక్కు ముందుకు కదిలింది.

జనం ట్రక్కువెంట నడవసాగారు నినాదాలిస్తూ.

ట్రక్కులో ప్రముఖంగా కనబడేలా నిలబడి కన్నబాబు ముగ్ధ అమర్ హై అంటూ స్లోగన్లు యిస్తున్నాడు.

భవిష్యత్తులో వీడు నన్ను మించిపోకుండా చూసుకోవాలి అనుకున్నాడు దీనబంధు అడుగు ముందుకువేస్తూ.

బంధువులు పొదివి పట్టుకుని నడిపిస్తూండగానే కేశవరావుగారు విలపిస్తూ నెమ్మదిగా నడుస్తున్నారు.

★ ★ ★

అంత్యక్రియలకి శవాన్ని తీసుకువెళ్లాక ఇంద్రాణి ఇంటికి బయల్దేరి వచ్చేసింది. ఆమెకి ముగ్ధ మరణం ఎంతటి మనస్తాపాన్ని కలిగించినా భర్త గురించిన సహజమైన ఆందోళన ఎక్కువగా వుంది. ఆయన సలే సెన్సిటివ్ మనిషి. చిన్నచిన్న విషయాలకే చాలా బాధపడిపోతూంటారు. అలాంటిది ఆయన స్వంత కూతురుకంటే ఎక్కువగా ప్రేమించే పిల్ల ముగ్ధ మరణం మరింత కృంగదీయదూ? ఏదో సర్ది చెప్పుకుని మామూలు మనిషి అయ్యే నైజం కాదాయె ఆయనది. ఏదోవిధంగా మామూలు మనిషిని చెయ్యాలి. లేకపోతే ఈ బాధలో అంత బాధ్యతాయుతమయిన పదవిలో నెగ్గుకురాలేక పిచ్చివాడయిపోతారు.

ఇంట్లోకి వస్తూనే భర్తని చూసి మరింత కంగారుపడిపోయిందావిడ. సోఫాలో అశక్తుడిలా డీలాపడిపోతూ వాలిపోయి వున్నాడాయన. సింహాచలం కాళ్ల దగ్గర కూర్చుని కాళ్లు పడుతున్నాడు.

"ఏవండీ ఏవిటిలా కూర్చుండిపోయారూ? " అంది గాభరాగా.

"అంతా అయిపోయిందా? " అనడిగాడు చక్రవర్తి ఒణుకుతూన్న గొంతుతో.

ఆవిడా కొంగు నోట్లో కుక్కుకుని తలూపింది. ఆపైన "అంతా భగవదేచ్ఛ! మన చేతుల్లో ఏమీలేదు. మీరు మరీ డీలా పడిపోకండి" అంది.

పళ్లరసం గ్లాసు వైపు చూపిస్తూ అయ్యగారు తీసుకోవడంలేదు అన్నట్లుగా సంజ్ఞచేశాడు సింహాచలం.

"ఎలాగండి మరీ..." అని బాధపడి "నేను స్నానం చేసి వస్తానూ మీరు దయచేసి ఆ పళ్లరసం తాగండి" అని లోపలికెళ్లింది.

పళ్లరసం గ్లాసుని దగ్గరగా తెచ్చాడు సింహాచలం.

వద్దని దూరంగా జరిపాడు చక్రవర్తి.

★ ★ ★

పొద్దుపడమటకి వాలింది.

చక్రవర్తి వరండాలో కూర్చుని రాబోయే వ్యక్తులకోసం ఎదురుచూస్తున్నాడు. ఇంద్రాణి మళ్లీ బతిమలాడింది భర్తని, "కొద్దిగానైనా ఎంగిలిపడండీ, లేకపోతే మీ ఆరోగ్యానికి అస్సలు మంచిదికాదూ" అంటూ.

"తిననుగాక తినను" అన్నాడు చక్రవర్తి.

ఆయన చూపు తదేకంగా గేటువైపే వుంది.

కారు వస్తున్న ధ్వని వినిపించింది. లేచి నిలబడి, గేటువైపు నడిచాడు చక్రవర్తి. కారు వచ్చింది. కారులోంచి దిగుతున్న కేశవరావుగారికి చేతి ఆసరా యిచ్చి దింపాడు చక్రవర్తి. ఆయన్ని దగ్గరగా గుచ్చి హత్తుకుని, నెమ్మదిగా నడిపించుకుంటూ లోపలకి దారితీశాడు. కారు పక్కగా పార్కు చేసి, దీనబంధూ వచ్చాడు లోపలకి.

కేశవరావుగారిని ఒప్పించి తీసుకురాగలిగినందుకు దీనబంధుని మెచ్చుకుంటూ చూశాడు చక్రవర్తి. ఆనందంతో దీనబంధు

పెదవి ఒరగా పైకి లేచింది.

గ్లాసులో పళ్లరసంతో వచ్చాడు సింహాచలం.

ఎంత ప్రయత్నించినా కేశవరావుగారిచేత తాగించలేకపోయాడు. కేశవరావుగారు మళ్ళీ దుఃఖానికి లొంగిపోయి, కుమిలిపోసాగారు. "కోతేమిటి? అమ్మాయిమీద దానికేదో పగ వున్నట్లు, అమ్మాయిని పార్కులోకి లాక్కుపోయి చంపడమేమిటీ? "

ఆ మాటలు వింటూంటే మతిపోయినట్లయ్యింది చక్రవర్తికి. "ఏమిటీ, అమ్మాయిని పార్కులోకి లాక్కుపోయి చంపేసిందా, ఆ కోతి? " అన్నాడు.

"అవును బావగారూ" అన్నాడు దీనబంధు.

"ఇదేం వింత? ! కేశవరావుగారూ మరోలా అనుకోకండీ, అమ్మాయికి బాయ్ ఫ్రెండ్సెవరైనా వున్నారా? "

బాధగా చూస్తూ, "ఇంటిదగ్గర దించుకున్న తల తిరిగి ఇంటికొచ్చాకే ఎత్తుతుంది నా చిట్టితల్లి. ఆమెకి బాయ్‌ఫ్రెండ్సెవరూ లేరయ్యా" అన్నారు కేశవరావుగారు.

"అహ... అది కాదు! ఏ కుర్రాడితోనయినా స్నేహంగా వుంటే, హీరోయిజం కొద్దీ అమ్మాయిని పార్కుకి తీసుకెళ్ళి, ఆ భయంకర కోతిరాగానే వాడు భయపడి పారిపోయేడేమో, అమ్మాయి బలయిపోయిందేమోననీ. ఇంకొక విషయం కేశవరావుగారూ! మీరు నన్ను అపార్థంచేసుకోకూడదు, క్షమించాలి. అమ్మాయి మీద దుండగులెవరేనా అత్యాచారంచేసి, ఆ నేరాన్ని కోతిమీదకు నెట్టేయలేదు కదా? " సందేహం లోపల తినేస్తుంటే, ఆపుకోలేక బయటకు కక్కేశారు చక్రవర్తి.

మతిపోయినట్లు చూశారు కేశవరావుగారు.

దీనబంధు కంగారుగా కలగజేసుకుంటూ అన్నాడు, "అబ్బెబ్బే, లేదు బావగారూ, అటువంటిదేం లేదు. ఇది కేవలం ఆ కోతి పనే అని ఎక్స్‌పర్ట్స్ కూడా కన్‌ఫర్మ్ చేసేశారు. పోస్ట్‌మార్టం చేయించాను కూడా"

చక్రవర్తి బాగా డీలాపడిపోయాడు.

దాన్ని పట్టుకోలేకపోతున్నందుకు పార్టీ అధిష్టానం, ఎక్స్‌పార్టీ కూడా తనని హేళనగా చూస్తున్నారు. ఇవతల ప్రజలూ భయంతో బాధలు పడ్తున్నారు. ముగ్ధలాంటి అమాయకులు బలయిపోతున్నారు. కేశవరావుగారిలాంటి అమాయకుల కడుపులో చిచ్చు మిగుల్తోంది. మొన్న రాత్రి సంఘటన ప్రకారం ఆంజనేయస్వామికి శాంతులూ, పూజలూ చేయించాలని, దాంతో ఎటువంటి అరిష్టాలు జరగవని నగర ప్రజలందరూ నిర్ణయించుకుని, కార్యరంగంలోకి దిగితే నిన్న మళ్లీ ఈ ఘోరమేమిటి? రాత్రుళ్లు ఆందోళన కలిగిస్తూ జనాన్ని ఇబ్బందిపెడ్తున్న ఆ పాడు కోతి మరి పగలంతా ఎక్కడుంటోంది? అసలది ఎలా వచ్చింది?

"అయ్యో ఎక్కడ్నుంచి దాపురించిందయ్యా దిక్కుమాలిన కోతి? ! పోనీ, అది నా యింటికొచ్చి నన్ను పొట్టనపెట్టుకోకూడదూ. ఈ దారుణమయిన వార్తలు వినవలసిన అవసరంలేకుండా పోతుంది" అన్నాడు చక్రవర్తి బాధపడుతూ ఏం పాలుపోక.

ఆయన మాటలకి చలించిపోయారు కేశవరావుగారు. "అయ్యో అంత మాటనకండి" అన్నారు చెవులు మూసుకుంటూ.

దీనబంధు బావగారి పక్కన కూర్చుంటూ అన్నాడు, "బావగారూ మీరు ఈ కోతి విషయంలో చాలా దిగులుపడిపోతున్నారు. అందరికీ బాధగానే వుంది. కానీ ఏం చేస్తాం. ఏదో సరయిన మార్గం తోచాలి కదా! ఇక కేశవరావుగారిది తీర్చలేని లోటే పాపం. చాలా అన్యాయమే జరిగింది ఆయనకి. ఎంతటి క్లిష్టపరిస్థితుల్లోనయినా మీకు చక్కటి సలహాలు ఇవ్వగలిగిన ఆయన ఇప్పుడీ సంఘటనతో ఇంతలా డీలాపడిపోతుంటే గుండె చెక్కలవుతోంది. కానీ ఏం చేస్తాం? ! అయ్యో, కేశవరావుగారూ! నలుగురికీ వేదాంతం బోధించి మనశ్శాంతినిచ్చే

# ఏరిన ముత్యాలు

- వ్యాధిని దేవుడు నయం చేస్తాడు. డాక్టర్ ఫీజు వసూలు చేస్తాడు.

  – ఫ్రాంక్లిన్

- మనం క్రూరజంతువులను ఏవిధంగా అయితే మచ్చిక చేసుకుంటామో, అదేవిధంగా మన మనసును కూడా స్వాధీనంలో ఉంచాలి.

  – ప్రొఫెసర్ గోపాల్

- డబ్బు గుండ్రంగా ఉంటుంది. కనుక అది దొర్లుకుంటూపోతుంది.

  – షోలెన్ అలీచెమ్

- ఒక మనిషి యొక్క నిజాయితీని పరీక్షించాలంటే అతనికి అధికారాన్ని ఇవ్వాలి!

  – వోల్టేర్

- ప్రతీ మనిషికీ నీ చెవులను అప్పగించి వారు చెప్పేది విను. అయితే కొద్దిమందికి మాత్రమే నీ గొంతుకను ఇచ్చి మాటలు వినిపించు!

  – సోమర్‌సెట్ మామ్

- అందరికీ ఆగ్రహం కలుగుతుంది. అయితే ఈ కోపాన్ని తగిన వ్యక్తిపై, తగిన సమయంలో, తగిన పనికోసం చూపాలి. అయితే ఇది అలవడడానికి ఎంతో కృషి, నిగ్రహం కావాలి.

  – అరిస్టోటిల్

- వినడంవలన విజ్ఞానం లభిస్తుంది. మాటలాడడంవలన పశ్చాత్తాపం చెందవలసి వస్తుంది.

  – హెమింగ్వే

- నిమిషాల గురించి నువ్వు శ్రద్ధ తీసుకో. అప్పుడు గంటలు తమ గురించి తామే శ్రద్ధ తీసుకొంటాయి. చిన్న విషయాల్లో జాగ్రత్త తీసుకో. ఇందువలన పెద్ద విషయాలు చక్కగా నిర్వహించబడతాయి.

  – జె.డబ్ల్యు.బార్కర్

- ఓర్పులేని మనిషి నూనెలేని దీపం వంటివాడు!

  – ఎడిసన్

- ఆశావాది గులాబీని చూస్తాడు. నిరాశావాది ముల్లును చూస్తాడు.

  – గోల్డ్‌స్మిత్

- ఒక ఎదురుదెబ్బ తగిలినంత మాత్రాన సాధించదలచుకున్న ప్రయోజనం నుంచి వెనుకంజ వేయవద్దు.

  – షేక్స్పియర్

- అభిరుచికి అనువైన విద్య ఉండాలి. విద్యకు అనువైన ఉద్యోగం ఉండాలి.

  – గాంధీ

సేకరణ: కొడిమెల శ్రీరామమూర్తి

మీరు గుండెదిట్టం చేసుకోక తప్పదు. ఇటువంటి సమయాల్లో మనకి దిక్కు వేదాంతం ఒక్కటే కదా? ఏమంటారు? "

కేశవరావుగారు బేలగా చూశారు దీనబంధువైపు. వెర్రిగా నవ్వారు.

"నేనన్నది తప్పయితే క్షమించాలి" అన్నాడు దీనబంధు చేతులు జోడించి అతి వినయంగా.

తల అడ్డంగా వూపారు కేశవరావుగారు.

"లేదు బాబూ. కానీ నలుగురికీ బోధించినంత సుళువా బాబూ స్వంతానికొచ్చేసరికి వేదాంతాన్ని నమ్ముకోవడం? ! కానీ తప్పదు! సర్ది చెప్పుకోవలసిందే. గత్యంతరంలేదు! ఎప్పుడూ, గలగల పారే సెలయేరులా నాతో కబుర్లాడే నా బంగారుతల్లి ఉలుకూ పలుకూ లేకుండా, నాతో ఒక్క మాటయినా మాట్లాడకుండా మట్టిలో కలిసిపోయింది. నా సర్వస్వం నా బంగారు తల్లికోసమే అనుకున్నాను. ఏం మిగిలింది మాకిప్పుడు సంబంధం? ఏం మిగిలింది ఇప్పుడు నా యింట్లో. వేదాంతం వేదాంతం వేదాంతం" అంటూ వెర్రిగా నవ్వుతూ, మధ్యమధ్య దుఃఖిస్తూ పాడారు.

"గూడూ- చిన్నబోయెరా- చిన్నన్నా
గూడూ- చిన్నబోయెరా!
గూటినున్నా రామచిలకా- గువ్వలా పాలాయెరన్నా
గూడూ- చిన్నబోయెరా!
పంచపరమాన్నములు- పళ్లెరములో పోసి యిచ్చినా
మాణిక్యము చేతికిచ్చినా- మాటలాడదు రామచిలకా
గూడూ- చిన్నబోయెరా...'

ఆయనలా ఆర్ద్రంగా పాడుతుంటే, మనసంతా కెలికేసినట్లయిపోయిన చక్రవర్తి లేచి నిలబడి, ఆయన్ని కౌగలించుకున్నాడు, "కేశవరావుగారూ- కొంచెం ఓర్చుకోండీ" అంటూ.

"అలాగేనండయ్యా... అయ్యా నాకు శలవిప్పించండి. వస్తాను" అన్నారు చేతులుజోడించి.

కంగారుగా చూశాడు చక్రవర్తి. "ఎక్కడికీ మా దగ్గర మా ఇంట్లో వుండిపోండీ" అన్నాడు.

"లేదండయ్యా ఊరునుంచి మా తమ్ముడొచ్చాడు. వాడితో వెళ్ళిపోతాను. నా బంగారు తల్లి తిరిగిన ఇళ్లూ, ప్రదేశాలు ఇంక నేను చూడలేను. ఇంక ఇక్కడ ఉండలేను. మా వూళ్లో ఆశ్రమంలో జేరి... బతికినన్నాళ్లు బతికి, ఆ దేవుడెప్పుడు కనికరిస్తే అప్పుడు ఆయన దగ్గరకు వెళ్ళిపోతాను. దయచేసి నన్నాపకండయ్యా" అన్నారు చేతులు పట్టుకుని.

చక్రవర్తికి ఆపడం ధర్మం కాదనిపించింది.

"మీరు వెళ్ళిపోతుంటే నా ప్రాణం నానుంచి దూరమై పోతున్నట్లుగా వుంది కేశవరావుగారూ" అన్నాడు చక్రవర్తి ఆయన్ని గుండెలకి అదుముకుని. ఆపైన ఆయన్ని దిగబెట్టి రమ్మన్నట్లుగా దీనబంధువైపు చూశాడు.

విడిపోలేక విడిపోలేక బలవంతంమీద విడిపోయారు చక్రవర్తి, కేశవరావుగారూ.

"మీరిద్దరూ విడిపోతుంటే మీకంటే నాకు ఎక్కువ బాధగా వుంది" అన్నాడు దీనబంధు కళ్లుతుడుచుకుంటూ.

ఆపైన కారులో ఆయన్ని యింటివద్ద దిగపెట్టి రావడానికి బయల్దేరాడు. తనలోపల చెలరేగుతున్న 'ఆనందాన్ని' బయటకు కనబడకుండా కప్పివుంచడం అతనికి చాలా కష్టంగా వుంది పాపం!

★ ★ ★

తల్లి ఆరోగ్యం కుదుటపడే సూచనలు కనిపిస్తుండడంతో చాలా ఆనందాన్ని అనుభవిస్తున్న ప్రకాశం దీనబంధుకి ఫోను చేశాడు.

"దీనబంధు హియర్"

"సర్, నేను ప్రకాశాన్ని మాట్లాడుతున్నా"

"చెప్పు"

"మా అమ్మగారికి ఆపరేషన్ సక్సెస్ ఫుల్‌గా జరిగింది సార్"

'సంతోషం. మీ అమ్మగారు ఆపరేషన్ సక్సెస్‌ఫుల్‌గా జరిగింది సరే, నీకు అప్పగించిన ఆపరేషన్సే కుంటుతున్నాయి"

"సర్, నేను ఈరోజు డ్యూటీకొస్తున్నా"

"నువ్వు రావాలి, తప్పదు! రానన్నా రప్పిద్దామనుకుంటున్నాను. ఈరోజు నీ డ్యూటీ ఎక్కడంటే..." చెప్పాడు ఎక్కడో.

నోటమాట పెగల్లేదు ప్రకాశానికి.

"సార్ ఏమిటి సర్ మీరనేది. నా మనస్సు"

"కాష్టంలో కాల్చు నీ మనస్సుని. ఆడుతూ పాడుతూ లక్షలు గడించడానికి నువ్వు సినిమా హీరోవి కాదు మిస్టర్" తీవ్రంగా పలికాడు దీనబంధు, హెచ్చరిస్తున్న ధోరణిలో.

"నేనేం చెయ్యాలి సర్ అక్కడ" విధిలేక ఒప్పుకుంటూ అడిగాడు ప్రకాశం.

"..... ... ..." చెప్పాడు దీనబంధు.

ప్రకాశం మనసు కొంత తేలిక అయ్యింది. "అంతేనా సర్ అయితే ఓకే"

"అంతేనా కాదు. అజాగర్తగా వుంటే అంతు తేలిపోతుంది జాగర్త"

"తెలుసు సర్. నేను డ్యూటీని ఒళ్లు దగ్గర పెట్టుకుని చేస్తా"

"జాగర్త మరి" ఫోను కట్‌చేశాడు దీనబంధు.

ప్రకాశం మనసు కల్లోలంగా వుంది. డ్యూటీ చెయ్యాలి. తప్పదు! అయినా ఎంత. ఇంక రెండుమూడు రోజులేగా! దీనబంధు యిచ్చే పారితోషికం తల్లిని హాస్పిటల్ నుంచి డిశ్చార్జ్ చేయించి తెచ్చుకోవడానికి వుపయోగిస్తుంది. ఆ తర్వాత మళ్ళీ జాబ్ వెతుక్కోవాలి. దీనబంధే ఆదుకోవాలి.

తమ్ముడుకి, చెల్లాయికి అన్నంపెట్టి, జాగర్తలు చెప్పి, బ్యాగ్‌లో డ్రస్‌ని చెక్ చేసుకుని, బయటకు బయల్దేరాడు ప్రకాశం. తన యిష్టదైవం ఆంజనేయస్వామికి లోలోనే ప్రణామాలు సమర్పించుకుని.

★ ★ ★

కన్నబాబుకి స్వర్గంలో తేలుతున్నంత ఆనందంగా వుంది.

కాలేజీ ఎలక్షన్లలో తనకి విజయం డెఫినెట్ అని తోస్తోంది.

ముగ్ధ అంతిమయాత్ర తన విజయయాత్రకి గొప్ప స్టార్టింగ్ పాయింట్‌గా కనిపించింది. ఆమెని అంత గొప్ప మర్యాదలతో సాగనంపడంలో తను ముఖ్యపాత్ర వహించినందుకు కాలేజీ స్టూడెంట్లందరూ తనని ఎంత ఆరాధనగా చూశారు? ముగ్ధంటే అందరికీ అభిమానం. ఇప్పుడా అభిమానం అంతా తను దోచుకున్నాడు.

ఆనందంతో పేట్రేగిపోతున్నాడు కన్నబాబు.

దీనబంధు మామయ్యకి పదేపదే థేంక్స్ చెప్పుకున్నాడు.

సత్తులుగాడికీ, యితర ముఖ్య కాన్ఫిడెంట్ ఫ్రెండ్స్‌కీ మందు పార్టీ ఇచ్చాడు. 'డ్రైవ్ ద డెవిల్ అవుట్' అని కేకపెడ్తూ, కాళీ బాటిల్‌లో అగ్గిపుల్ల గీసివేసి ఇంటికి వెళ్లడానికి లేచాడు.

★ ★ ★

"ఈనాటితో నాటకాలకు గుడ్‌బై" అన్నాడు నంది మిత్రులతో.

"ఏమిటి నువ్వనేది? " అన్నారు వాళ్లు తెల్లబోతూ.

"నిజం! ముగ్ధలేని జీవితంలో నాకిక ఆనందం లేదు. ఒక్క ఈ శాలువా తప్ప, నాటకాలకి సంబంధించిన స్టేజి ప్రాపర్టీలన్నీ మీరందరూ తీసుకుని పంచుకోండి" అని శాలువా ఒంటిపొరని భుజాన వ్రేళ్లాడేసుకుని "నేనిక ఆజన్మ బ్రహ్మచారిని. జన్మలో మరో స్త్రీని పెళ్లి చేసుకోను. ముగ్ధని పొట్టనపెట్టుకున్న ఆ రాక్షసకోతి అంతుచూసేదాకా నిద్రపోను" అంటూ గదిలోంచి బయటకు చీకట్లోకి వెళ్ళిపోయాడు నంది.

"మేమూ నీతోనే గురూ" అంటూ మిగి

లిన వాళ్లూ కర్రలు తీసుకుని అతని వెంట నడిచారు.

గత రాత్రి రాక్షసకోతి చేతుల్లో ముగ్ధ ప ఘురాలైందన్న సంగతి కిష్టయ్యకి ఈరోజు బాగా ఆలస్యంగా తెలిసింది. ఎవరో ఆడపిల్లని కోతి పొట్టనపెట్టుకుందట అని విన్నాడుగాని ఆ ఆడపిల్ల తనకి దెబ్బలు తగిలినప్పుడు తల్లిలా, కన్నకూతురిలా సేవలు చేసిన పిల్ల అని సాయంత్రానిగ్గాని తెలియలేదు. మనిషి బాగా తల్లడిల్లిపోయాడు. కుమిలికుమిలిపడ్డాడు. తనకే ఇంత బాధగా వుంటే ఆమెని కన్నకూతురి కంటే ఎక్కువగా భావించే చక్రవర్తిగారికి ఇంకెంత బాధగా వుంటుందో కదా అనుకున్నాడు. అందులోనూ సహజమైన మరణం కూడా కాదు. ఇంటి దగ్గర వుండలేకపోయాడు. వార్త తెలిసిన తక్షణమే బయల్దేరి కళ్యాణ చక్రవర్తిగారిముందు వాలి బాధను పంచుకోవడానికి సిద్ధమయ్యేడు.



కిష్టయ్యని చూస్తూనే దుఃఖం పొంగుకొచ్చింది చక్రవర్తిలో.

"జరిగింది చాలా ఘోరం బాబూ" అంటూ ఏడ్చాడు కిష్టయ్య.

"మరింతమంది అమాయకులు బలయిపోకుండా కాపాడు భగవంతుడా" అని మొక్కుకున్నాడు దేవుడికి. "అయ్యా తమరు చాలా జాగర్త బాబూ" అని చక్రవర్తిని హెచ్చరించాడు. ఒక గంటపోయాక, "అయ్యా-శలవు, మరి నేనొస్తాను" అని బయల్దేరడానికి సిద్ధపడుతూ లేచాడు.

"ఎక్కడికీ?" అన్నాడు చక్రవర్తి.

"మావూరికి బాబూ"

"పొద్దుపోయింది. రోజులు బాగులేవు. ఈ రాత్రికి ఇక్కడే వుండిపో. పొద్దున్నే వెళ్దువుగాని"

"ఫరవాలేదు బాబూ- వెళ్ళిపోతాను"

"వద్దన్నాను- అంతే. భోజనం చేసి, పడుకో ఇక్కడే" ఆత్మీయతతో ఆజ్ఞాపించాడు చక్రవర్తి.

"ఈ పూట మరి భోజనం చేయను బాబూ"

"సరే నీ యిష్టం- ఈ రాత్రి నువ్వెళ్లడానికి మాత్రం వీల్లేదు"

"అలాగేనయ్యా..."

రాత్రి పదకొండు గంటలయ్యింది. హాలులో నిద్రపట్టక పచార్లు చేస్తున్నాడు చక్రవర్తి. భార్య భోజనం చేయమని ఎంత బ్రతిమిలాడినా మెతుకు కతకలేదు. ఆవిడ యింక మరీ బలవంతంచేసి, కళ్ల నీళ్లు పెట్టుకుంటే ఓ గ్లాసు పళ్లరసం తీసుకున్నాడంతే. కనీసం అదయినా తీసుకున్నాడని ఆవిడ తృప్తి చెందింది.

"ఇంకేం ఆలోచించక నిద్రపోదురుగాని రండి" అంది.

"నాకు నిద్రరావడంలేదు. నువ్వెళ్లి పడుకో" అన్నాడు.

ఆవిడ నిద్రపోవడానికి బెడ్‌రూంలోకి వెళ్ళిపోయింది.

చక్రవర్తి తీవ్రంగా ఆలోచిస్తూ, వరండాలోకి, హాలులోకి పచార్లు సాగిస్తున్నాడు. ఈ సమస్యకి ఏదో విధంగా పరిష్కారం ఆలోచించాలి. అసలిటువంటి సమయాల్లో తనకి మనశ్శాంతిని కలిగించగలిగే కేశవరావుగారు, కిష్టయ్య ఇద్దరూ కూడా దెబ్బతిని

వున్నారు. తనే వాళ్లని ఓదార్చే పరిస్థితి నడుస్తోంది. ఇంక వాళ్లనుంచి ఏం ఆశించ గలడు తను? ఇంక దీనబంధు! దీనబంధు రాజకీయ సమస్యలకి పరిష్కారం చెప్పగల డుగాని, ఇటువంటి సమస్యలకి ఏం చెప్పగ లడు? అప్పటికీ పాపం, తనతో సమా నంగా బాధపడుతూ శ్రమపడుతూనే వున్నాడు. మరెలా? ఈ ఘోరాలు యిలా జరగాల్సిందేనా? అమాయకులిలా....

ఒక్కసారిగా బెడ్‌రూంలోంచి ఇంద్రాణి వెర్రికేకలు వినిపించాయి.

అదిరిపడ్డ చక్రవర్తి బెడ్‌రూంలోకి పరుగెత్తాడు. బెడ్‌లైట్ వెలుతుర్లో మంచంమీద బిగుసుకుపోయి ఓ మూలకి ముడుచుకుపోయి భయంతో వజవజ వణకుతూన్న ఇంద్రాణి కనిపించింది.

"ఇంద్రాణీ ఏం జరిగిందీ" అంటూ కంగారుగా ఆమె దగ్గరకు చేరి ఆమెని కుదిపాడు చక్రవర్తి.

ఆమె అత్యంత భయంతో వణికిపోతోంది గాని ఏం చెప్పలేక పోతోంది. "చెప్పు ఇంద్రాణీ. ఏం జరిగిందీ" అంటూ గట్టిగా అరిచాడు చక్రవర్తి.

ప్రయత్నపూర్వకంగా గొంతు పెగల్చుకుంది ఇంద్రాణి. "కోతి అండీ... పెద్ద కోతి..." అంది భయపడిపోతూ.

"ఎక్కడా? " అంటూ ఆమెని పొదివిపట్టుకుని, చుట్టూ చూస్తూ కుదుపుతూ అడిగాడు.

ఆమె కిటికీవైపు చూపించింది.

వెంటనే గదిలో లైటువేసి, కిటికీ దగ్గరకు పరుగెత్తాడు చక్రవర్తి. కిటికీ వూచల అవతల ఏమీ కనబల్లేదు.

ఇంతలో, కింద పోర్టికో దగ్గర్నుంచి పిచ్చి కేకలు వినిపించాయి.

గబగబా బాల్కనీలోకి పరుగెత్తి, కిందకు చూశాడు చక్రవర్తి.

అక్కడ లాన్స్‌లో మొక్కల్లో పడిపోయిన కిష్టయ్య ప్రయత్నపూర్వకంగా లేచి, పట్టేసిన నడుంమీద చెయ్యిపెట్టుకుని, యింకా ప్రయత్నిద్దామని గేటువైపు పరిగెట్టబోతున్నాడు.

బాల్కనీలో లైటువేసి, "ఏమిటి కిష్టయ్యా! ఏం జరిగిందీ? " అని అరిచాడు చక్రవర్తి గాభరాగా.

"కోతి బాబూ- రాక్షసకోతి. అమ్మగారి కేకలు వినిపించాయి గదా. ఉలిక్కిపడి లేచి చూస్తే కోతి కిందకి దూకి, యిటు పరుగెత్తుకు వచ్చింది. అడ్డుకుందామని వస్తే నన్ను అమాంతం రెండుచేతుల్తో ఎత్తి మొక్కల్లోకి విసిరేసి గోడదూకి పారిపోయింది" అని జవాబిచ్చాడు కిష్టయ్య.

"ముందు నువ్వు జాగర్త, అసలు నువ్వు పైకివచ్చేయి" అని పిలిచాడు చక్రవర్తి. కిష్టయ్య కుంటుకుంటూ లోపలికి వస్తున్నాడు.

అప్పుడు "క్యా మాలిక్! క్యాహువా" అంటూ వాచ్‌మన్ కళ్లు నులుముకుంటూ పరుగెత్తుకొచ్చి, చక్రవర్తికి సెల్యూట్ చేశాడు.

"ఇడియట్. సోరై క్యా తుమ్. ఐసాహీ కర రహాహై క్యా తుమ్ డ్యూటీ? " అని కసుర్తూ తిట్టాడు చక్రవర్తి.

"సారీ సాబ్" అని తలదించుకున్నాడు వాచ్‌మన్.

వెనకనే వచ్చిన ఇంద్రాణి యింకా భయం తగ్గక, భర్త జబ్బుమీద వాలింది. "కలత నిద్రలో వున్నానండీ. మీరు భోజనం చెయ్యలేదూ, నిద్ర పోవడంలేదూ అని ఆలోచిస్తుంటే నిద్రపట్టడంలేదు. ఇంతలో కిటికీ దగ్గర సన్నగా కిచకిచలు వినిపించాయి. కళ్లు బలవంతంగా తెరచి చూద్దును గదా, చెయ్యెత్తు ఆకారంలో పెద్దకోతి భయంకరంగా లోపలకి చూస్తూ. పైప్రాణాలు పైనే పోయాయి"

ఆమెను ఓదార్చుతూ సోఫాలో కూర్చోబెట్టాడు చక్రవర్తి. మళ్ళీ బాల్కనీలోకి వెళ్లి, బయట వీధిలోకి కనుచూపు ఆనినంత మేర దృష్టి సారించాడు గాని, ఏమీ కనబ

డలేదు. కానీ పక్కనున్న దీనబంధు గది లోంచి ఎవర్లో ఆకారం తాలూకు నీడ బయట చెట్టుమీద పడ్తోంది.

గబగబా దీనబంధు రూము దగ్గరకు పరుగెత్తి, తలుపు వేసి వుండడంతో కిటికీ లోంచి లోపలకి చూశాడు. బెడ్‌లైట్ వెలు తుర్లో దీనబంధు కనిపిస్తున్నాడు వీధిలోకి చూస్తూ. తాపీగా సిగరెట్ కాలుస్తూ, ఏదో తీవ్రంగా ఆలోచిస్తూ. అతని మంచం ఖాళీగా వుంది. పక్కమంచంమీద కన్న బాబు గుర్రుపెట్టి నిద్రపోతున్నాడు.

మతిపోయినట్లయ్యింది చక్రవర్తికి.

ఇంట్లో ఇంతగా అరుపులు పెడబొబ్బ లతో గోల జరుగుతుంటే దీనబంధు ఇంత తాపీగా ఎలా వున్నాడు? ! బయటకి ఎందుకు పరుగుపెట్టుకురాలేదు? !

తలుపు తడదామా అనిపించింది.

కాని, ఆ ప్రయత్నాన్ని విరమించుకు న్నాడు చక్రవర్తి.

వెనక్కి వచ్చేశాడు.

భార్యని తీసుకుని, కిష్టయ్యదగ్గరకెళ్ళి, జాగర్తలు చెప్పి, బెడ్‌రూంలోకి నడిచాడు.

పోలీసులకి ఫోనుచేసి, జరిగింది చెప్పి, తన ఏరియాలో వెతికే ప్రయత్నం చేయ మని, కోతి దొరకవచ్చు అని సలహా ఇచ్చి తీవ్రంగా ఆలోచిస్తూ మంచంమీద వాలాడు.

తెల్లవారింది.

న్యూస్‌పేపర్లని చూస్తుంటే తల కొట్టేసిన ట్లయ్యింది చక్రవర్తికి.

"మేయర్ ఇంట్లోనే రాజసం ఒలకబోసిన రాక్షసకోతి"

"మేయర్ కళ్ళముందే వింతకోతి విన్యా సాలు"

రాత్రి తన ఇంట్లోకి భయంకర కోతి వచ్చి వెళ్ళినట్లు పేపర్లకి యెక్కేసింది. పేపర్లు అమ్ముడవడానికి సంచలనం కలిగించే విధా నంలో వర్ణనలతో పేపర్లనిండా ప్రధాన వార్తలు.

చక్రవర్తికి నేలమీద కాలు నిలవడంలేదు.

"ఏవిటిది బావగారూ, ఈ పేపర్లిలా రాస్తున్నాయి? రాత్రి మనింట్లోకి రాక్షసకోతి వచ్చిందని రాస్తారేమిటి? రాస్కెల్స్ మిమ్మల్ని జనంలో నవ్వులపాలు చేయాలని కావాలని ఎవరో ఇలాంటి తప్పుడు న్యూస్ ఇచ్చుంటారు. అయితే మాత్రం నిజానిజాలు తెలుసుకోకుండా ఇలాంటి వార్తలు. లాయ ర్‌గారికి ఫోను చేస్తాను. డామేజీ కేసు పడేద్దాం" అంటూ ఆవేశపడ్తూ, ఫోను అందుకున్నాడు దీనబంధు.

"వద్దు, ఏ కేసులూ వద్దు"

"అదేమిటి బావగారూ, మీనింగ్‌లెస్ న్యూస్"

"కాదు మీనింగ్‌ఫుల్ న్యూసే! రాత్రి మనింటికి కోతి వచ్చింది!" నిబ్బరంగా అన్నాడు చక్రవర్తి.

దిగ్గున లేచి నిల్చున్నాడు దీనబంధు!

"ఏమిటి మీరనేది!! రాత్రి... మనింటికి... రాక్షసకోతి వచ్చిందా? నేను ఇంటి దగ్గరే వున్నానుగా, నాకెందుకు తెలియదూ? " ఆశ్చర్యపోతూ, కంగారుగా అడిగాడు.

"నిన్ను డిస్టర్బ్ చెయ్యడం ఎందుకని ఎవ్వరం చెప్పలేదు" చూపులు పక్కకు తిప్పు కున్నాడు చక్రవర్తి.

"అరె వింతగా వుందే! చీమ చిటుక్కు మన్నా మెలకువ వస్తుంది నాకు. అందులో ఈ కోతి గొడవ ప్రారంభమయినప్ప ట్నుంచీ, మీరు పడ్తూన్న మథనని చూడ లేక, మీకు ఏక్షణంలో ఏం అవసరం వస్తుం దోనని ఒంటి కంటితోనే నిద్రపోతున్నాను. అలాంటిది... నాకు తెలియకపోవడం, పేప ర్లకి కూడా ఎక్కేయడం, అవునూ న్యూస్ వీళ్ళదాకా ఎలా వెళ్ళిందీ? !"

"రాత్రి నేనే పోలీసులకి తెలియజేశాను. నేచురల్లీ క్రైమ్ అండ్ థ్రిల్లింగ్ న్యూస్ వాళ్ళ నుంచి సులభంగానే న్యూస్‌పేపర్స్‌కి అందు తుంది కదా!" అంటూ, "చదువు. నా పరు వుని ఎంత పెంచే విధంగా పత్రికలు రా

శాయో? " అని, చరచరా లోపలకి వెళ్లిపోయాడు చక్రవర్తి.

స్థిమితంగా కూర్చుని, తాపీగా పేపర్లు అందుకున్నాడు దీనబంధు.

లోపల గదిలోకి వస్తున్న చక్రవర్తికి రెండు చేతుల్లో కాఫీ కప్పులతో ఎదురు వచ్చింది ఇంద్రాణి, "కాఫీ తీసుకోండి" అంటూ.

"అదొక్కటే తక్కువ. వద్దు" అంటూ అక్కడున్న కుర్చీలో కూలబడ్డాడు చక్రవర్తి.

"ఏమండీ, ఏవిటిదీ! పొద్దున్నే కాఫీ ఇవ్వకపోతే చిర్రుబుర్రులాడే మీరు వద్దంటారేమిటీ? "

"పరువు పేపర్లకెక్కాక యింకా కాఫీ తాగే అర్హతకూడా వుందా నాకు" తననితాను కించపరుచుకుంటూ, తల వంచుకున్నాడు చక్రవర్తి.

"అంతమాటనకండీ పోనీ పాలు తీసుకురానా? "

"పరువు గంగపాలు అయ్యిందిగా, చాలదూ? "

చాలా ఆందోళన చెందింది ఇంద్రాణి. "ఏమిటండిదీ? ! మీ గురించి మేం ఎంత ఆందోళనపడ్తున్నామో ఆలోచించరేం? " అంది రోషంగా.

అదే సమయంలో పేపర్లు బల్లమీద పడేసి, లోపలికొచ్చాడు దీనబంధు.

"నా గురించి కాదు ఇంద్రాణీ, గుండెలు బద్దలయి ఏడుస్తున్న కేశవరావుగారిలాంటి వాళ్లని గురించి ఆందోళనపడాలి, ఏడవాలి. చావడానిక్కూడా సిద్ధపడాలి" దుఃఖంతో కూడిన ఆవేశం కట్టలు తెంచుకుంది చక్రవర్తిలో.

ఇంద్రాణి బేలగా తమ్ముడివైపు చూసింది.

దీనబంధు ఆమెకు ధైర్యం కలిగిస్తూ నయనాభినయం చేసి, రెండు కాఫీ కప్పులని అందుకుని, "రాజకీయవాదులు సమస్యలొచ్చినప్పుడు మరింత బలాన్ని పుంజుకోవాలిగాని, ఇలా నీరసించిపోకూడదు బావగారూ! ఇంద కాఫీ తీసుకోండి. ఇది మీ ఒక్క మెదడుతో ఆలోచించాల్సిన సమస్య కాదు కదా" అన్నాడు.

అతని చేతిని దూరంగా నెడుతూ, "ఆ కోతికి కూడా నేను లోకువ అయిపోయానయ్యా, పదిమందిలో నా పరువు తీయడానికే నా యింటికొచ్చి నన్ను వెక్కిరించి వెళ్ళింది. కేవలం నన్ను రెచ్చగొట్టి, మానసికంగా దెబ్బ కొట్టడానికే అది రాత్రి నా ఇంటికి వచ్చినట్లుంది. లేకపోతే ఎవరో ఒకర్ని గాయపరచి వుండేది కదా. అడ్డొచ్చిన కిష్టయ్యనీ ఏమీ చెయ్యకుండా కేవలం పక్కకు నెట్టి వెళ్ళిపోయిందంటే అందరిచేత నామీద రాళ్లు వేయించాలన్న కోతిబుద్ధి దానికీ కలిగిందేమో" అన్నాడు ఉక్రోషంగా.

"చఛఛ ఏమిటి బావగారీ మాటలు. అది ఎవర్నీ గాయపరచకుండా వెళ్ళిపోయినందుకు సంతోషించాలిగానీ, ఈ విపరీత అర్థాలు దేనికి? కాఫీ తీసుకోండి"

"నాకేం వద్దన్నాగా...

"సింహంలా నిలబడాలిగాని, మీరే ఇలా కూలబడిపోతే యెలా? అయినా అన్ని విషయాలూ చూసుకోవడానికి రామబంటులా నేనున్నాగా. మీరు హాయిగా విశ్రాంతి తీసుకోండి బావగారూ, ప్లీజ్" బతిమలాడాడు దీనబంధు.

ఫోను మోగింది.

"చక్రవర్తి హియర్"

"నమస్కారం మేయర్‌గారూ" చింతలనాయుడు.

రెండుక్షణాలు మౌనంగా వుండిపోయాడు చక్రవర్తి, తర్వాత మాటలు అటు నుంచి ఎలా వొస్తాయా అని ఆలోచిస్తూ

"నమస్కారం అన్నాను మేయర్‌గారూ. ప్రతి నమస్కారానికి అర్హుడ్నికానా? " గొంతులో వ్యంగ్యం.

"నమస్కారం చింతల నాయుడుగారూ. చెప్పండి"

"చెప్పడానికేముంది మేయరుగారూ!

మీరు గొప్ప మాయలమరారీలా వున్నారే. వాడు కుక్కని ఆడించినట్లు మీరు కోతిని ఆడిస్తున్నారు. ఊర్నంతా కంగారుపెడ్తున్న కోతిచేత మీ ఇంటి ముంగిటే మొగ్గలువే యించార్ట" నవ్వాడు.

"... ... ..."

"మీకు కోపంవచ్చినట్లుంది. రామరామ నా మాటలు కావండీబాబూ అవి, నలుగురూ అనుకుంటున్నవి"

"... ... ..."

"కోపం తెప్పిస్తే క్షంతవ్యుడ్ని. పదవి, పలుకుబడి వున్నవాళ్లు. ఎన్ని వింతలైనా సృష్టిస్తారు. అష్టకష్టాలుపడేది అమాయక ప్రజలేకదా, మీదేం పోయిందీ... ఏమంటారు? "

".........."

"సరే అయితే వుంటాను. ఏకపాత్రాభినయం చాలా కష్టంగా వుంది"

ఫోను పెట్టేశాడు చింతలనాయుడు. పెట్టేస్తూ సన్నగా నవ్విన నవ్వు మరీ ఇబ్బందికరంగా అనిపించింది చక్రవర్తికి.

యాంత్రికంగా రిసీవర్ని దించి, బొమ్మలా కళ్లప్పగించి కూర్చుండిపోయాడు చక్రవర్తి.

"ఏమిటి బావగారూ, ఏవంటాడు చింతల నాయుడూ? " అనడిగాడు దీనబంధు.

జవాబు చెప్పకుండా నేలచూపులు చూస్తూ, గోపల్నుంచి తన్నుకొస్తున్న బాధని కింద పెదవిని కొరుక్కోవడం ద్వారా ఆపాడు చక్రవర్తి. ముక్కుపుటాలు అదురుతున్నాయి. కనురెప్పలు వాలాయి.

భర్త అవమానంతో బాధపడుతున్నాడని, దుఃఖాన్ని ఆపుకోవడానికి ప్రయత్నిస్తున్నాడని గ్రహించిన ఇంద్రాణి మరింత బాధపడిపోయింది. "ఏమిటండిదీ... కొన్ని లక్షల ప్రజలకి మీరు ఆరాధ్యదైవంలాంటివారు. ఈ చింతలనాయుళ్లు, ఎవరో పుల్లాయిలూ వీళ్లా మీరు పట్టించుకోవలసినవాళ్లు? చాల్లెండి ఇంకేం ఆలోచించక, టిఫిన్ చేసి పనిచూసుకోండి హాయిగా. సమస్య అంటారా, దేనికయినా సమయం రావాలి కదా? " అంది 'కరణేషుమంత్రి' హోదాలో

"అవును బావగారూ. అన్నీ నేను చూసుకుంటాను, మీరు హాయిగా విశ్రాంతి తీసుకోండి" అన్నాడు దీనబంధు.

"అవును, ఇంక ఈ రోజు ఆ కోతిమాట మరచిపోయి, చక్కగా విశ్రాంతి తీసుకోవలసిందే మీరు" అంది ఇంద్రాణి ఖచ్చితంగా.

"విశ్రాంతి" అంటూ నవ్వి, తల తాటిస్తూ, "నిజమే! చాలా మంచిమాట చెప్పారు. చేతకానివాడు తీసుకోవలసింది విశ్రాంతే! ఇంతటి ఘోరాలు జరుగుతున్నా అరికట్టలేకపోతున్న నావంటి అసమర్థుడు తీసుకోవలసిందీ విశ్రాంతే! ఈరోజే నా మేయర్ పోస్టుకి రాజీనామా ఇచ్చేస్తున్నాను" నిశ్చయంగా అంటూ, నిటారుగా లేచాడు చక్రవర్తి.

తెల్లబోయారిద్దరూ ఆయన మాటలకి.

కంగారుపడిపోయారు.

"ఏమిటండీ మీరంటున్నదీ? " అనడిగింది ఇంద్రాణి మతిపోయినట్లయి.

"నేను ఈరోజు నా మేయర్ పదవికి రాజీనామా యిచ్చేస్తున్నాను" ఒత్తిఒత్తి పలికాడు చక్రవర్తి అది తన తుది నిర్ణయంగా.

"అయ్యో... అయ్యో... మీకేమయినా పిచ్చిపట్టిందా? దెయ్యం పట్టిందా? అసలింతటి మెత్తని మనసున్న మీరు ఈ రాజకీయాల్లోకి ఎందుకు దిగారండీ? " నొసట అరిచేత్తో చరుచుకుంటూ అరిచింది ఇంద్రాణి.

"ఖర్మకొద్దీ" అని జవాబిచ్చాడు చక్రవర్తి.

"ఏమిటి బావగారిదీ? చేతులూ, కాళ్లూ పట్టుకు గుంజేస్తున్నా, మొహాన కాండ్రించి వుమ్మేస్తున్నా, చొక్కా, పంచె చింపేస్తున్నా, కుర్చీ కౌగిలింతలోనే అమరసౌఖ్యాలనుభవిస్తున్న నాయకులున్న ఈ రోజుల్లో మీరేమిటి, గాంధీగారి కాలంనాటి మాటలు మాట్లాడతారూ? ! చూద్దాం పోలీసుడిపార్టమెంటు తీవ్రంగానే గాలిస్తోంది కదా. వాళ్ల వల్ల కాదని తేలిపోతే నా బలగంతో నేనే రాత్రుళ్లు గస్తీ తిరగడానికి రంగప్రవేశం చేసి

ఆ రాక్షస కోతి అంతు చూస్తా" అన్నాడు దీనబంధు.

"ఇంక మాటలతో ఏం ప్రయోజనం లేదు. నా నిర్ణయం మారదు" అని, లేచి తన గదిలోకి విసురుగా వెళ్ళిపోయాడు చక్రవర్తి.

"అయ్యో అయ్యో" అంటూ వెనకనే వెళ్ళింది ఇంద్రాణి.

డెబిట్, క్రెడిట్‌లు బేరీజు వేసుకుంటూ, సాలోచనగా కాఫీ సిప్ చేయసాగాడు దీనబంధు.

★ ★ ★

చక్రవర్తి మేయర్ పదవికి రాజీనామా ఇవ్వబోతున్నాడన్న వార్త దావానలంలా నగరమంతా వ్యాపించింది. జనం చలించిపోయారు. కళ్యాణ చక్రవర్తి లాంటి వ్యక్తి మేయర్ అయితే నగరం బాగుపడుతుందని కదా ఎంతో ఆశతో, నమ్మకంతో గెలిపించిందీ?! ఇప్పుడాయన ఇలా అర్థాంతరంగా బాధ్యతలనుంచి తప్పుకుంటే నగరం నట్టేట ములిగిపోదూ?!

తన ఛేంబర్‌లో తలపట్టుకుని కూర్చుని వున్నాడు చక్రవర్తి.

ఇంకా ఆయన రాజీనామాపత్రం యివ్వనే లేదు. అప్పుడే ఆయన నిర్ణయం ఆ నోట ఆనోట ఆఫీసు గోడలు దాటి వీధివీధి, సందుసందూ పాకిపోయింది.

జనం తండోపతండాలుగా బయల్దేరి వచ్చి ఆఫీసుని చుట్టు ముడుతున్నారు స్లోగన్ల సాయంతో.

"కళ్యాణచక్రవర్తిగారూ! రాజీనామా ఉపసంహరించుకోవాలి"

"రాజీనామా, సమస్యకి పరిష్కారం కాదు"

"మా నాయకుడు కళ్యాణచక్రవర్తిగారే"

అంటూ అభిమానాన్ని స్లోగన్ల రూపంలో గొంతులు చిరిగిపోయేలా నినదిస్తూ చాటసాగారు.

కొందరయితే చౌరాస్తాలలో బైఠాయించి "చక్రవర్తిగారు రాజీనామా వుపసంహరించుకునేంత వరకూ ధర్నాలు, రాస్తారోకోలు జరుపుతాం. నగర పౌర జీవితాన్ని స్థంభింపజేస్తాం" అంటూ రెచ్చిపోసాగారు.

పోలీసుడిపార్ట్‌మెంటుకి ఇప్పుడు కొత్త సమస్య ఎదురయ్యింది.

తప్పనిసరయి, ముందు బతిమాలి, చివరకి విధిలేక 'విధినిర్వహణ' కోసం బలప్రయోగంతో చౌరాస్తాలలో బైఠాయించిన వాళ్లని పోలీసు వ్యానుల్లోకి ఎక్కించి తీసుకువెళ్తుంటే "అసలు చేతగానితనం పోలీసులది. చక్రవర్తి అన్యాయంగా బలయిపోతున్నారు. నగరపోలీసు కమీషనరు రాజీనామా చేయాలి. మేయర్ కాదు" అంటూ అక్కడున్న జనం స్లోగన్లు యివ్వసాగారు.

కొందరయితే పోలీసులతో "దమ్ములుంటే రాక్షసకోతిని పట్టుకుని లాకప్‌లో పెట్టండి. అమాయక ప్రజల్ని కాదు" అంటూ ఛాలెంజ్ విసురుతున్నారు.

ఈ వార్తలు చక్రవర్తికి అందాయి.

కానీ అతని మనసు కుదుటపడలేదు.

ఆత్మన్యూనతాభావం అధికమైపోతోంది. ఈ సమస్యని తక్షణమే పరిష్కరించి, ప్రజలకు ఊరట కలిగించే సమర్థుడయిన వ్యక్తి తనసీట్లో కూర్చోవాలి అనిపిస్తోంది.

రాజీనామా పత్రం చేతబట్టి, లేచి నిలబడ్డాడు.

పెర్సనల్ సెక్రటరీ వచ్చి "పోలీస్ కమీషనర్ వచ్చారు సర్" అన్నాడు.

పత్రాన్ని టేబుల్‌మీదుంచి "పంపించండి" అంటూ, తనూ గుమ్మం వరకూ నడిచి, గుమ్మం బయట నిలబడ్డాడు. పోలీసుకమీషనర్, మునిసిపల్ కమీషనర్ ఇద్దరూ తీవ్రంగా చర్చించుకుంటూ వస్తున్నారు.

"రండి" అంటూ లోపలకి ఆహ్వానిస్తూ చేయి చూపించి, తన కుర్చీవైపు నడిచాడు చక్రవర్తి.

కమీషనర్లిద్దరూ లోపలకి వచ్చారు.

ఇద్దరికీ చేతులు జోడించాడు చక్రవర్తి. అప్పుడే అందులో 'ఇంక నాకు శలవు' అన్న

అర్థం కనబడుతోంది.

"మేయర్‌గారూ- ముందు మీ కుర్చీలో కూర్చోండి" అన్నాడు మునిసిపల్ కమీషనర్.

"ఆ కుర్చీలో కూర్చునే వుండండి- మీరు ఈ నగరంకోసం సాధించాలనుకున్నవన్నీ సాధించేవరకు, ఈ నగరప్రజలు మీనుంచి ఆశించింది పొందేవరకు" అన్నాడు పోలీసు కమీషనర్, నవ్వు ముఖంతో.

"లేదండీ, ఈ కుర్చీకి నాకూ రుణం తీరిపోయిందండీ" అన్నాడు చక్రవర్తి.

"ఏమిటీ... వారం రోజులకే? ! భలేవారే సర్. ప్లీజ్ కూర్చోండి. మేమిద్దరం కొత్త వ్యూహాలు ప్లాన్ చేస్తున్నాం. మేము ఇద్దరం కూడా మీ అంతటి సెన్సిటివ్ పెర్సన్స్‌మి కాదు కూడా. కఠినమైన నిర్ణయాలు తీసుకుని, వలపన్ని ఆ రాక్షసకోతి సమస్యని రూపుమాపుతాం. సర్- మీరేం యింక ఆలోచించొద్దు. పీస్‌ఫుల్‌గా వుండండి. చాలు! ఆ మేయర్ కుర్చీలో ఇంక ఎవరూ కూర్చోవడానికి ఈ నగరప్రజలు అంగీకరించరు. దయచేసి, మామీద నమ్మకం వుంచి, రాజీనామా ఆలోచన విరమించుకోండి" రెండు చేతులూ జోడించి, రిక్వెస్టు చేశాడు మునిసిపల్ కమీషనర్.

ఫార్మాలిటీకోసం జరుగుతున్న తతంగంగా భావించి, చక్రవర్తి తల అడ్డంగా వూపుతూ, రెండుచేతులూ తనూ జోడించి, 'క్షమించాలి' అన్నాడు.

మునిసిపల్ కమీషనర్ నిరాశపడ్డాడు.

తన ప్రయత్నంగా పోలీసుకమీషనర్ అందుకున్నాడు, "అది కాదు సర్- మా గురించి కూడా ఆలోచించాలి మీరు. ఈ సమస్య తీర్చవలసిన బాధ్యత మన అందరి మీదా వుంది కదా. మేము కూడా మీలాగే దారి తోచక సతమతమవుతున్నాం కదా. అయితే, మీ అంత సెన్సిటివ్ కాకపోవడంతో ప్రయత్నాల మీదే దృష్టిసారిస్తున్నాం. ఇప్పుడు మీరు రిజైన్ చేస్తే ఆ ఇంపాక్ట్ మామీద కూడా పడుతుంది. ఇంకొకటి కేవలం రాజకీయంగా గెలిచిన నగరమేయర్ కాదు మీరు. మొదట్నుంచీ ప్రజాసేవలోవుండి, అందరి అభిమానాన్ని సంపాదించుకున్న ప్రజానాయకులు మీరు. ఈ విషయంలో మనసు పాడుచేసుకుని మీరిలా రాజీనామా చేసేస్తే జనం వూరుకోరు. ఇప్పటికే సిటీలో గొడవ మొదలయ్యింది. రాస్తారోకోలు, ధర్నాలు ప్రారంభమయ్యాయి. కాలం గడుస్తున్న కొద్దీ తీవ్రతరం అవుతాయి. కంట్రోల్ చేయడం కష్టతరం అవుతుంది మాకు. మేం తప్పనిసరయి బలప్రయోగానికి దిగడం, వాళ్లకీ, మా వాళ్లకీ దెబ్బలు తగలడం, అరెస్టులూ, ఆస్తి నష్టాలు, జనజీవనానికి ఇబ్బందీ, ఎట్సెట్రా ఎట్సెట్రా. మీకు తెలియనివికావు. సాహసించి చెప్పాలంటే ఈ రాజీనామాతో మీరు ఇటు మా ఇద్దర్నీ, అటు మీ అభిమాన పౌరుల్ని ఇబ్బంది పెట్టిన వారవుతారు. క్షమించాలి... ఇలా అంటున్నందుకు. దయచేసి ఈ నిర్ణయాన్ని మార్చుకోండి. ప్లీజ్" చేతులు జోడించాడు.

టేబుల్‌మీద రెండు చేతులూ ఆన్చుకుని, తలవంచుకుని, కళ్లు గట్టిగా మూసుకుని, రెండు నిముషాలు ఏమీ మాట్లాడలేదు చక్రవర్తి. నెమ్మదిగా తలెత్తి. "అంతరాత్మ నా గుండెల్ని తూట్లు పొడుస్తోంది. ఈ విషయంలో నా నిర్ణయాన్ని నన్ను తీసుకోనిస్తే, మీకు రుణపడి వుంటాను" అన్నాడు కళ్లు తెరవకుండానే, వేడి నిట్టూర్పుల సాయంతో.

ఇంకేం మాట్లాడలేదు కమీషనర్లిద్దరూ.

మాట్లాడ్డం పద్ధతి కాదనిపించింది.

అలా వదిలిపెడ్తే, ఆయన మనస్సు మారినా మారొచ్చు అన్న ఆశ జనించింది.

"నమస్తే సర్" అని మాత్రం ఇద్దరూ ఛాంబర్ బయటకు వెళ్ళిపోయారు.

చక్రవర్తి అలాగే చలనంలేకుండా అయిదు నిమిషాలు వుండిపోయాడు.

మనుసు కుదుటపడలేదు
రాజీనామా యివ్వడానికే నిశ్చయించుకున్నాడు.

★ ★ ★

కన్నబాబు కాలేజి ఎలెక్షన్స్ రేపే.
అందుకనే ఈరోజు ప్రచారం జోరు పెంచాడు.
ముగ్ధ అంతిమయాత్రలో ముఖ్యపాత్ర వహించడం బాగా పనికొచ్చింది. ఆమె అంటే ప్రాణం యిచ్చే మిత్రబృందం, తన 'సోషల్ వర్క్'నచ్చిన అనేక మంది స్టూడెంట్లు ఇప్పుడు తనవైపు మొగ్గుతున్నారు. తన గెలుపు దాదాపు ఖాయం. మేయర్‌గారబ్బాయితో స్నేహం లాభదాయకం, సోషల్ స్టేటస్ కూడా అని భావిస్తున్న తన గ్యాంగ్ కుర్రాళ్లయితే మరీ రెచ్చిపోయి ప్రచారం చేస్తున్నారు. పాటలు పాడుతున్నారు, డాన్సులు చేస్తున్నారు. గోడలమీద, రోడ్లమీద సున్నంతో, రంగురంగు సుద్దలతో తనకి ఓటెయ్యమని ఆకర్షణీయమయిన అక్షరాలతో, స్లోగన్లతో రాసి అందర్నీ ఆకర్షిస్తున్నారు.
దాదాపు ఖాయమయిన విజయాన్ని తలుచుకుంటూ, కన్నబాబు కార్లో తన్నిపెట్టుకు కూర్చున్నవాడల్లా, తండ్రి రాజీనామా చేస్తున్న వార్త విని అదిరిపడ్డాడు. తనొక్కసారిగా పాతాళంలోకి జారిపోతున్నట్లుగా అనిపించింది. ఆయనకి అంగీకారం కాకపోయినా, ఆయనకి తెలియకుండా ఆయన పరపతిని తను 'క్యాష్' చేసుకుంటూనే వున్నాడు. కాని ఇప్పుడు ఆయన దిగిపోతే? ' ఈ 'ఇంపాక్ట్' రేపు తన ఎలక్షన్ల మీద పడ్తే తండ్రి మనోవ్యథతో అంతటి మేయర్ పదవికి రాజీనామా చేస్తే, ఈ పండితపుత్రుడు చీమకుట్టినట్లయినా బాధపడకుండా, తన ఆనందంలో తను మునిగివున్నాడని స్టూడెంట్సు ఈసడించుకుని, రేపటి ఎలక్షన్లలో తనని ముంచేస్తే... హమ్మో.

★ ★ ★

నంది బలవంతాన తాగుడు మానేసిన దేవదాసులా తయారయ్యాడు. తల దువ్వుకోలేదు. నలిగిపోయిన బట్టలు మార్చుకోలేదు. ఓ శాలువా భుజాన వేళ్లాడేసుకుని, నగర వీధుల్లో తిరగసాగాడు.
ముగ్ధతో స్నేహం మరుపుకి రావడం లేదు. ఆమె చెంత వుంటే మండుటెండలో కూడా మలయమారుతాల హాయిని అనుభవించేవాడు తను. ఆమెతో కలిసి తిరుగుతున్న తనకి, తన మిత్రబృందానికీ కూడా అందర్లో గౌరవం పెరిగింది. ఆమె ఇచ్చిన ప్రోత్సాహంతో తను మంచి మంచి నాటకాలు వేశాడు. ఆమె ఇచ్చిన ప్రోత్సాహంతోనే తను చదువుమీద కూడా శ్రద్ధ చూపిస్తున్నాడు. ఆమెనుంచి నేర్చుకున్న మంచితనంతోనే తను పదిమందిలో భేష్ అనిపించుకుంటున్నాడు. తనకి తెలియకుండానే ఆమెవైపు ఆకర్షితుడయ్యాడు తను. ఆమెని ప్రేమించాడు తను. ఆమె లేని జీవితం శూన్యం అనిపిస్తోంది. ఎవ్వరితోనూ మాట్లాడాలనిపించడం లేదు. నాటకం వెయ్యాలనిపించడం లేదు. అన్నం తినాలనిపించడం లేదు.
పిచ్చివాడిలా తనలోతనే మాట్లాడుకుంటూ, కాళ్ళీడ్చుకుంటూ నడుస్తున్న నందికి అతని స్నేహితుడు ఎదురొచ్చాడు.
"నందీ! ఈ విషయం తెలుసా నీకు? మీ మామయ్య మేయర్ పోస్టుకి రాజీనామా ఇస్తున్నాట్ట!"
ప్రాన్పడిపోయాడు నంది!!
'రాజీనామా? తలతిరిగిపోయినట్లయింది నందికి. 'ముగ్ధతో సమానంగా తను ప్రేమించే వ్యక్తి మామయ్య. మామయ్యకీ తనంటే వాత్సల్యం, ప్రేమ వున్నాయి. ప్రజల్లో ఎంతో మంచి వ్యక్తి అని పేరున్న మామయ్య, నిజమైన ప్రజానాయకుడు మామయ్య రాజీనామా చెయ్యడమా! నోనో- వీల్లేదు. అడ్డుకుంటాను. అభ్యర్థిస్తాను.

కాళ్లు పట్టుకుంటాను. కన్నీళ్లు పెట్టుకు బతిమలాడుతాను. కాదనడు మామయ్య.

కదిలాడు నంది.

★ ★ ★

ఓ పక్కనుంచి అక్కగారి పోరు. మరో పక్క బావగారి రాజీనామా తన భవిష్యత్తుమీద ఎటువంటి ప్రభావం చూపుతుందన్న మెదడులోని హోరు, బయట బావగారిమీద. అభిమానుల జోరు దీనబంధుని కుదిపేస్తున్నాయి.

తను వెయ్యవలసిన నెక్స్టుస్టెప్పు ఏదో తేల్చుకోలేక సతమతమైపోతున్నాడు.

ఇతిహాసాల్లో, పురాణాల్లో చెప్పినట్లు 'రాజకీయంకన్నా మంచితనం గొప్పదా ఏమిటి కొంపదీసి' అనే అనుమానంతో కూడిన ప్రశ్న పొటమరించింది లోలోన.

తన గదిలోకిపోయి, మంచంమీద నిశ్చలంగా కూర్చుని, ఓ అరగంట అన్ని కోణాల్లోంచి ఆలోచించాడు.

'బావగారిని రాజీనామా చేయకుండా ఆపడమే ఉత్తమం. ఆ ప్రయత్నం అందర్నీ మించినదిగా తనది కనబడాలి' అనే నిర్ధారణకి వచ్చేశాడు.

ఇక మార్గం ఆలోచించాలి.

తన ముఖ్య అనుచరులందరికీ ఫోన్లు చేశాడు. బావగారి నిర్ణయం మీద రాజకీయవాదుల్లోనూ, ప్రజల్లోనూ, అధికారుల్లోనూ రియాక్షన్ ఎలా వుందని ప్రశ్నించాడు.

అందరూ దాదాపు ఒకే స్థాయిలో ఆయనచేత రాజీనామా ఉపసంహరించుకునేలా ప్రయత్నిస్తున్నారని విని, కలవరపడ్డాడు. తను ఆలస్యంచేసినందుకు ఆత్మనింద చేసుకున్నాడు.

'నాప్రయత్నం అందరిలోకీ విశేషంగా కనబడాలి!' నిర్ణయించుకున్నాడు.

★ ★ ★

రాజీనామా ఇవ్వడానికే తుది నిర్ణయం తీసుకున్న చక్రవర్తికి ముఖ్యమంత్రినుంచి పిలుపొచ్చింది.

రాజీనామా పత్రం దగ్గరుంచుకునే ఆయన దగ్గరకు వెళ్లాడు చక్రవర్తి.

సి.యం చిరునవ్వుతో సాదరంగా ఆహ్వానించాడు తన ఛాంబర్‌లోకి. చక్రవర్తి పెట్టిన నమస్కారానికి ప్రతిగా నమస్కరిస్తూ...

"చక్రవర్తిగారూ! రాజీనామా ఇవ్వాలని నిర్ణయించుకున్నారని తెలిసింది. చూడండి... బలవంతం చేస్తున్నాననుకోవద్దు. ప్రస్తుతం పార్టీ కొన్ని క్లిష్టమయిన సమస్యలతో సతమతమవుతోంది. అన్నీ బయటకు చెప్పదగ్గవికావు, అయినా చెప్పి మీ మనసుని మరింత చికాకుపరచడం నాకు ఇష్టంలేదు. ఇకపోతే, ఏ రాజకీయ పార్టీ అయినా, ఎంత గట్టి పునాది వున్నదయినా, రాజకీయం, దౌర్జన్యం సాగించగలిగిన పార్టీసభ్యులతోబాటు, ప్రజల్లో 'వాళ్ల మనిషి'గా పేరు తెచ్చుకున్న వ్యక్తుల్ని పార్టీ కలిగి వుంటేనే నాలుగు కాలాలపాటు బతకగలుగుతుంది. నిజానికి మా రాజకీయవాదులు సంవత్సరాలతరబడి గొంతుచించుకుని అరచి ప్రతిపక్ష నాయకులమీద బురద జల్లి, పార్టీకి తెచ్చే పేరు కంటే మీ వంటి ప్రజానాయకులు తెచ్చే మంచి పేరు పార్టీకి శ్రీరామ రక్షగా నిలుస్తుంది. మీవంటి వాళ్లకి ఇటువంటి సమస్యలు చికాకుని కలిగిస్తాయి, కాదనను. కానీ నిలబడాలి. మీకోసం కాకపోయినా పార్టీకోసం, ప్రజలకోసం నిలబడాలి. ప్లీజ్ మీ నిర్ణయం మార్చుకోండి. సి.యం.గా కాకుండా ఒక సోదరుడిగా రిక్వెస్టు చేస్తున్నాను... ప్లీజ్"

కనురెప్పలు వేయకుండా బొమ్మలా బిగుసుకుపోయి చూస్తున్నాడు చక్రవర్తి.

"అన్ని సమస్యల్నీ పెర్సనల్‌గా తీసుకుని, బాధపడే రోజులు కావివి. అందరిలాగే ఎవరిమీదకో బాధ్యతని నెట్టేసి, మీ సీటు పదిలంగా చూసుకోమని చెప్పడం లేదు నేను. నేను అన్నీ గమనిస్తూనే వుంటాను. మీలాంటి వాళ్లు ఇలాంటి సమస్యని తీర్చలేక

పోతున్నందుకు ఎంతగా కుమిలిపోతుం టారో నాకు తెలియదా? కానీ అంతగా మనసు పాడుచేసుకోకూడదు. సమయం రావాలి. సమస్య తీరుతుంది. ఇంకొన్ని బల గాలని దింపి, మరిన్ని గట్టి చర్యలు తీసుకో మని కమీషనర్లిద్దరికీ ఆదేశాలు ఇచ్చాను. కాబట్టి మీ ప్రయత్నం విరమించుకుని వెళ్ళి ప్రశాంతంగా పనిచేసుకోండి చక్రవర్తిగారూ"

యాంత్రికంగా నమస్కరించి వెనుతిరి గాడు చక్రవర్తి.

★ ★ ★

సి.యం. అలా చెప్పాక ఏమీ మాట్లాడ లేక వెనుతిరిగి బయట కొచ్చాడేగాని పోయి సీట్లో కూర్చోవాలి అనిపించక, నేరుగా ఇంటికి వచ్చేశాడు చక్రవర్తి. ఇప్పటికీ మనసు రాజీనామా ఇవ్వడానికే మొగ్గు చూపుతోంది. కానీ సి.యం.తో సహా యింతమంది శ్రేయోభిలాషులు 'వద్దు' అని చెబ్తూంటే, వినిపించుకోకపోవడం మొండి తనం కిందకు వస్తుందేమోనని సంశయం పీకుతోంది. కాని సమస్య అలా రావణకా ష్టంలా కాలుతూనే వుంటే, ఏమీ చెయ్యలేక పోవడం అసమర్ధతకాదా? సి.యం. చెప్పా రనో మరొకరు చెప్పారనో కాదు. అసలు ఈయనకే రాజీనామా చేసే వుద్దేశ్యం లేదు' అని చింతలనాయుడు ఎగతాళిచేయడూ?

ఎవరేం చెప్పినా వినకుండా రాజీనామా యిచ్చేస్తేనే బాగుంటుంది అనిపిస్తోంది చక్ర వర్తికి.

ఏం చెప్పి అతని ప్రయత్నాన్ని విరమింప జేయాలా అని మాటల్ని పోగుచేసుకుంటూ, అతనివైపే చూస్తూ కూర్చుని వున్నారు ఇంద్రాణి, దీనబంధు.

అదుగో అప్పుడొచ్చాడు ఇద్దరు అనుచరు లతో చింతలనాయుడు!

ఇంతగా తలబద్దలు కొట్టుకుంటున్న సమ యంలో చింతలనాయుడు నేరుగా తన ఇంటికే రావడం చాలా కోపాన్ని తెప్పిం చింది చక్రవర్తికి. అతనొక్క మాట ఎకసె క్కెంగా మాట్లాడినా, తీవ్రంగానే జవాబు ఇచ్చి, బయటకు పంపించాలనిపించింది.

"అయ్యా చక్రవర్తిగారూ నన్ను క్షమిం చాలి" రెండు చేతులూ జోడించి, తలవంచి వినమ్రంగా అన్నాడు చింతలనాయుడు.

యాంత్రికంగా మర్యాద కోసం కుర్చీ చూపించాడు చక్రవర్తి.

"లేదండి అర్థమయ్యింది! మీ ఎదురుగా కూర్చునే అర్హత నాకు లేదు అని అర్థమ య్యింది! ప్రత్యర్థిగా కాదు, మనిషిగా చెబ్తు న్నాను! ఇందులో రాజకీయం ఏమీలేదు. దయచేసి నన్ను నమ్మండి. మనస్ఫూర్తిగా చెబ్తున్నాను. మీలాంటి వ్యక్తిత్వమున్న రాజ కీయనాయకుడ్ని నా జన్మలో చూడలేదు. నలభై సంవత్సరాలక్రితం చిన్నప్పుడు లాల్ బహుదూర్‌శాస్త్రిగారి గురించి విన్నాను. ఇదుగో ఇప్పుడు ప్రత్యక్షంగా చూస్తున్నాను. కేవలం మీరు రాజీనామా నిర్ణయం తీసుకు న్నారని తెలిసినంతలోనే ఏమి రియాక్షనండి ప్రజల్లో. మీ పార్టీలో సరేసరి. మా పార్టీలో కూడా మీపట్ల విపరీతమైన గౌరవాభిమా నాలు పెరిగిపోయాయి. వ్యక్తిగతంగా సమ స్యని మీమీద వేసుకుని, పదవిని త్యాగంచే యవలసిన అవసరం లేకపోయినా మీరీని ర్ణయం తీసుకున్నారంటే, జోహార్ సర్! రాజ కీయం ఆలోచించినట్లయితే మీ తర్వాత మీ పార్టీలో గాని, మా పార్టీలోగాని ఎవ్వరూ మీ స్థానంలో కనీసం పట్టుమని రెండురో జులు కూడా కూర్చోలేరు. ప్రజలే మీతో పోల్చి ఆలోచించి, కుర్చీలోంచి లేపి, వీధిలోకి విసిరేస్తారు. రెండు చేతులెత్తి ప్రార్థిస్తు న్నాను సర్. ఇప్పుడున్న సమస్య ప్రజాస మస్య! రాజకీయ సమస్య కాదు! ప్రజాక్షేమం దృష్ట్యా మీరు మీ ఆలోచనని విరమించు కోండి! మమ్మల్ని తలెత్తుకు తిరిగేలా ఆశీర్వ దించండి! శలవు!" అని ఆయన జవాబు వినకుండా, కళ్ళు తుడుచుకుంటూ, బయటకు వెళ్ళిపోయాడు చింతలనాయుడు.

తెల్లబోయి బొమ్మలా చూస్తుండిపో

యాడు చక్రవర్తి!

ఇంద్రాణి 'ఇకనైనా మీరు వింటారా' అని ఆశగా చూస్తోంది.

తలతిరిగిపోయినట్లయ్యింది దీనబంధుకి. తనింక తాత్సారం చేస్తే, తనాశించే ప్రయోజనం ఏమాత్రం దక్కదనిపించింది. తొందరపడాలి... బావగారిచేత రాజీనామా విరమింపజేయడానికి అందరికంటే తన ప్రయత్నం గొప్పదిగా కనిపించాలి. అటు ప్రజలకీ, ఇటు బావగారికీ కూడా తను తిరుగులేని ఆప్తబంధువు అయిపోయే ప్రయోగం చేయాలి.

లేచాడు దీనబంధు, శస్త్రాస్త్రాలు చేత బూని.

"బావగారూ, వీళ్లందరూ సరే, మీ ఆత్మలో ఆత్మని నేను చెబ్తూన్న మాటలు కూడా గాలి మాటలు అనుకుంటున్నారు కదూ మీరు. సరే అయితే మీ నిర్ణయాన్ని ఒక్క రెండు రోజులు మాత్రం వాయిదా వేసుకోమని కోరుతున్నాను. ఈరోజునుంచీ నిద్రహారాలు ముట్టక, ఆ రాక్షసకోతిని పట్టుకునే ప్రయత్నంలో నేనుంటాను. ప్రయత్నం కాదిది. ఫలితాన్ని నూటికి నూరు పాళ్లూ సాధించే యజ్ఞం. ప్రతిజ్ఞచేస్తున్నాను. నేనెంతో భక్తి గౌరవాలతో కొలిచే మా బావగారు శ్రీశ్రీశ్రీ కళ్యాణచక్రవర్తిగారిమీద ప్రమాణంచేసి రెండురోజుల్లో ఆ భయంకర కోతిని పట్టుకోవడమో, తరిమెయ్యడమో, చంపెయ్యడమో చెయ్యకపోతే నేను, మెయిన్‌బజారు సెంటర్లో ఆత్మాహుతి చేసుకుంటాను! ఇవి మాటలు కావు ఇప్పుడే పత్రికా ప్రకటన యిస్తున్నాను" అంటూ ఆవేశంగా బయటకు వెళ్ళిపోయాడు దీనబంధు.

ర్మాన్పడిపోయాడు చక్రవర్తి!!

"అయ్యో అయ్యో తమ్ముడూ, తొందరపడి ఎటువంటి ప్రకటనలూ యివ్వొద్దు" అంటూ తమ్ముడి వెనకనే ఇంద్రాణి పరుగెత్తింది కాని, అప్పటికే అతని కారు బయటకు దూసుకుపోయింది.

ఆవిడకి ఉక్రోషం ఆగింది కాదు.

విసురుగా భర్త దగ్గరకు పరుగెత్తుకొచ్చి "ఏమండీ ఏమిటండీ పరిస్థితి? మీరింతగా డీలా పడిపోతూంటే చూడలేక మా తమ్ముడెంతటి నిర్ణయం తీసుకున్నాడో చూశారా? " అంది గొంతు ఒణుకుతుండగా. నెమ్మదిగా తేరుకుంటూ "ఇంద్రాణీ దీనబంధుకి నేనంటే ఎంత అభిమానం వుందో గ్రహించలేకపోయాను ఇంద్రాణీ" అన్నాడు.

సాధించడానికి అవకాశం దొరికిందావిడకి. అందులో ఉక్రోషంలో వుందేమో ఉండబట్టలేక కోపాన్ని కక్కేసింది. "అవును మరి ఎందుకు గ్రహిస్తారు? పనివాళ్ల పాటి చేయలేదు నేను, నా తమ్ముడూనూ. మీకు కొంచెం చెడ్డ పేరొచ్చినా, మీరు కొంచెం బాధ పడినా మా తమ్ముడు నిద్రాహారాలు మానేస్తాడు. మీకు ఏవిధంగా సహాయపడగలనా అనే ప్రతిక్షణం ఆలోచిస్తాడు. అటువంటి వాడ్ని మీరు ఓ గడ్డిపోచలా తీసిపారేస్తారు"

సానునయంగా అన్నాడు చక్రవర్తి, "లేదు ఇంద్రాణీ ఇప్పుడు తెలుసుకున్నాను నా కోసం ప్రాణం కూడా ఇవ్వడానికి దీనబంధు సిద్ధమేనని"

అవకాశాన్ని వినియోగించుకోదలచి ఇంకో మెట్టెక్కింది ఇంద్రాణి "అంతే చివరికి వాడలా ప్రాణాలు పోగొట్టుకోవలసిందే!"

"చఛ ఎంతమాట. నా రాజీనామా ప్రయత్నాన్ని విరమించుకుంటున్నాను. నీకు మాటిస్తున్నాను దీనబంధుకి ఎటువంటి ప్రాణ భయంలేదు. అత్యవసర సమావేశం ఏర్పరచి పోలీసు కమీషనర్లతో కూడా చర్చించి కోతిని పట్టుకునే ప్రయత్నాలు ముమ్మరం చేస్తాను" దృఢ చిత్తంతో వత్తి పలుకుతూ అన్నాడు చక్రవర్తి.

"ఏమండీ" అంటూ ఆనందంగా దగ్గరకొచ్చింది ఇంద్రాణి.

"అంతే కాదు దీనబంధు కోరినట్లు సమయం చూసుకుని అతని పేరుని అసెంబ్లీ సీటుకి రికమెండు చేస్తాను"

"ఏమండీ" అంది ఇంద్రాణి వెర్రి ఆనందంతో.

"మంచికి ఎప్పుడూ పెద్ద పీట వేస్తాను ఇంద్రాణీ! అసెంబ్లీసీటుకి అతన్ని నామినేట్ చేసేది నా ప్రయత్నాన్ని విరమింపజేసినందుకు కాదు. ప్రజా సమస్యని తీర్చడానికి ప్రాణ త్యాగానికి కూడా సిద్ధపడినందుకు. ప్రజాసేవ చేసే వ్యక్తి పాదసేవ చేయడానికి కూడా నేను సిద్ధమే ఇంద్రాణీ"

ఇంద్రాణి ఆనందానికి అవధులు లేవు.

భర్త రాజీనామా ప్రయత్నం విరమించుకున్నాడు.

తమ్ముడి కోర్కె నెరవేరబోతోంది.

"భగవంతుడా ఈ కోతి సమస్యని కూడా వెంటనే తీర్చు" అంటూ దేవుడికి నమస్కరిస్తూ భర్త గుండెల మీద వాలింది.

★ ★ ★

తమ్ముడికీ, చెల్లెలికీ అన్నం పెడ్తూ "అమ్మకి పూర్తిగా తగ్గిపోతుందర్రా. ఇంక రెండు మూడు రోజుల్లో అమ్మ ఇంటికి వచ్చేస్తుందీ" అన్నాడు ప్రకాశం.

అమ్మ రెండు మూడు రోజుల్లో ఇంటికి వచ్చేస్తుందనేసరికి పిల్లలకి హుషారు ఎక్కువ అయ్యింది. అమ్మ వచ్చాక ఆమెతో ఏవేం కబుర్లు చెప్పాలో, ఆవిడ చేత ఏవేం పిండివంటలు చేయించుకు తినాలో అప్పుడే ఆలోచించెయ్యసాగారు.

ఇంతలో-

"ప్రకాశం! ప్రకాశం! ఓసారి బయటకొస్తావా?" అంటూ పెద్ద కేకపెట్టాడు పక్కింటి రామ్మూర్తి.

ఆ కేకకి ఉలిక్కి పడ్డాడు ప్రకాశం.

ఏదో కీడుని శంకించాడు రామ్మూర్తి. ఎప్పుడూ అంత గట్టిగా అరవడుమరి. గాభరాగా బయటకు వచ్చాడు ప్రకాశం.

రామ్మూర్తి ముఖం జేవురించుకుని వుంది.

ప్రకాశం, "ఏవిటి రామ్మూర్తీ?" అన్నాడు గుండెలు చేతబట్టుకుని గాభరాగా.

"హాస్పిటల్ నుంచి ఫోనొచ్చింది. నువ్వెంటనే బయల్దేరు" అన్నాడు రామ్మూర్తి సీరియస్‌గా.

"ఏవయ్యింది అమ్మకి?" ప్రకాశం గొంతు వణికింది, "అమ్మకి అమ్మకెలా వుందీ?"

"చూద్దాం ముందు బయల్దేరు చెబ్తా"

"..." బొమ్మలా చూస్తూ, కళ్ళు మిటకరించి వుండి పోయాడు ప్రకాశం.

"చెబ్తున్నాగా బయల్దేరు. పిల్లలిద్దర్నీ మా ఇంట్లో దింపేసి బయల్దేరు"

శక్తి కూడగట్టుకున్నాడు ప్రకాశం. గబగబా ఆదరాబాదరా చొక్కా, ప్యాంటు తొడుక్కుని తమ్ముణ్ణి, చెల్లాయిని రామ్మూర్తి ఇంటిలో దిగబెట్టి, రామ్మూర్తితో బాటు ప్రయాణమయ్యాడు ప్రకాశం స్కూటర్ మీద.

అన్నయ్య గాభరాగా వెళ్ళడం, రామ్మూర్తి ముఖంలోని సీరియస్‌నెస్ అంతా కూడా కుర్రాళ్ళలో భయాన్ని సృష్టించింది. ఏదో జరగకూడనిదే జరిగినట్లుగా పసిగట్టి వాళ్ళిద్దరూ దగ్గర దగ్గరగా మౌనంగా, బిక్కచచ్చిపోయినట్లుగా, గోడకి జార్లపడి కూర్చున్నారు. రామ్మూర్తి భార్య పాలు కలిపిస్తే వద్దన్నారు. వాళ్ళిద్దరికీ ఏడవాలనుంది. తమ ఇల్లు కాదని కంట్రోలు చేసుకుంటున్నారు.

హాస్పిటల్‌కి చేరింది స్కూటర్.

స్టాండులో స్కూటర్ని పార్క్ చేశాడు రామ్మూర్తి.

గబగబా ఇద్దరూ హాస్పిటల్లోకి నడుస్తున్నారు. ఉన్నట్టుండి ఒక్కసారి రామ్మూర్తి తన చేతిని ప్రకాశం వీపుమీద వేసి నిమిరాడు. అతనలా చేయడంతో ప్రకాశానికి అనుమానం రూఢీ అయిపోయింది. లోపల్నుంచి తన్నుకొస్తున్న దుఃఖాన్ని మునిపంట నొక్కిపట్టాడు. ధైర్యం సడలిపోతోంది. తల్లి వున్న రూముకి జేరారిద్దరూ.

గుమ్మందగ్గర ఎదురుపడ్డ నర్సుని "మా అమ్మకి ఎలావుంది?" అని అడిగాడు

ప్రకాశం కొన ఆశతో.

ఆమె ఒక్కసారి అతని కళ్లల్లోకి చూసి ఏం చెప్పాలో పాలుపోక లోపలకి దారి చూపించింది.

పిడచ కడ్తున్న గుండెల్తో లోపలకి అడు గుపెట్టాడు ప్రకాశం.

రామ్మూర్తి అనుసరించాడు.

మంచం మీద తలదాకా తెల్లని దుప్పటి కప్పబడివుంది తల్లిమీద.

వణికే చేతుల్తో ముఖం మీది దుప్పటీని తొలిగించాడు ప్రకాశం. కనురెప్పలు మూసి వున్నాయి. నిద్రపోతున్నట్లుగా వుంది అమ్మ.

బొమ్మలా నిలబడి చూస్తున్నాడు ప్రకాశం.

అతన్నే గమనిస్తున్నాడు రామ్మూర్తి.

ఓసారి తల్లిని ఆపాద మస్తకం చూశాడు ప్రకాశం. ఆపైన చటుక్కున వేళ్లు ఆమె ముక్కు దగ్గర పెట్టి చూశాడు. ఆ తర్వాత ఆమె గుండెల మీద చేయి పెట్టి చూశాడు.

"రామ్మూర్తీ ఏమిటిదీ? " అన్నాడు నిద్రలో మాట్లాడుతున్నట్లు.

భయపడి పోయాడు రామ్మూర్తి.

ప్రకాశాన్ని కుదుపుతూ "ప్రకాశం" అన్నాడు రామ్మూర్తి.

ప్రకాశం తల అడ్డంగా ఆడిస్తూ. "అది కాదయ్యా, ఇలా జరిగిందేవిటీ? " అన్నాడు పొడిగా నవ్వి.

మతిపోతున్నట్లయ్యింది ప్రకాశం ప్రవర్త నకి రామ్మూర్తికి.

"మంచి ఖరీదయిన వైద్యం చేయించాను కదయ్యా మరి. ఎందుకు ఇలా..." అంటూ ఒక్కసారి బిగుసుకుపోయినట్లయి, "ఆం అర్థమయ్యింది! అర్థమైపోయింది! పాపిష్టి సొమ్ము. పాపిష్టి సొమ్ముతో నా తల్లికి వైద్యం చేయించాను. అందుకనే... అందు కనే. అంత డబ్బు ఖర్చు చేసినా మా అమ్మ దక్కలేదు. అమ్మా! అన్యాయపు సొమ్ముతో నీకు వైద్యం చేయించానమ్మా! పాపిష్టి డబ్బుతో వైద్యం చేయించానమ్మా అందుకే నాకీ శిక్ష" అంటూ బావురుమంటూ తల్లి మీద వాలిపోయాడు.

అతన్ని ఓదార్చడం రామ్మూర్తికి చాలా కష్టమయ్యింది.

★ ★ ★

"ఆల్ దిస్ సీమ్స్టుబి ఎ కేస్ ఆఫ్ మాస్ హిస్టీరియా అండ్ డెల్యూజన్. వాడ్డూ యూసే మిస్టర్ ఆనందరావు? " అన్నాడు కె.ఆర్.కస్తూరి. అసలు పేరు కస్తూరి కృష్ణారావు బొంబాయిలో మంచి సైకాల జిస్టు.

"ష్యూర్! ఐ అగ్రీవిత్యు" అన్నాడు ఆనందరావు ఢిల్లీలో గొప్ప పేరున్న సైకాల జిస్టు.

ఈ ఇద్దరు సైకాలజిస్టులు హైద్రాబాద్ లోని హోటల్ గ్రాండ్ కాకతీయలో జరుగు తున్న ఆల్ ఇండియా సైకాలజిస్టుల కాన్ఫ రెన్స్కి వచ్చారు. ఈవెనింగ్ లీజర్ టైములో బాల్కనీలో కూర్చుని, బ్లాక్ కాఫీ సిప్ చేస్తూ మాట్లాడుకుంటున్నారు.

"ముప్ఫయి ఏళ్ల క్రితం ఈ హైద్రాబా దులో 'పానీ ఆరా భాగో' అంటూ జనాన్ని భయంతో కుదిపేసిన సంఘటన జరిగింది మీకు గుర్తుందా? " అనడిగాడు ఆనంద రావు.

"లేదు, దాని గురించి ఏదో విన్నానుగాని వివరాలు తెలియవు. చిన్నప్పట్నుంచీ నేను బొంబాయిలోనే వుంటున్నానుకదా! మీకు తెలుసా ఆ కేసు? "

"ఆ..." అంటూ చెప్పనారంభించాడు ఆనందరావు. "అది పంతొమ్మిది వందల డెబ్బయి సెప్టెంబరు ఇరవై తారీఖు నాకు గుర్తున్నంతవరకు. సాయంత్రం అయిదు ఆరుమధ్య ఒక్కసారిగా పుకారులేచింది హైద్రాబాదు, సికిందరాబాదు నగరాల్లో గండిపేట తెగిపోయింది, నీరు మహా ప్రవా హంగా దూసుకువచ్చేస్తోంది, నగరం వదిలి పారిపోవాలి అని. ఇంక చూస్కోండి అసలే

ఆఫీసులొదిలిన వేళ, ఉద్యోగస్తులు, కూలీలు అందరూ ఇళ్లకు బయల్దేరిన వేళ. బజార్లు మంచి బిజీగా వున్న వేళ. ఇలా పుకారులే చేసరికి జనం గుండెల్లో రైళ్లు పరుగెత్తాయి. ఎటు పారిపోవాలో తెలియదు. ఎక్కడయితే సురక్షితంగా వుండొచ్చో తెలియదు. ఇంటి దగ్గర వాళ్లెలా వున్నారో బయటకు వెళ్లిన వాళ్లకు తెలియదు. బయటకెళ్లిన వాళ్ల పరిస్థితి ఏమిటో ఇంటి దగ్గర వాళ్లకు తెలియదు. సురక్షిత ప్రదేశానికి పారిపోదామన్నా ఒకళ్ల సమాచారం మరొకరికి తెలిసేదెలా? గండిపేటే కాదు ఇటు హుసేన్‌సాగర్ కట్ట, టాంక్‌బండ్ కూడా తెగిపోయింది అని మరో పుకారు. ఇటు పరుగులు పెడ్తూన్న వాళ్లు మళ్లీ వెనుతిరిగారు. కాని ఎటు పరుగెత్తాలి. రోడ్లన్నీ జనంతో నిండి వుండడంతో కార్లు, స్కూటర్లు నడిచే పరిస్థితిలేదు. స్వంత వాహనాన్ని రోడ్లమీద వదిలేసి పరుగు. ఇళ్లకు తాళాలు పెట్టి, కట్టుబట్టల్తో పరుగు. గమ్యం తెలియని పరుగు.

"ఎటు పరుగెడ్తున్నా అటునుంచి జనం అరుస్తూ ఏడుస్తూ పరుగెత్తుకు వస్తూండడంతో నీళ్లు అటు నుంచి ముంచుకొస్తున్నాయేమోనని భయం. దానికి తగ్గట్టు అనేక కట్టుకథలు భయంతో అసెంబ్లీ హాలు దగ్గర మోకాళ్ల వరకు మునిగిపోయేంత నీళ్లట. దోమలగూడాలో నిలువెత్తు నీళ్లట, మనిషి ఎత్తున కెరటాలుట... ఒకటేమిటి మేము నీటి కెరటాలుని చూశాం, మేము ఏట్లో కొట్టుకుపోతున్న వాళ్లని రక్షించాం.... నోటికొచ్చినట్లు... చెప్పెయ్యడమే.. భయంతో. నేనప్పుడు ఖైరతాబాదు ఏరియాలో వుండేవాడిని. వయసులో కుర్రవాడినయినా, మనలాంటి వాళ్లం కొంతయినా హేతువాదులం అప్పటికే కాబట్టి ఆలోచించసాగాను... ఎంత గండిపేట కట్ట తెగిపోయినా ఇంత దూరం హైదరాబాదులోని ఎత్తుపల్లాలను దాటి మనుషుల్ని ముంచేంత ఎత్తున నీళ్లు వస్తాయా? ఇంపాజిబుల్. అదే అన్నాను భయంతో పరుగెత్తుకొస్తూన్న వాళ్లతో వాళ్లని ఆపడానికి ప్రయత్నిస్తూ. వాళ్లు నన్ను పిచ్చి వాడిలా చూశారు. ఓ మూర్ఖుడ్ని చూస్తున్నట్లు చూస్తూ "ఓరి బుద్ధి లేనివాడా నీకంటే తెలివైన వాళ్లు, చదువుకున్న వాళ్లు, తరతరాలుగా హైదరాబాద్‌లో వుంటూన్న వాళ్లూ ఈ వార్తని నమ్మి పరుగెడ్తూంటే నువ్వు ఇంకా ఆలోచిస్తున్నావా ఆలోచించు. నీట్లో మునిగి చద్దువుగాని. అరె పోరా పిచ్చోడా! అవతల నీళ్లబారి నుంచి తప్పించుకొచ్చాం. రెండు కిలో మీటర్ల దూరంలో చెయ్యెత్తు నీళ్లున్నాయని చెబ్తూంటే అర్థం కాదేం నీకు?" అని తిట్టారు. నిజం చెప్పొద్దూ నేనూ నమ్మేశాను. నమ్మకపోవడం మూర్ఖత్వం అనిపించింది. ఇంట్లోకి పరుగెత్తి విలువైన వస్తువుల్ని బీరువాలోనూ, పెట్టెల్లోనూ పెట్టేసి పెట్టెల్ని గబగబా యుద్ధ ప్రాతిపదికన అటక ఎక్కించి మా అమ్మని తమ్ముడ్నీ తీసుకుని ఇంటికి తాళం పెట్టి ఎటయినా పారిపోదాం అనుకుంటూండగా ఎందుకు తట్టిందో చెప్పలేను ఓసారి రేడియో ఆన్ చేద్దాం అనిపించింది. అప్పటికి హైద్రాబాద్‌లో టి.విలు లేవు. రేడియో ఆన్ చేశాను. అందులో అనౌన్స్‌మెంటు వస్తోంది. "జంటనగరవాసులకి విజ్ఞప్తి. జాగర్తగా వినమని ప్రార్థన. గండిపేట చెరువు కట్ట తెగిపోయిందని పుకారు పుట్టించి జంటనగరాల ప్రజల్ని భయభ్రాంతుల్ని చేస్తున్నాయి కొన్ని అసాంఘిక శక్తులు. అది కేవలం పుకారు మాత్రమే. గండిపేట చెరువు కట్ట సురక్షితంగా వుంది. బయటకు ఒక్క నీటి చుక్కకూడా పొర్లిరాలేదు. కాబట్టి ప్రజలు ఏమాత్రం భయపడవలసిన అవసరం లేదు. ప్రశాంతంగా వుండండి"

మా ముఖాలు వెలిగాయి... గబగబా వీధిలోకి పరుగెత్తి, అటుఇటూ పరుగెడ్తూన్న వాళ్లందరికీ చేతులు జోడించి ఆపి, రేడియోలో వస్తున్న అనౌన్స్‌మెంటు

గురించి చెప్పి, వూరట కలిగించాం. మాలాగే రేడియో విన్న అనేకమంది వాళ్ల ఏరియాల్లో అలాగే చేశారు. ఈలోగా పోలీసులు కూడా పబ్లిక్ అనౌన్స్‌మెంటు సిస్టమ్ ద్వారా జనానికి వూరట కలిగించారు.

"కాని ఆలోగా అనేక వింతలు, విశేషాలు... అనేక షాపుల్లో దోపిడీలు జరిగాయి. అనేక వాహనాలు పోయాయి. భయంతో పారిపోతూన్న స్త్రీల మెడల్లోంచి నగలు దొంగిలించబడ్డాయి. రోగంతో మంచం పట్టిన ఆప్తుల్ని సైతం వదిలిపెట్టి పరుగులు పెట్టారు కొందరు తమ ప్రాణాలకోసం... కొండలు గుట్టలు ఎక్కారు కొందరు. ఆ కొండల్లో గుట్టల్లో మరీ ఎత్తుగా వున్న ప్రదేశాల కోసం తగువులాడుకున్నారు కొందరు.



"ఇంతకీ ఈ పుకారు ఎలా లేచిందటయ్యా అంటే... అంతకు రెండు రోజులముందే పెద్దపెద్ద వానలు పడడంతో గౌలీగూడా, ఉస్మాన్‌గంజ్ లాంటి ఏరియాల్లో పాత బిల్డింగులు కూలిపోయి కొందరు మరణించారు. బస్ డిపో ఎదురుగా వున్న రోడ్డు మూసీలోకి కొట్టుకుపోయింది కొన్ని వందల గజాలమేర. మూసీ నిండుగా ప్రవహించింది వాన నీటితో. వీధుల్లో కూడా నీళ్లు రెండడుగుల ఎత్తున ప్రవహించాయి. మరీ పల్లపు ప్రాంతాల్లో అయిదు అడుగుల ఎత్తున కూడా ప్రవహించాయి. ప్రజలు ఆ భయంతో వుండడంతో ఈ పుకారుని సులభంగా నమ్మేశారు. విషయమేమిటంటే గండిపేటలోంచి నీళ్లు వదిలే ముందు మూసీ దగ్గర బట్టలు వుతుక్కుంటూ వుండే చాకలివారిని ఉద్యోగస్తులు నీళ్లు వదుల్తున్నాం అక్కణ్ణుంచి వెళ్లిపోండి అని హెచ్చరిస్తారు. అయితే ఆ రోజు "పానీ ఆరా భాగో" అంటూ చేసిన ఆ హెచ్చరిక వికటించింది. భయపెట్టింది. అందరూ కూడా 'పానీ ఆరా భాగో... పానీ ఆరా భాగో' అంటూ డౌన్‌లోంచి పైకివస్తూంటే అదే అదనుగా భావించిన యాంటీసోషల్ ఎలిమెంట్స్ కొన్ని తమ స్వప్రయోజనాలకు ఆ సిట్యుయేషన్‌ని వుపయోగించుకున్నాయి. మొత్తానికి పుకారు గడ్డిమంటలా గుప్పుమంది. ఓ రెండు గంటలపాటు నగరాన్ని వూపి వదిలింది.

"అదీ నాజీవితంలో నేను విన్న నేను అనుభవించిన మాస్ హిస్టీరియా ఎఫెక్టు. ఇదుగో దీన్ని గురించి పరిశీలించాలి. చాలా వింతగా వుంది ఈ కేసు" అని ముగించాడు ఆనందరావు.

ఆ తర్వాత సైకాలజిస్టులు ఇద్దరూ గుడ్‌నైట్ చెప్పుకొని, విడిపోయారు.

**త**న ఆత్మాహుతి నిర్ణయాన్ని వార్తా పత్రికలకి పంపించి తన ఆత్మీయులందరికీ తెలియజేశాడు దీనబంధు. పత్రికలలో రేపు ఉదయం వస్తుంది. వార్త క్రమేపీ నగరమంతా పాకుతోంది.

ప్రకాశం కోసం వాకబు చేశాడు దీనబంధు.

ప్రకాశం తల్లి మరణించిందన్న వార్త అందింది.

దెబ్బతిన్నాడు దీనబంధు! చచ్చామే అనుకున్నాడు. కింకర్తవ్యం? మెదడుకి సానబెట్టసాగాడు. సమర్థుడు తలుచుకోవాలి గాని సాధించలేనిది వుందా? అని సర్ది చెప్పుక

న్నాడు. ఇద్దరు అనుచరులతో హాస్పిటల్‌కి బయల్దేరాడు.

దీనబంధు హాస్పిటల్‌కి చేరేసరికి, ప్రకాశం తల్లి శవాన్ని అంబులెన్స్‌లోకి ఎక్కిస్తున్నారు. కారులోంచి దిగుతూన్న దీనబంధుని చూసి ఒక్క క్షణం తటపటాయించి ఏం మాట్లాడ కుండా గంభీరంగా అంబులెన్స్‌లోకి ఎక్కే శాడు ప్రకాశం. అంబులెన్స్ కదిలింది.

మళ్లీ దెబ్బతిన్నాడు దీనబంధు.

కానీ పరిస్థితిని అర్థం చేసుకుని సర్ది చెప్పుకున్నాడు. కార్యం సాధించాలి అనుకు న్నప్పుడు ఇటువంటి చిన్నచిన్న విషయాల్ని పట్టించుకుంటే ఎలా? అనుకుని అంబు లెన్స్ వెంబడే తన కారుని ప్రకాశం ఇంటికి పోనిచ్చాడు.

శవాన్ని ఇంటి అరుగుమీద దించాక అంబులెన్స్ వెళ్లిపోయింది.

పిల్లలిద్దరూ బిక్కచచ్చిపోయి చూస్తు న్నారు తల్లి శవాన్ని.

వాళ్లని దగ్గరకు తీసుకుంటూ దుఃఖానికి లొంగిపోయాడు ప్రకాశం.

పిల్లలిద్దరూ బావురుమన్నారు.

దీనబంధు కార్యరంగంలోకి దిగాడు. నెమ్మదిగా, హుందాగా ప్రకాశం దగ్గరకు నడిచాడు. ప్రకాశం భుజం మీద చెయ్యివేసి అతన్ని తనవైపుకి తిప్పుకున్నాడు.

సూటిగా కళ్లల్లోకి చూశాడు ప్రకాశం.

ప్రకాశాన్ని దగ్గరకు లాక్కుని గుండెలకు హత్తుకున్నాడు దీనబంధు.

ప్రకాశానికి ఏమాత్రం ఓదార్పు లభించ లేదు ఆ పరిష్వంగంలో. దీనబంధుని దూరంగా నెట్టి 'ఇక నీకూ నాకూ చెల్లు' అని చెప్పేద్దామా అనుకున్నాడు. కానీ...

దీనబంధు, "ప్రకాశం చెప్పానుగా మీ అమ్మగారు నాకూ అమ్మేనని. ఇప్పుడు నాకు తల్లిపోయినట్లే వుంది" అన్నాడు గద్గది కంఠంతో.

ఆ మాటలు ప్రకాశం మీద పని చేయనా రంభించాయి.

దీనబంధు పిల్లలిద్దర్నీ దగ్గరకు లాక్కుని ప్రకాశంతో అన్నాడు. "డీలాపడిపోకు. ఇదుగో వీళ్లనిచూడు! నువ్వు అంతలా డీలా పడి పోతుంటే పసివాళ్లు వీళ్లిద్దరూ మరీ బెంబేలుపడిపోతున్నారు. వీళ్లని ఓదార్చి వీళ్ల భవిష్యత్తు గురించి ఆలోచించవలసిన అవసరం నీకుంది. మీ ముగ్గురి క్షేమం ఆలోచించవలసిన బాధ్యతని నా మీదుంచి అమ్మ వెళ్లిపోయింది"

ప్రకాశం పూర్తిగా చలించిపోయాడు.

బేలగా దీనబంధు గుండెలమీద వాలిపో యాడు.

పెదవుల మీద మొలకలెత్తబోయిన విజయ దరహాసాన్ని లోలోనే నొక్కుకు న్నాడు దీనబంధు. "గాడ్ బ్లెస్‌యు" అన్నాడు, ప్రకాశం వీపునిమురుస్తూ. తన అనుచరుల్ని పిలిచి, దహన సంస్కారానికి కావలసిన ఏర్పాట్లు అన్నీ చూడమన్నాడు. మొత్తం ఖర్చంతా తన ఖాతాలో వేయమ న్నాడు.

"మీకు ఋణపడి వుంటాను" అన్నాడు ప్రకాశం.

"అంత పెద్ద మాటలు వద్దు. నువ్వు ఈ విచారం నుంచి ఈ రోజే బయటపడి సాయంత్రానికల్లా మామూలు అయిపో వాలి. ఈ రోజు సాయంత్రం మనవాళ్లు నీకు డ్యూటీ చెబ్తారు. సరేనా? " అనున యంగా పలికాడు ప్రకాశం.

అలాగే అన్నట్లుగా తల వూపాడు ప్రకాశం.

★ ★ ★

రాత్రి పదకొండు గంటల వేళ. స్వామీ నిత్యానంద ఆశ్రమం.

ఆశ్రమ నియమం ప్రకారం రాత్రి తొమ్మిది గంటలకే స్వామీజీ, పది గంట లకు శిష్యబృందం నిద్రపోయారు. మళ్లీ ఉదయం నాలుగు గంటలకి అందరూ లేచి కాలకృత్యాలు తీర్చుకుని ప్రార్థనలు ప్రారం భించాలి. కాబట్టి అన్ని కార్యక్రమాలు నిర్ణీత

సమయాల్లో నిర్వహించబడతాయి.

స్వామీజీ తప్ప అందరూ నిద్రలోకి జారి పోయి వున్నారు.

స్వామీజీకి నిద్ర పట్టక పోవడం అసాధారణమయిన విషయం. సరిగ్గా సమయానికి ఆయన దైవప్రార్థన కావించి నిద్రకు ఉపక్రమిస్తే పిలిస్తే పలికినట్లు ఆయనకు నిద్ర రావలసిందే. అలాగే ఖచ్చితంగా ఉదయం నాలుగు గంటలకి క్షణం తేడాలేకుండా మెలకువ రావలసిందే.

అటువంటిది ఈ రోజు...

కారణం వుంది. ఊళ్లో రాత్రుళ్లు జనానికి అసౌకర్యం, అధైర్యం, అభద్రతాభావం కలిగిస్తున్న రాక్షసకోతి జంతువుకాదు, సాక్షాత్తు ఆంజనేయస్వామే అని తను ప్రవచించాడు. కాని మర్నాడే అది సత్యదూరం అని నిరూపించబడింది. పేపర్లన్నీ అది రాక్షసకోతే అని ఘోషించాయి. ఇలా జరిగితే తమ లాంటి సాధువులు ప్రవచించినవి సత్యాలు కావని నిరూపించబడ్తే ప్రజల్లో దైవభక్తి, దైవభీతి సన్నగిల్లుతాయి! ఇప్పటికే అన్యాయం, అరాచకం ప్రపంచంలో తాండవిస్తున్నాయి. భగవంతుడి మీద భారం వేశాక కూడా ఇలా జరిగితే...

ఆయన మనసు వికలంగా వుంది.

అదే సమయంలో అది కోతే అయితే ఆ రోజు ఆ బాలుడ్ని హింసించకుండా ఎందుకు రక్షించిందీ అని సందేహం పీకుతోంది. ఏవిటీ వింత?

ఆయన ఇలా ఆలోచిస్తుండగా ఆశ్రమం ఒక మూల నుంచి భీతితో కేకలు వినిపించాయి. "అమ్మో రాక్షసకోతి" అని. అంతే క్షణాల్లో అందరూ మేల్కొన్నారు. అరుపులు అధికమయ్యాయి. అందరూ భయంతో కకావికలు అవుతూ కేకలు పెడ్తున్నారు. చీకట్లో...

స్వామీజీకి మతి పోయినట్లయింది.

గబగబా తేరుకుని లేచి లైట్లు వెలిగించి వరండాలోకి వచ్చి అలాగే చూస్తున్నారు.

కోతి భయంకర కిచకిచలు వినిపిస్తున్నాయి.

శిష్యబృందం గదుల్లోంచి బయటకు పరుగెత్తుకు వచ్చి చెల్లాచెదురుగా పరుగులు తీసి వరండా వైపు చూశారు. స్వామీజీ దైవాన్ని తలుచుకుంటూ ధైర్యం తెచ్చుకుని చేతులెత్తి అభయముద్ర పెట్టి, అందర్నీ తన వైపుకి రమ్మని పిలిచారు. శిష్యులందరూ గుండెలు చేతుల్లో పెట్టుకుని స్వామీజీ వైపు పరుగెత్తుకొచ్చారు భయంతో

కోతి చెట్ల గుబురుల్లోంచి బయటకొచ్చింది గంతులేస్తూ.

చెయ్యెత్తు ఆకారం...

పెద్దపెద్ద అంగలేస్తోంది. పెద్ద ఎత్తున గెంతుతోంది. మామిడి చెట్ల కొమ్మల్ని విరిచి పారేసింది. అరటి మొక్కల్ని పీకిపారేసింది. స్వామీజీని, శిష్యబృందాన్ని మింగేసేలా చూస్తూ వాళ్లవైపు రాసాగింది.

శిష్యబృందం వజవజా వణికిపోయారు.

ఇంక తమకి అంతిమ ఘడియలు సమీపించినట్లా అనిపించింది స్వామీజీకి.

కళ్లు మూసుకుని అంజలి ఘటించి భగవంతుడ్ని మనసులో నిలుపుకుని ఉచ్ఛ స్వరంతో "మనోజవం మారుతతుల్యవేగం జితేంద్రియం..." అంటూ ఆంజనేయ శ్లోకాన్ని అందుకున్నారు.

శిష్యబృందం అంతా చేతులు జోడించి గొంతులు పూర్తిగా విప్పి స్వామీజీతో గొంతు కలిపారు.

శ్లోకం పూర్తయ్యింది.

ధైర్యంగా, నెమ్మదిగా కళ్లు విప్పారందరూ వింత!

రాక్షసకోతి చేతులు పైకి ఎత్తి క్రమబద్ధంగా చిందులేస్తూ భక్తి పారవశ్యంలో వున్నట్లుగా వూగిపోతోంది.

ఆనంద పరవశంతో చూడసాగారు స్వామీజీ, శిష్యబృందం. భయం పోయింది. ఆనందం, ఆశ్చర్యం, భక్తిపారవశ్యం ముప్పేటలుగా ఆవహిస్తున్నాయి.

ఒక్కసారి ఈ లోకంలోకి వచ్చినట్లుగా ఆగింది కోతి. వాళ్ల వైపొకసారి చూసి తక్ష ణమే వెనుతిరిగి పెద్ద పెద్ద గంతులేస్తూ గోడదూకి పారిపోయింది.

అంతే! ఆనందంతో 'జైభజరంగభళీ, నమో ఆంజనేయా, నమో వాయుపుత్రా' అని నమస్సుమాంజలులు ఆంజనేయస్వా మికి సమర్పించారు అంతా. శిష్యబృందం తమ ప్రాణాలు కాపాడిన తమ గురువు పాదాలమీద మరింత భక్తితో వాలిపో యారు.

స్వామీజీ వడివడిగా తన గదిలోకి వెళ్లి చక్రవర్తికి ఈ వింతని తెలియజేయడానికి ఫోను అందుకున్నారు.

★ ★ ★

"ఏవిట్రా చక్రవర్తి, నువ్వు మేయర్‌వైన శుభసందర్భంలో ఓ పెద్ద కోతిని తెప్పించి ప్రజల మీద కొదిలావుట"

ఉలికిపడ్డాడు చక్రవర్తి. తటాలున సోఫా లోంచి లేచి గుమ్మం వైపు చూశాడు. అక్కడ నవ్వుతూ చేతులు బారచాచి ఆనం దరావు నిలబడి వున్నాడు.

ఆనందరావుని చూస్తుంటే అథః పాతాళా నికి జారిపోతుందేమోననిపించిన ప్రాణం ఆకాశమంత ఎత్తుకి ఎగిసిపడ్డట్టయ్యింది.

"ఓ ఆనందరావు. మై ఫ్రెండ్...మైహార్ట్ ఎప్పుడొచ్చావురా? " అంటూ ప్రపంచాన్ని మరచిపోయి అతన్ని దగ్గరకు లాక్కుని కౌగ లించుకుని గిరగిరా తిప్పేశాడు చక్రవర్తి.

"నిన్న మార్నింగే వచ్చానురా చక్రీ! నువ్వె లావున్నావు"

"బాగానే వున్నాను. నువ్వు రావడం రియల్లీ వండర్‌ఫుల్" అరిచాడు పట్టలేని ఆనందంతో చక్రవర్తి.

గత కొన్ని రోజులుగా నోరే సరిగా విప్ప కుండా స్తబ్దుగా కూర్చుంటున్న భర్త అంతగా కేరింతలు కొట్టేసరికి కారణం ఏమ యివుంటుంది చెప్మా అని ఆశ్చర్యపోతూ లోపలి గదుల్లోంచి గబగబా బయటకు పరుగెత్తుకొచ్చింది ఇంద్రాణి.

"ఇంద్రాణీ నీకు చెబ్తూ వుంటానుకదూ నా బెస్ట్ ఫ్రెండ్ సైకాలజిస్టు ఆనందరావు అని. ఇదుగో ఇతనే, కాదు వీడే. ఢిల్లీలో వుంటున్నాడు ప్రస్తుతం. ఆనందం ఈమె నా భార్య ఇంద్రాణిరా"

"తెలుసోయ్ మీ పెళ్లి కొచ్చానురా"

"మా పెళ్లికొచ్చావా నువ్వు... అవును కదూ"

"మతిమరుపు మేయర్" వెక్కిరించాడు ఆనందరావు.

చక్రవర్తి నవ్వుతూ ప్రేమగా స్నేహితుడ్ని దగ్గరకు లాక్కుని పక్కన కూర్చోబెట్టుకు న్నాడు.

ఆనందరావు నవ్వుతూ "అవున్రా చక్రీ ఎలక్షన్లలో గెలిస్తే అందరూ తారాజువ్వలు పైకి వదుల్తారు. నువ్వేమిట్రా కోతిని వది లావు వూళ్లోకి? " అనడిగాడు.

చక్రవర్తి ముఖం నవ్వులోంచి సీరియస్‌కి మారింది.

స్నేహితుడి చేతుల్ని తన చేతుల్లోకి తీసు కున్నాడు.

"జోక్ కాదురా ఆనందం, అయిదారు రోజులుగా మాకు నిద్రాహారాలు లేవు. గొప్ప చికాకు కలిగించేస్తోంది ఆ రాక్షస కోతి. మేయర్‌నైవుండీ ఏం చెయ్యలేక ఓ పక్క ప్రజల బాధలూ, మరోపక్క పేపర్ల వాళ్ల విమర్శలూ భరించలేక నరకం అను భవిస్తున్నానురా" చక్రవర్తి గొంతు సన్నగా వణికింది.

ఆనందరావు కూడా చిలిపితనం నుంచి హుందాగా మారాడు. "ఊ తెలిసింది. పేప ర్లలో చూశాను. ఆమధ్య ఢిల్లీలో కూడా ఇలాగే ఈ కోతిగోల గొప్ప సంచలనం సృష్టించింది. చదువుకున్నవాళ్లని, చదువు కోని వాళ్లనీ కూడా సమానంగానే కంగారు పెట్టింది. చాలా కాలనీల్లో ప్రజలు రాత్రుళ్లు నిద్దర్లుమాని గస్తీలు తిరిగారు. పోలీసులు సరేసరి. చివరికి ఏ కోతీ దొరక్క అది మిస్ట

రీగానే మిగిలిపోయింది. అసలా రాక్షసకోతి అనేది వుందో లేదో వుంటే అది ఏమయ్యిందో ఎవ్వరూ తేల్చి చెప్పలేకపోయారు"

"కాదురా ఇక్కడ మాత్రం రాక్షసకోతి వుంది. మా రైతు కిష్టయ్యని రక్కి వదిలింది. మా గుమాస్తాగారి అమ్మాయిని పొట్టనపెట్టుకుంది"

"చక్రవర్తీ ఇటువంటి విషయాల్ని కొంచెం నిదానించి ఆలోచించాలి. జనం కొన్నికొన్ని విషయాల్లో గొర్రెల మందలా ప్రవర్తిస్తారు. భయం, ఏదో కొత్త విషయాన్ని కనిపెట్టేసేం అని చెప్పాలనే ఆతృత, ఇవన్నీ వాళ్లని సరైన పంథాలో ఆలోచించనీయవు. ప్రభుత్వం కూడా అంతా పుకారే ఏం భయంలేదు అని ప్రచారం చేయాలిగాని వందల కొద్దీ పోలీసులని రంగంలోకి దింపి, టి.విల్లో, రేడియోలో జాగర్తగా వుండండీ, రాత్రుళ్లు తిరక్కండీ, కాలనీల్లో జట్లుజట్లుగా గస్తీలు తిరగండీ అని ప్రకటనలు ఇవ్వడం సమస్యని మరింత జటిలం చేస్తుంది"

ఆశ్చర్యపోయాడు చక్రవర్తి స్నేహితుడి మాటలకి.

"ఏవిట్రా నువ్వనేది? పోలీసులు గస్తీ తిరగడం, హెచ్చరికలు చేస్తూ ప్రజల్ని అప్రమత్తులుగా వుండమనడం, కాలనీల్లో కాపలాలు కాయమనడం తప్పంటావా? "

"ఖచ్చితంగా. భయాన్ని తగ్గించాలిగాని పెంచేవిధంగా ఊరికే అతిజాగర్తలు చెప్తే భ్రమలు ఎక్కువ అవుతాయి. భ్రమల్లోంచి పుకార్లు, పూనకాలు పుడ్తాయి. ఇప్పుడు జరుగుతున్నది అంతా కూడా మాస్ హిస్టీరియా కారణంగానే అన్నట్లుగా కనబడ్తోంది"

"ఆనందం? "

"నిజంరా! డెల్యూజిన్ అండ్ మాస్ హిస్టీరియా అనేవి మనిషిని ఎలా మృగాలుగా ప్రవర్తించేలా చేస్తుందో చెప్తాను విను. పంతొమ్మిది వందల ముప్ఫై ఎనిమిదిలో హెచ్.జి. వెల్స్ నవల 'ది వార్ ఆఫ్ ద వరల్డ్స్'లోని యుద్ధసన్నివేశాల్ని అతి సహజంగా ప్రసారం చేస్తే కనీసం లక్షమంది జనం ప్రాణాలు అరచేత పట్టుకుని వీధుల్లో పరుగులు తీశారు. అది రేడియో డ్రామా అని, నిజంకాదు అని చెప్పడానికి అధికారుల తల ప్రాణం తోకకి వచ్చింది. ఇదే నాటకాన్ని క్విటో అనే చోట రిపీట్ చేసినప్పుడూ ఇదే పరిస్థితి. ఆ తర్వాత అది రేడియో నాటకం అని తెలుసుకున్న జనం ఆ రేడియో స్టేషన్ని తగలబెట్టి అందులోవున్న పదిహేను మందిని చంపిపారేశారు. ఇదుగో పులి అంటే అదుగో తోక అంటూ జనం పుకారుల్ని ఎంత త్వరగా నమ్మేస్తారో ఆ తర్వాత అంత పిచ్చిగానూ రియాక్ట్ అవుతారు"

"నిజంగా? రేడియో స్టేషన్ని తగలబెట్టి అందులోని మనుషుల్ని చంపెయ్యడమే? "

"ఏమనుకున్నావు మరీ? అనవసరంగా తాము అంతసేపు అంతగా భయపడ్డందుకు ఉక్రోషంతో ప్రజలు చేసిన పని అది. ఆ భయంలో వాళ్లలో కొందరికి ప్రాణం పోయే ప్రమాదం కూడా వుందిగా మరి"

"నిజమే పాపం"

"ఇంకోసారి పంతొమ్మిది వందల యాభయి ఆరులో ఓ అదృశ్య హంతకుడు గాలిలో ఎగుర్తూ పెద్ద కత్తితో మనుషుల్ని నరికేస్తున్నాట్ట" అని పుకారు పుట్టింది తైవాన్‌లో. వింతేమిటంటే మేము ఆ అదృశ్య హంతకుడి బాధితులం అంటూ ఓ రెండు డజన్ల మంది పోలీసు స్టేషన్లకొచ్చి మొరపెట్టుకున్నారు కూడా. ఇక జనం రాత్రుళ్లు తలుపులు బిగించుకుని ఇళ్లల్లోనే బందీలై వుండిపోయారు ఓ పదిహేను రోజుల పాటు. చివరకి తేలిందేవిటంటే అంతా భ్రమని. బాధితులమని చెప్పుకున్న వాళ్లలో సగం మంది స్వయంగా గాయపరుచుకున్నారని మిగిలినవాళ్లకి అయిన గాయాలు కత్తివలన కానేకావని నిరూపించబడింది కూడా. అటువంటి వింత వ్యక్తిని తాము చూశామనో, తాము దెబ్బలు తినీ

తప్పించుకున్నామనో చెప్పుకుంటూ అందరి దృష్టినీ ఆకర్షించడం ఓ హీరోయిజం. పని కిమాలినవాళ్లు చేసే ఘనకార్యం" లేచి అస హనంగా తిరుగుతూ సిగరెట్ వెలిగించాడు ఆనందరావు.

"ఈ కోతి వుదంతం కూడా నువ్వు చెప్పే వుదాహరణలతో పోలికలున్నదే అంటావా? "

"అటువంటిదే అనడానికి అవకాశమయితే వుంది. ఒక వింత సంఘటన జరిగినప్పుడు దాన్ని పరిష్కరించడానికి గతంలోని సంఘ టనలని గుర్తు చేసుకోవలసిన అవసరం చాలావుంది. ఢిల్లీ సంఘటనలకీ ఇక్కడి సంఘటనలకీ బాగా పోలికయితే కనిపి స్తోంది. మాస్ హిస్టీరియా అండ్ డెల్యూజ న్‌కి మరొక వింత వుదాహరణ చెప్పనా? నవ్వాలో ఏడవాలో తెలియదు నీకు. కానీ నిజంగా జరిగింది. సంఘ విద్రోహశక్తులు కొన్ని విషయాల్ని ఎంత నమ్మకం కలిగిం చేలా ప్రచారం చేస్తారంటే చదువుకుని ఆలోచించే శక్తున్నవాళ్లు సైతం ఫూల్స్ అయిపోతారన్నమాట. పందొమ్మిది వందల తొంభయిలో ఆఫ్రికాలో కేమరూన్ నుంచి నైజీరియా వరకు ఓ పుకారు గుప్పునలేచి జనాన్ని భయభ్రాంతుల్ని చేసింది" ఆగాడు ఆనందరావు. సిగరెట్‌ని యాష్‌ట్రేలో నొక్కేసాడు. చక్రవర్తి వైపుచూశాడు. వినడా నికి చక్రవర్తి ఉత్సుకత చూపిస్తున్నాడు.

ఓసారి లోపల్నుంచి చక్రవర్తి భార్య రావడం లేదుకదా అని చూసి గొంతు తగ్గించి చెప్పాడు ఆనందరావు, "అదేవిటంటే శరీరంలో ఎలక్ట్రిక్ కరెంట్ వున్న ఓ వింత మనిషి ఊరూరా తిరుగుతున్నాడు, వాడికి షేక్‌హ్యాండ్ ఇచ్చిన ఏ మగాడికయినా పురుషాంగం వెనక్కి శరీరంలోకి కుదించు కుపోతోంది అని. ఇక చూస్కో మగవాళ్లు అపరిచిత మగవాళ్లకి షేక్‌హ్యాండ్ ఇవ్వ డమే మానేశారు. అనుమానం కలిగించేలా తిరుగుతున్న అపరిచితుల్ని చితకబాది చంపేశారుకూడా! ఇంత వింతగానూ, భయంకరంగానూ వుంటాయి ఈ పుకార్లు. ఆమధ్య ఆంధ్రాలో నామాలదేవత మను షుల నామాల్ని నాకేస్తోందంటూ తలుపు లకి నామాలుపెట్టడం, ఆకాశంలో శవం ప్రయాణం చేస్తోందంటూ జనం భయ పడ్డం, జంట నగరాల్లో గండిపేట తెగి నీరు వూళ్లోపడి ముంచేస్తోందంటూ ప్రజలు పరు గులు పెట్టడం నీకు తెలిసినవేకదా" అంటూ ముగించాడు.

"కానీ... కానీ ఆనందం! పాపం మా కిష్ట య్యని నిజంగానే ఆ కోతి అటాక్ చేసి గాయపరిచింది. మా గుమాస్తా కేశవరావు గారమ్మాయిని దారుణంగా చంపేసింది. వింతేమిటంటే ఇంత క్రూరంగా ప్రవర్తించిన ఆ కోతి ఓ బాలుడ్ని గోతిలోంచి బయటకు తీసి కాపాడింది అర్ధరాత్రివేళ. మా కాంపౌండులోకి వచ్చి ఎవ్వరికీ హాని చేయ కుండా వెళ్లిపోయింది. నేను నా కళ్లారా చూశాను. నిన్న రాత్రి ఆశ్రమంలో మొదట వైల్డ్‌గానూ, తర్వాత ఎంతో బుద్ధిగానూ ప్రవర్తించి ఎవ్వరికీ హాని చేయకుండా వెళ్లి పోయింది. ఏవిటీ వింతమరి? "

బరువుగా నిశ్వసించాడు ఆనందరావు. ఆపైన తల పంకించి రెండు నిముషాలు ఏమీ మాట్లాడకుండా ఆలోచనలో గడి పాడు. ఆ తర్వాత అన్నాడు, "ఇటువంటి కేసుల్ని విడిగా చాలా జాగ్రత్తగా పరిశోధిం చాల్సి వుంటుంది"

ఈ మాటలు ఆనందరావు అంటూండగా బయటనుంచి దీనబంధు, లోపల్నుంచి ఇంద్రాణి వచ్చారు.

"అన్నయ్యగారూ మీ స్నేహితుడు ఊళ్లో రాక్షసకోతి బెడద గురించి తెగ బెంగ పెట్టే సుకుని నిద్రాహారాల గురించి అసలు పట్టిం చుకోవడంలేదు. భార్యాబిడ్డల గురించి కాక పోయినా తన గురించయినా ఆ మనిషి కొద్దిగా ఆలోచించుకోకపోతే ఎలా? " అంది ఇంద్రాణి కంప్లెయింట్‌గా.

"ఆ విషయమే మాట్లాడుకుంటున్నాం

ఇంతసేపూ" అని, బావమరిదిని స్నేహితుడికి పరిచయం చేస్తూ "ఇదుగో ఇతను నా బావమరిది దీనబంధు- ఏన్ యాంబిషస్ పొలిటీషియన్ అండ్ ఎ సిన్సియర్ వర్కర్" అన్నాడు చక్రవర్తి.

అదే అదనుగా అందుకుంది ఇంద్రాణి, "బావగారంటే ప్రాణం వాడికి. ఆయన ఇంతలా తల్లడిల్లిపోతూంటే చూడలేక రెండు రోజుల్లో ఆ కోతిని పట్టుకోవడమో తరిమెయ్యడమో చంపెయ్యడమో చెయ్యలేక పోతే తను ఆత్మహత్య చేసుకుంటానని ప్రతిజ్ఞ చేశాడు"

"పత్రికా ప్రకటన ఇచ్చేశాను కూడా" అన్నాడు దీనబంధు సీరియస్‌గా.

అభిమానంతో కసుర్తూ అన్నాడు చక్రవర్తి, "ఏవిటయ్యా దీనబంధూ ఆ దూకుడూ? అభిమానంకయినా హద్దువుండాలి. ఏమిటీ మతిలేని చేష్టలు? ఇప్పుడే చెబుతున్నాడు నా స్నేహితుడు ఇది పుకారు కావొచ్చు లేకపోతే భ్రమ కావొచ్చు అదీ కాకపోతే దుర్మార్గులెవరైనా ఆడుతూన్న నాటకం కూడా కావొచ్చు అని"

"నో నాటకం కాదు నిజం" అరిచాడు దీనబంధు.

ఉలిక్కిపడి అతనివైపు చూశాడు ఆనందరావు.

మళ్లీ అరిచాడు దీనబంధు ముఖం ఎర్రబడుతూండగా "రాక్షస కోతి వున్నమాట నిజం, అది ప్రజల్ని బాధిస్తున్న మాట నిజం, నిజం! నిజం! నిజం!"

ఆనందరావు దీనబంధుని తేరిపార చూసి "మీరెలా చెప్పగలరు? " అనడిగాడు.

"జరుగుతున్న సంఘటనలే దానికి ఆధారం" ఇంకా ఆవేశపడుతున్నాడు దీనబంధు.

"ఓకే ఓకే కూల్‌డౌన్ ప్లీజ్! అయినా మీరెందుకు ఇంత ఆవేశపడుతున్నారు? " అన్నాడు ఆనందరావు.

"అతను ఢిల్లీలో పెద్ద సైకాలజిస్టు. ప్రపంచంలో జరిగిన అనేక సంఘటనలని స్టడీ చేసినవాడు. ఇది పుకారుమీద ఆధారపడిన మాస్ హిస్టీరియా కావొచ్చు అంటున్నాడు.." చక్రవర్తి చెబుతుండగానే కట్ చేస్తూ మళ్లీ అరిచాడు దీనబంధు "నోనోనో... మాస్ హిస్టీరియా ఏమాత్రంకాదిది. కళ్లెదురుగా జరుగుతూన్న సత్యం" అని.

"మాస్ హిస్టీరియా కాదని మీరెలా చెప్పగలరు? " ఆనందరావు.

"..." పళ్లు గిట్టకరిచి తన ఆలోచన తప్పంటారా అన్నట్లుగా తల ఆడించి సర్దుకుని "ఎందుకూ రెండు రోజుల్లో ఎలాగూ తేలిపోతుందిగా? " అన్నాడు దీనబంధు.

దీనబంధుని చక్రవర్తినీ మార్చిమార్చి చూస్తూ అయోమయాన్ని నటిస్తూ ఆశ్చర్యంగా అడిగాడు ఆనందరావు. "అదేవిటి రెండ్రోజుల్లో తేలిపోతుందని మీరెలా అంత ఖచ్చితంగా జోస్యం చెబుతున్నారు. రెండు సంవత్సరాలయినా తేలక మిస్టరీగానే మిగిలిపోవొచ్చుకదా? " అనడిగాడు ఆనందరావు.

"నో జోస్యం కాదిది నా తెలివితేటల మీద, నా శక్తిసామర్థ్యాల మీద నాకున్న నమ్మకమిది"

"దట్స్‌గుడ్"

మీ కాంప్లిమెంట్‌ని నేను కోరడంలేదు అన్నట్లుగా కేర్‌లెస్‌గా ఆనందరావు వైపు చూసి ఒత్తిఒత్తి పలుకుతూ స్పష్టంగా ఖచ్చితంగా అన్నాడు దీనబంధు, "రెండు రోజుల్లో ఆ రాక్షసకోతిని పట్టుకోవడమో, తరిమెయ్యడమో, చంపెయ్యడమో చెయ్యకపోతే నేను ఆత్మాహుతి చేసుకోవడం మాత్రం ఖాయం! ఇందులో వెనుతిరిగే ప్రసక్తేలేదు"

మెచ్చుకోలుగా నవ్వాడు ఆనందరావు, "ఇంకేమయ్యా ఈయన ఇంత నమ్మకంగా భరోసా ఇస్తుంటే ఊc తల్లడిల్లిపోతావు పిచ్చివాడా" అని చక్రవర్తితో అని, నవ్వుతూనే దీనబంధునింకోసారి ఎగాదిగా చూసి అందరికీ నమస్కరిస్తూ "ఓకే... నేనొక

# పలినముత్యాలు

- దైవం నీకు ఒక ముఖాన్ని మాత్రమే ఇస్తాడు. దాన్ని నువ్వు మరొక ముఖంగా మార్చుకుంటావు!

  – షేక్స్‌పియర్

- అందగత్తె ముఖంలో ఓ పూల తోట ఉంటుంది. అక్కడ గులాబీలు, తెల్లటి లిల్లీస్ వికసిస్తాయి!

  – థామస్ ఛాంపియన్

- ప్రతిరోజూ నువ్వు శరీరానికి అనేకసార్లు ఆహారాన్ని అందిస్తావు. అయితే మనసుకు మాత్రం ఏ ఆహారం అందచెయ్యవు.

  – హల్‌దయాల్

- అరేబియాలోని సుగంధ పరిమళాలన్నీ పసిపాప చేతుల నుంచి వచ్చే సుగంధం ముందు వెలవెల పోతాయి!

  – షేక్స్‌పియర్

- దైవం చేసిన అత్యుత్తమమైన పని, ఓ నిజాయితీపరుణ్ణి సృష్టించడం!

  – అలెగ్జాండర్ పోప్

- మంచి ఆలోచనలు ప్రపంచాన్ని నియంత్రిస్తాయి.

  – గార్‌ఫీల్డ్

- గడిచిన కాలం ఇక ఎన్నడూ కనిపించదు.

  – అగ్‌హే

- సగం విపత్తులు మానవుల మూర్ఖత్వం వలన సంభవిస్తాయి. మిగిలిన సగం గర్వం వలన ఏర్పడతాయి!

  – హల్‌దయాల్

- మానవజాతిని పరిపాలిస్తున్నది ఊహలే!

  – నెపోలియన్

- అనుకరణ వలన ఏ మనిషీ ఎన్నటికీ గొప్పవాడు కాలేడు!

  – జాన్సన్

- అసంభవం అనే పదం కేవలం తెలివి తక్కువ వారి నిఘంటువులో మాత్రమే కనిపిస్తుంది.

  – నెపోలియన్

- ఎక్కువగా ఒంటరిగా నిలిచిన వాడే ప్రపంచంలో గట్టివాడు.

  – ఇబ్సెన్

సేకరణ: కొడిమెల శ్రీరామమూర్తి

అర్జెంటు మీటింగుకి హాజరు కావలసిన పనుంది. ఐటేక్ లీవ్. ఐసీయు ఆల్ అగైన్" అని బయల్దేరాడు.

"అదేవిటీ- భోజనానికి వుండరూ?" అంది ఇంద్రాణి.

"ఇంకో రోజువస్తాను- ఇదిగో, రెండ్రోజుల్లో ఈయన ఈ సమస్యకి పరిష్కారం చూపించేస్తే, మా స్నేహితుడి మొహంలో కనిపించే వెల్తుర్లో మూన్‌లైట్ డిన్నర్ చేస్తాను. వస్తానమ్మా..." అంటూ వెళ్ళిపోయాడు ఆనందరావు.

స్నేహితుడ్ని గేటువరకూ దిగబెడ్తూ, అతను చెబ్తూన్న విషయాల్నీ, జాగర్తల్నీ మెదడులో రికార్డు చేసుకున్నాడు చక్రవర్తి.

స్నేహితుడికి 'బైచెప్పి, లోపలికి వస్తూ, తీవ్ర ఆలోచనలో వున్న దీనబంధుతో, "ఏది ఏమయినా నువ్వు చాలా తొందర పడ్డావు దీనబంధూ- ప్రేమాభిమానాలు విపరీతంగా వున్నంతలో యింతటి సమస్యలు తీరిపోతాయా? అబ్బెబ్బే, అంతటి దుస్సాహసం పనికిరాదు" అన్నాడు నొచ్చుకుంటూ.

ధీనబంధుకి ఆ మాటలు కొంత శక్తినిచ్చాయి. ఊపిరి తిప్పుకున్నాడు. ఆపైన అన్నాడు. "మీరే చెప్పారుకదా బావగారూ- ప్రజాసేవకోసం ప్రాణాలయినా యివ్వాలీ, అప్పుడే అసలయిన నాయకుడు అనిపించుకుంటాడని! అందుకనే ఆ నిర్ణయం తీసుకున్నాను"

బావమరిదివైపు అభిమానంగా చూశాడు చక్రవర్తి.

ఇంద్రాణి ఆనందభాష్పాల్ని తుడుచుకుంది.

★ ★ ★

కాలేజీ ఎలక్షన్‌లలో గెలిచాడు కన్నబాబు.

గెలిచిన సందర్భంగా తన గెలుపు కోసం పాటుబడినవాళ్ళందరికీ మంచి పార్టీ ఇచ్చాడు. ఆ పార్టీలో మాట్లాడుతూ, తన విజయానికి పరోక్షంగా కారణమయిన అమరజీవి ముగ్ధని తను జన్మలో మరచిపోలేనని, ఆమెని భవిష్యత్తులో అందరూ సంస్మరించుకునేలా కాలేజీ ఆడిటోరియంకి ఆమె పేరు పెట్టించడానికి తన శక్తివంచన లేకుండా కృషిచేస్తానని వాగ్దానం చేశాడు.

ముందు ఆమె మరణంతో కృంగిపోతూన్న నందిని మామూలు మనిషిని చేయడానికి గట్టిగా ప్రయత్నించమని మిత్రులు సలహా ఇచ్చారు.

నందికోసం వెతికించాడు కన్నబాబు.

స్మశానంలో ముగ్ధ సమాధి దగ్గర వున్నాడని తెలిసింది.

హుటాహుటిన అక్కడకు చేరాడు కన్నబాబు.

మోకాళ్లమీద కూర్చుని, సమాధిమీద చేయివుంచి, వాలిపోయి వున్నాడు నంది.

నెమ్మదిగా వెళ్లి అతని పక్కన కూర్చుని, భుజంమీద చెయ్యివేశాడు కన్నబాబు.

యాంత్రికంగా తల తిప్పాడు నంది.

"నందీ! నీకు ఎంత బాధగా వుందో నాకు తెలుసు. ముగ్ధ చావు నిన్ను మించి నన్ను బాధపెడ్తోంది. కాని ఏంచేస్తాం, తట్టుకోవాలి, తప్పదు"

"......" మౌనంగా చూస్తున్నాడు నంది.

"నిజంగా నేను ఎలక్షన్లలో గెలిచానంటే దానికి ముగ్ధ అభిమానులే కారణం. ఆమెకి ప్రాణంపోసి బతికించలేకపోయినా, ఆమె అంత్యక్రియలు ఏలోటూ లేకుండా నేను దగ్గరుండి జరిపించి ఋణం తీర్చుకున్నాను. అంత మంచి మనిషి అలా దారుణంగా చనిపోవడం రియల్లీ వెరీ శాడ్. ఓకే- జరిగిందేదో జరిగిపోయింది. నా క్లోజ్ రెలిటివ్‌వి, మంచివాడివి, నువ్విలా అయిపోవడం నాకు చాలా బాధనిపిస్తోంది. నిజం. చాలా బాధని కలిగిస్తోంది..."

"మా నాన్నకి కూడా బాధగా వుందా?" నిద్రలో మాట్లాడినట్లుగా అడిగాడు నంది.

తెల్లబోయి చూశాడు కన్నబాబు.

"అదేంమాట నందీ- మీ నాన్నకి బాధెందుకు వుండదూ? ఆయన కూడా ఆమె

అంత్యక్రియల్లో పాల్గోలేదూ?"

"సత్తులుకి కూడా బాధగా వుందా?"

అదిరిపడి చూశాడు కన్నబాబు.

నంది అన్నాడు, "అహఁ వాడు కూడా పాపం ఆమె అంత్యక్రియల్లో చురుగ్గానే పాల్గొన్నాడు కదా... అందుకని అడిగాను"

యాంత్రికంగా తలూపుతూ అన్నాడు కన్నబాబు, "పాపం వాడూ చాలా బాధపడ్తున్నాడు"

"నాకు తెలుసు కన్నబాబూ, మీ ముగ్గురూ కలిసి చాలా బాధపడ్డారని, ఆమె అంత్యక్రియల తర్వాత..."

గుడ్లు మిటకరించి చూస్తూండిపోయాడు కన్నబాబు.

అంత్యక్రియల తర్వాత మామయ్య, తను, సత్తులుగాడు కలిసి మందుపార్టీ చేసుకోవడం నందికి తెలుసన్నమాట!

"మేం ముగ్గురం ఏమిటి కన్నబాబూ! కాలేజీలో అందరూ... అసలు కాలేజీ ఏముంది... సిటీలో అందరూ కూడా ముగ్ధ చావు గురించి బాధపడుతున్నారు. మీ నాన్న శపథం పూనాడు రెండ్రోజుల్లో కోతిని పట్టుకుంటానని. మనం అందరం ఆయనతో కోపరేట్ చేయాలి. ఇంక సిటీకి ఈ ప్రాబ్లెం వుండకూడదు. పద ప్లీజ్..."

"కన్నబాబూ, ప్లీజ్ నన్నొదిలిపెట్టు" అన్నాడు నంది.

"నీ ఇష్టం మరి" అని లేచాడు కన్నబాబు.

నంది ప్రవర్తన కొంత వింతగానే అనిపించింది కన్నబాబుకి.

"ఎంతో అమాయకుడైన నంది కొన్ని తెలివైన ప్రశ్నలే వేసి, తనంతటివాడ్ని కంగారు పెట్టాడే! ఆఁ వాడి మొహం. ఏదో కాకతాళీయంగా సందర్భానికీ వాడి ప్రశ్నలకీ పొంతన కుదిరి వుంటుందంతే. అయినా పిచ్చుకలాంటి వెధవ, వాడి గురించి ఆలోచించడం అనవసరం. తను ప్రెసిడెంటు కావాలనుకున్నాడు. అయ్యాడు. తన తండ్రి మేయర్‌పోస్టుకి రిజైన్ చేస్తాడేమోనని భయపడ్డాడుకానీ, ఆయన విరమించుకుని, తన నెత్తిమీద పాలుపోశాడు. రాజకీయాల్లో తను ఓనమాలు దిద్దుకుంటున్నది మామయ్య దీనబంధు దగ్గర. గురువుగారేమిటి, అంత శపథంచేసేశారు. అంటే ఈరాత్రి, రేపు రాత్రి గడిచి కోతి దొరక్కపోతే మామయ్య అందరి ఎదురుగా బాల్చీ తన్నెయ్యడమే? రాజకీయాలమీద అన్ని లెక్చర్లిచ్చిన మామయ్య అంత సులభంగా... ఆయనగారు ఆశించే పదవులని అధిరోహించకుండా...ప్రజలకోసం ప్రాణత్యాగం చేసెయ్యడమే! ఇందులో ఏవిటబ్బా మతలబూ?"

తీవ్రంగా ఆలోచిస్తూ, కారుని అతి రెక్‌లెస్‌గా వేగంగా నడుపుతూ, సందు మలుపు తిరిగి మెయిన్‌రోడ్డుమీదకు వస్తూన్న ప్రొసెషన్‌ని చూసుకోలేదు. గమనించి బ్రేక్‌మీద కాలినివుంచి తొక్కుదామనుకున్నవాడల్లా, కంగారులో ఏక్సిలేటర్‌ని మరింత గట్టిగా తొక్కేశాడు. సర్రున ముందు చక్రాలు గాలిలో ఆరంగుళాల ఎత్తునలేచి తిరిగి నేలమీద వాలి యమవేగంతో ముందుకు దూసుకుపోతున్నాయి. వాటితోబాటే కారంతా కంట్రోల్ చేయడం కన్నబాబు తరం కాలేదు. ముందుకు దూసుకుపోయింది కారు. ప్రొసెషన్‌లోని మనుషులమీదకు ఎక్కేసింది.

అది అపోజిషన్ వాళ్లు తీస్తున్న ప్రొసెషన్.

★ ★ ★

"శపథం చేయడం బాగానే వుందిగాని, ఇలా పత్రికలకి ఎక్కేసి ప్రజల నోళ్లల్లో పడిపోతే ఎలాగయ్యా, కొన్ని పత్రికలయితే నీ ఆత్మాహుతికి ఎల్లుండే ముహూర్తం అని కూడా రాసి పారేశాయి. ఏదయినా చాలా తొందరపాటు చర్య నీది దీనబంధూ..." అంటూ ఏమీ పాలుపోక పచార్లు చేస్తున్నాడు చక్రవర్తి.

"ఆ దిక్కుమాలిని కోతి ఈ రాత్రయినా

పోలీసువాళ్ల కంటపడ్తే బాగుండును, కాల్చి పారేస్తారు, చచ్చి వూరుకుంటుంది. పీడాపోతుంది" అంది ఇంద్రాణి తమ్ముడిమీది ప్రేమతో.

దీనబంధు మాత్రం నిమ్మకు నీరెత్తినట్లు నిల్చుని తీవ్రంగా ఆలోచిస్తున్నాడు.

"ఏమిట్రా ఏమీ మాట్లాడకుండా అలా నిల్చుండిపోయావు? " అనడిగింది ఇంద్రాణి.

"ఆలోచిస్తున్నాను అక్కయ్యా"

"ఏ విషయం? "

"ఎల్లుండి నేను ఆత్మాహుతి చేసుకోవలసిన అవసరం రాకుండా ఎలా ఆపడం అని"

"అంత భయపడేవాడివి అలాంటి నిర్ణయం ఎందుకురా తీసుకున్నావు. ముందూవెనకా ఆలోచించొద్దూ" కసిరింది.

"నేను భయపడేది నా గురించి కాదు అక్కయ్యా ప్రజల గురించి, బావగారి గురించీను. నేను చచ్చిపోతే ప్రపంచం తలకిందులయిపోదు. కాని ప్రజలు, బావగారూ బాధలు పడ్తుంటే నా ఆత్మ శాంతించదు. నేను బతికీ, చచ్చీ బావగారికి ఉపయోగపడకపోతే యెలా? "

చక్రవర్తి మందలిస్తూ అన్నాడు, "దీనబంధూ, ఏవిటా మాటలు. ప్రశాంతంగా వుండు. నేను చూస్తూ వూరుకుని, నీ ప్రాణం పోగొట్టుకోనిస్తానా? "

వాళ్లు యిలా మాట్లాడుకుంటూ వుండగా, కన్నబాబు ఇంట్లోకి రొప్పుతూ రోజుతూ పరుగెత్తుకొచ్చాడు. "డాడీ...డాడీ" అంటూ. వాడి బట్టలు, ఒళ్లు చెమటతో తడిసిపోయి వున్నాయి. ముఖం భయంతో, ఏడుపుతో జేవురించుకుపోయి వుంది.

అదిరిపడ్డారంతా.

ముందు తేరుకున్న చక్రవర్తి, "ఏవిట్రా ఆ కంగారు? ! ఏమయిందీ? " అని అడిగాడు.

వాడు భయంతో చెప్పలేకపోతున్నాడు. ఎక్కడ దాక్కుందామా అన్నట్లుగా వెతుకుతూ, మధ్యమధ్య అంతులేని భయంతో వీధివైపు చూస్తున్నాడు.

"ఏమయ్యిందిరా అంటే చెప్పవేం? " కసిరాడు చక్రవర్తి.

వాడు భయపడుతూ తండ్రివైపు, వీధి గుమ్మంవైపు మార్చి మార్చి చూస్తున్నాడంతే, ఒణికిపోతూ.

ఇంద్రాణికి గుండెల్లో దడ మొదలయ్యింది వాడివాలకం చూస్తుంటే. చేతనయినంత అనునయంగా, కంగారుని దాచుకుంటూ, కొడుకు భుజం మీద చేయివేసి అడిగింది, "ఏమయ్యింది నాన్నా ఎందుకీ భయం? " అని.

"కారుకి..."

"ఊc కారుకి? చెప్పు నాన్నా"

"కారుకి యాక్సిడెంటయ్యింది మమ్మీ"

"అదా తుక్కుతుక్కు అయిపోయిందా కారు. పీడాపోయింది. రేపట్నుంచి సైకిల్ మీద వెళ్లు ఎక్కడికయినా" అన్నాడు చక్రవర్తి ఒళ్లుమండి.

"అది కాదు డాడీ- కారు గురించి కాదు..."

"మరి దేనిగురించి? ! ఎవరి కారుకో స్కూటర్‌కో గుద్దేశావా? వాళ్లు కాంపెన్‌సేషన్ అడుగుతున్నారా? చిల్లు కానీ ఇవ్వను. అయినా చదువుకునే కుర్రాడికి కారు కావాలా? బుద్ధిలేదూ? "

"కాంపెన్‌సేషన్ కాదు డాడీ"

"ఇంకేమిటి మరి? " అనడిగాడు చక్రవర్తి, ఏదో కీడుని శంకిస్తూ.

"కారుకిందపడి... నలుగురు..."

చాచి లెంపకాయ కొట్టాడు కొడుకుని చక్రవర్తి.

"అమ్మా" అరిచి కిందపడ్డాడు కన్నబాబు. 'అయ్యో అయ్యో' అంటూ, కొడుకు దగ్గరకు పరుగెత్తింది ఇంద్రాణి.

చక్రవర్తి ఉగ్రుడై అరిచాడు, "రాస్కెల్, అంతకళ్లు మూసుకుపోయి నడిపావా కారుని" మళ్ళీ మీదకు వెళ్లాడు.

ఇంద్రాణి అడ్డుపడింది.

దీనబంధు కన్నబాబుని లేపి నిలబెట్టాడు.

"అయ్యో అయ్యో, అసలే వాడు యాక్సిడెంటయ్యిందని గాభరాపడ్తూ వస్తే, వాడ్ని కొడతారేమిటండీ. మీరలా కూర్చోండి. మీరేం కలగజేసుకోవద్దు. ప్లీజ్ కూర్చోండి" అంటూ బతిమలాడ్తూ భర్తని కూర్చోబెట్టి, కొడుకుతో, "ఏమయ్యిందిరా నాన్నా కంగారుపడకుండా, మమ్మల్ని కంగారు పెట్టకుండా చెప్పు" అంది.

"యాక్సిడెంటు జరిగిన చోటున్న జనం కారుని తుక్కుతుక్కు చేసేశారు మమ్మీ. నన్ను కొట్టడానికి కర్రలతో వస్తున్నారు. తప్పించుకుని పారిపోయివచ్చాను. డాడీ- భయమేస్తోంది డాడీ. నన్ను రక్షించండి. ప్లీజ్" మళ్ళీ తండ్రి దగ్గరకే పరుగెత్తాడు వాడు భయంతో.

"వీల్లేదు" అన్నాడు చక్రవర్తి తీవ్రస్వరంతో. "తప్పు చేసింది నా కొడుకయినా సరే నేను క్షమించను. ఇంక రక్షించే ప్రశ్నేం వుంది? కారుకింద నలుగురు మనుషులు పడ్డారంటున్నావు. నిన్ను రక్షించాలా ఇడియట్? నాకు తెలియదు, నీ చావు నువ్వు చావు" అంటూ విసురుగా లోపలి గదిలోకి వెళ్ళిపోయాడు.

మతిపోయింది కన్నబాబుకి, ఇంద్రాణికి. "అయ్యో అయ్యో అలా వెళ్ళిపోతే ఎలాగండీ" అంటూ భర్త వెనకే పరుగెత్తింది కాని, దభాలున గది తలుపులు వేసేసుకున్నాడు చక్రవర్తి.

"యాక్సిడెంటు ఎలా జరిగిందిరా కన్నబాబూ?" అన్నాడు దీనబంధు తాపీగా.

"చెప్పేటైములేదు మామయ్యా వాళ్లొచ్చేస్తున్నారు"

"ఫర్వాలేదు చెప్పరా- ఉప్పెనలాంటి ఆవేశాన్ని సైతం చప్పగా చల్లార్చే నేర్పు ఈ మామయ్యకుంది"

"హండ్రడ్ కిలోమీటర్స్ స్పీడులో నడుపుతున్నాను కారుని బంజారాహిల్స్‌లో. పక్క వీధిలోంచి ప్రొసెషన్ వస్తున్నట్లుగా చూసుకోలేదు. ప్రొసెషన్‌ని గమనించేసరికి నా మెదడు బ్లాంక్ అయిపోయింది. ఏం చెయ్యాలో నిర్ణయించుకునేలోపలే వాళ్ళమీదకు దూసుకుపోయింది కారు. కనీసం నలుగురు చచ్చిపోయుంటారు. మరికొంత మందికి దెబ్బలు తగిలాయి. చచ్చీ చెడీ ప్రాణాలతో పారిపోయి వచ్చాను. మామయ్యా డాడీతో చెప్పడానికి భయపడ్డాను. ఆ ప్రొసెషన్ డాడీ అపోజిషన్ పార్టీ వాళ్లది. చాలా భయంగా వుంది. ఇంట్లో డాడీ చంపేస్తారు. బయటకెళ్తే జనం చంపేస్తారు" ఏడ్చేశాడు కన్నబాబు.

కొడుకుని చూస్తూ కళ్లనీళ్లయిపోయింది ఇంద్రాణి. "ఎంత ఖర్మ కాలిపోయిందిరా తండ్రీ" అంది, ఇంకేమనడానికీ తోచక.

దీనబంధు కన్నబాబుని అనునయిస్తూ అన్నాడు, "డోంట్‌వర్రీ కన్నా, ఈ మామయ్య చక్రం అడ్డువేస్తాడు. ఆపదల్లో ఇటువంటి దీనుల్ని ఆదుకునే బంధువే ఈ దీనబంధురా నాన్నా" అంటూ నవ్వాడు ధైర్యం కలిగిస్తూ.

"తమ్ముడూ ఇప్పుడు నువ్వే దిక్కురా" అంది ఇంద్రాణి బేలగా.

"దిక్కు సరే- నాకు దక్కాల్సిన ప్రతిఫలం"

"అయ్యో, దానికోసం మీ బావగారి చెవుల్లో శంఖంపెట్టి వూదుతున్నారా. ప్రతిజ్ఞ పూనినంతలో నిన్ను అన్యాయం అయిపోనివ్వను అని బావగారు చెప్పారు కూడా"

"నువ్వు ఇప్పుడు నన్ను కాపాడితే, అమ్మా, నేను నీకు జన్మంతా రుణపడి వుంటాం మామయ్యా" చేతులు జోడించేశాడు కన్నబాబు.

విజయంగా నవ్వాడు దీనబంధు.

ఆపైన సెల్‌ఫోనులో నెంబర్లు డయల్ చేసి, ఎవరెవర్నో వాయువేగంతో రమ్మన్నాడు. చివరగా పోలీసుస్టేషన్‌కి డయల్

చేశాడు.

★ ★ ★

దీనబంధు ఆత్మాహుతి నిర్ణయం గురించి ప్రచారం నగరం అంతా మహాజోరుగా సాగిపోతోంది. గంటలు గడిచి, గడువు దగ్గరపడుతుంటే దీనబంధు అభిమానుల సంఖ్య పెరగసాగింది. అందరూ రాక్షసకోతి గురించి ఊరికే కబుర్లు చెబ్తున్నారనీ, దీనబంధు ఒక్కడే మనస్తాపంతో బాధపడుతున్నాడనీ, ప్రజలకి యీ సమస్యనుంచి విముక్తి కలిగించని జీవితం వృథా అని భావించే ఆయన ఈ నిర్ణయం తీసుకున్నాడని, మనసున్న, మనిషయిన ప్రతి ఒక్కరూ ఆయన ప్రయత్నాన్ని అభినందించాలనీ ప్రచారం జరుగుతోంది.



'అసలయిన ప్రజానాయకుడు దీనబంధు- వర్ధిల్లాలి'

'మనసున్న మానవతావాది దీనబంధు-జిందాబాద్'

... లాంటి స్లోగన్లు గోడలమీద, పాంప్లెట్లలోనూ.

ఇవన్నీ నంది చెవుల్లోనూ పడుతున్నాయి. కాని అతనికి తండ్రి తీసుకున్న నిర్ణయంలో ఏదో 'మతలబు' వుందీ అని తోస్తోంది. తన నాటకాల బుర్రకి పదును పెట్టాలీ అనిపిస్తోంది. తన ప్రాణంలో ప్రాణం ముగ్ధ ఆత్మకి శాంతి దొరకాలంటే ఆమెని హత్యచేసిన ప్రాణి శిక్షించబడాల్సిందేననిపిస్తోంది. గత రెండుమూడు రోజుల్లో ఇంటా, బయటా, ఆమెకి సంబంధించిన, ఆమెని ఎరిగిన వ్యక్తులు ప్రవర్తించిన తీరు, ఆమెని తీవ్రంగా అభిమానించే తనతో, ఆమె మరణం తరవాత కొందరు వ్యక్తులు ప్రవర్తిస్తూన్న తీరు, అంతా గుర్తుకు తెచ్చుకుంటూ, తనవంతు ఇన్వెస్టిగేషన్ తను చెయ్యడానికి నిర్ణయించుకుని లేచాడు. జేబు తడువుకు చూసుకున్నాడు. పర్సు బరువుగానే తగిలింది. రౌడీ సత్తులుగాడింటివైపు బయలుదేరాడు.

దీనబంధుని అసలయిన ప్రజానాయకుడిగా వర్ణిస్తూ, ఆర్టిస్టులు రాస్తూన్న బ్యానర్లని సూపర్‌వైజ్ చేస్తున్నాడు సత్తులు. రాత్రి జేబులో డబ్బుల్లేక, తాగించేవాళ్లెవరూ కనబడక, క్వార్టర్ మాత్రమే పడింది. దాంతో మహాచికాగ్గా వుంది. అందరిమీద చిర్రుబుర్రులాడిపోతున్నాడు సత్తులు.

"సత్తులూ-బాగున్నావా?" అన్నాడు నంది వాడికి దగ్గరగా వెళ్ళి నిల్చుని.

"ఎవరెహె" అంటూ విసుక్కుంటూ చూసి, "నువ్వటయ్యా నందీ, ఇదుగో మీ బాబువే బేనర్లు రాయిత్తన్నాను. ఎల్లుండి సచ్చిపోతానంటన్నాడు గదా. ఈలోగా వోరెత్తింసేయాల. అందుకన్నమాట. ఔనుగానయ్యా నందీ- మన్లోమనమాట మీ నాన్న నిజంగా సచ్చిపోతాడంటావా? నాకు నమ్మకంలేదు" అంటూ ఘొల్లున నవ్వి, "మీ బాబు గొప్ప పిసినిగొట్టాడయ్యా బాబూ, డబ్బులు ఓపట్టాన ఇవ్వడు. ఇదుగో, అదుగో అంటూ దాటేత్తూ, అయిదూ పదీ సేతిలో ఎడ్తూంటాడు మజ్జన" అన్నాడు చిరాకుపడ్తూ.

"నీకు మానాన్న డబ్బులేం బాకీ వున్నాడు?" అనడిగాడు నంది ఆత్రంగా.

"లేపోడవేంటీ. మొన్న..." అంటూ ఏదో చెప్పబోయి, ఆగి కంట్రోల్ చేసుకుని...

"పనిసేసిపెట్టాలే. ఆ డబ్బులు రావాలి" అన్నాడు సత్తులు.

'ఆపనేం'టో చెబ్తే బాగుండును కదా అనుకున్నాడు నంది.

"అయినా సత్తులూ, మా నాన్న ఇవ్వాల్సిన డబ్బులే కావాలా ఏంటీ నీకు. నీ దగ్గర బోలెడు డబ్బుంటుంది" అన్నాడు ఉబ్బేస్తూ.

"భలే వోడివయ్యా నందీ, నాకాడే డబ్బుంటే ఈ బాదెందుకు? మందుకొడ్డానికి డబ్బుల్లేక నాలిక పిడసకట్టుకుపోతోంది" అన్నాడు సత్తులు.

"ఇప్పుడు పుచ్చుకుంటానంటావా చెప్పు? " అడిగాడు నంది.

"ఇచ్చేవాడేడీ? " అని.

"అంతపున్నోం కట్టుకోడానికి మడిసి ఎవడన్నా సిద్ధంగా వుంటే వొద్దనడానికి ఎర్రా, పిచ్చా నాకు!"

"సరే అయితే పద" చెయ్యిపుచ్చుకున్నాడు నంది.

"ఏంటీ నువ్వూ తాగుతావా? " ఆశ్చర్యపోయాడు సత్తులు.

"ఆ- నా ముగ్ధ చనిపోయాక ప్రారంభించానులే"

"ముగ్ధ- ప్చ్ పాపం సచ్చిపోయిందయ్యా ఎర్రిపిల్ల. సచ్చిపోద్ది అనుకోలేదసలు" అన్నాడు సత్తులు ఏదో గుర్తుచేసుకుంటూ.

అనుకున్న సమాచారం వచ్చేటట్టే అనిపించింది నందికి.

"నువ్వు ముందు పద, నీక్కావలసినంత పోయిస్తానూ" అంటూ, సత్తులు చేయిపట్టుకుని లాగాడు నంది.

"నడు" అంటూ హుషారుగా కదిలాడు సత్తులు.

బార్‌లో కూర్చున్నారిద్దరూ ఫుల్ బాటిల్ పుచ్చుకుని. సత్తులుగాడు చెప్పిన విషయానికి తల తిరిగిపోయినట్లయ్యింది నందికి.

★ ★ ★

రాత్రి పదయ్యింది.

దీనబంధు తీవ్రంగా ఆలోచిస్తూ గదిలో పచార్లు చేస్తున్నాడు. మధ్యమధ్య ఫోను కాల్సు అందుకుంటూ సూచనలు, సలహాలు ఇస్తున్నాడు. కొందరితో తను ఈ రాత్రి గస్తీ తిరగబోతున్నట్లుగా చెబుతున్నాడు.

"ఏం దీనబంధూ, గస్తీకి వెళ్లడానికే నిర్ణయించుకున్నావా? " అనడిగాడు గదిలోకి వస్తూ చక్రవర్తి.

"అవును బావగారూ, ఈ రాత్రంతా గస్తీ తిరుగుతాం నేను, నా మనుషులు. వెహికల్స్, సెల్‌ఫోన్సు, వెపన్సు అన్నీ రెడీ పెట్టుకుంటున్నాను. ఆ కోతి ఉనికి తెలిసిన తక్షణమే ఆ ఏరియాలో మేము వాలి అష్ట దిగ్బంధం చేస్తాం. ఈ రాత్రి ఆ కోతి నాకు దొరికి తీరుతుంది. తప్పితే రేపు రాత్రి తప్పదు. బాగా పకడ్బందీగా ప్లాను వేస్తున్నాను" అన్నాడు దీనబంధు.

"అది కాదు దీనబంధూ, పోలీసు బందోబస్తు బాగా ఎక్కువ చేశారు. అన్ని ఏరియాల్లో పోలీసుల్ని మోహరించారు. నువ్వు శ్రమ తీసుకోవాలా చెప్పు"

"ప్రజాసేవలో నాకు ఆనందం వుంది బావగారూ, మీరు మాత్రం పోలీసులే చూసుకుంటారని వూరుకుంటున్నారా? అనుక్షణం ఆ రాక్షసకోతి గురించే ఆలోచించడంలేదూ? ఆ సమస్య వున్నంతవరకూ మనిద్దరికీ ఈ క్షోభ తప్పదు. ఇంకెంత, రెండు రాత్రులేగా? "

"ఏమిటో నీ పిచ్చినీది. సరే, పోలీసు వ్యాను, జీపు మీ వెనకే వుండి, మీకు సహాయపడ్తాయి. సరా? "

"వద్దు" గభాలున అన్నాడు దీనబంధు. "పోలీసులు అతి తెలివి ప్రదర్శించి, నా ప్లాను పాడుచేసే ప్రమాదం వుంది. అవసరాన్నిబట్టి నేనే వాళ్లసహాయం తీసుకుంటాను. దయచేసి పోలీసుల్ని మా దరిదాపులకి రావొద్దని చెప్పండి" రిక్వెస్టు చేశాడు దీనబంధు.

"అది కాదయ్యా, పోలీసుల సాయంలే

కుండా"

"ప్లీజ్- నా ప్లాను ప్రకారం నన్ను నడవ నీయండి. ఎల్లుండి పొద్దున్నకల్లా రిజల్టు చూపించి, మీ మనస్తాపం తీర్చే బాధ్యత నాది కదా! నా బాధ్యత నేను నెరవేర్చలేద నుకోండి. ఎవరూ శిక్షించక్కర్లేదు నన్ను. నా ఆత్మాహుతి కార్యక్రమం ఎలాగూ వుంది" నవ్వాడు దీనబంధు అదోవిధమైన ధైర్యంతో.

చక్రవర్తి నవ్వలేకపోయాడు.

"నిన్ను అర్థంచేసుకోవడం చాలా కష్ట మయ్యా" అన్నాడు.

"అందుకనే కదా బావగారూ, రాజకీ యంలో నేను పైకి రాలేకపోయాను. ప్రజలు నన్ను అర్థంచేసుకోలేకపోయారు" అన్నాడు బాధగా.

"లేదు, తప్పక అర్థంచేసుకుంటారు దీన బంధూ" అన్నాడు చక్రవర్తి.

★ ★ ★

రాత్రి పన్నెండు గంటలవేళ,

పోలీసు వ్యాన్లు, జీపులు కాలనీల్లో తిరు గుతున్నాయి.

దీనబంధు కోరిక ప్రకారం అతను, అతని అనుచరులు ఎక్కడెక్కడ తిరగదలుచుకుంటు న్నారో ఆ ఏరియాల్లోకి మాత్రం పోలీసులు పోవడంలేదు. క్షణాల్లో తన ప్రోగ్రాంని మార్చుకుంటూ, పోలీసులకి తెలియజేస్తు న్నాడు దీనబంధు. ఆ ఏరియాలోంచి వెంటనే పోలీసుల్ని పంపించేసే ఏర్పాటు చేస్తున్నారు అధికార్లు. మధ్యమధ్యలో దీన బంధు ఏ ఏరియాలో వున్నాడో అధికారులకి సైతం సమాచారం అందడంలేదు.

మనస్సంతా బాగా చికాకుగా వుంది దీన బంధుకి.

అతనికి కావలసిన వ్యక్తినుంచి ఫోనింకా రాలేదు.

ఈరాత్రి, తప్పితే రేపు రాత్రితో ఈ సమస్య తీరిపోవాలి. తాను పరిష్కారం చూపించాలి. తానొక్కడే చూపించగలగాలి. ఆ క్రెడిట్ తనకి దక్కాలి. పరిష్కారానికి అవసరమైన రీతిలో ఆలోచించగల బుర్ర వుంది తనకి. తగ్గప్లాను వుంది. తగ్గ బలగం వుంది. శని దేవత మోకాలు అడ్డ కుండా వుంటే చాలు.

తిరుగుతున్నాడు దీనబంధు. వాయువే గంతో, మెయిన్‌రోడ్‌లలో, కాలనీల్లో, బస్తీ లలో, మైదానాల్లో, ఊరిచివరి ఏరియాల్లో, వెహికల్స్‌మీద, కాలినడకన, ఫోన్లకు ఫోన్లు చేస్తున్నాడు, రిసీవ్ చేసుకుంటున్నాడు, సెల్‌ఫోను చెవిదగ్గరనుంచి తీయడమేలేదు.

మధ్యమధ్యలో పోలీసుజీపులు ఎదురుప డ్తున్నాయి.

"సర్ ఫాలో అవమంటారా సెక్యూరిటీ కోసం?" అని అడుగుతున్నారు వాళ్లు. మర్యాదగా తిరస్కరించి, ముందుకు సాగు తున్నాడు దీనబంధు.

ఒంటిగంటయ్యింది.

కావలసిన ఫోను రాలేదు.

అసలెటువంటి ఇన్ఫర్‌మేషన్‌లేదు.

గుండెలు మండిపోతున్నాయి దీనబం ధుకి.

★ ★ ★

ఇంటి దగ్గర,

చక్రవర్తికి నిద్రపట్టడం లేదు.

వరండాలో పచార్లు చేస్తున్నాడు. పడుకో మని భార్య బతిమిలాడి, ఫలితంలేక లోప లకి వెళ్ళిపోయింది. ఆవిడకి తమ్ముడి గురించీ, భర్త గురించీ కూడా విచారంగా వుంది. లోపలకి వెళ్లేముందు, "ఏదో ప్రయత్నం మీద మీరు మా తమ్ముడ్ని బయటకు వెళ్లకుండా ఆపివుంటే బాగుం డేది" అంది భయాన్ని వ్యక్తంచేస్తూ.

"ఎలా ఆపమంటావు, ఒట్టి దూకుడు మనిషి. ఎవరిమీదన్నా ప్రేమవచ్చినా, కోపంవచ్చినా కష్టమేకదా అతన్తో. అతని కొడుకు చూస్తే ముగ్ధపోయినప్పట్నుంచీ అలా తయారయ్యాడు. మన వంశోద్ధార కుడు చూస్తే ఇలా అఘోరించాడు. చచ,

నా ఖర్మ కొద్దీ దొరికారంతా" విసురుగా పచార్లు చేయనారంభించాడు చక్రవర్తి.

"పోన్లెండి, మనస్సు పాడుచేసుకోకండి"

"ఎలా? మనస్సు పాడుచేసుకోకుండా వుండడం యెలా? ముందీ కోతి సమస్య తీరాలి కదా. అది ఈ రాత్రి ఎవర్నీ గాయ పరచకుండా వుండాలి. ఈ రాత్రి ప్రశాం తంగా గడవాలి. అది పోలీసులకో, దీనబం ధుకో కనిపించినా, వీళ్లు దాన్ని బంధించగ లిగితే సంతోషం. అల్లాకాక, వీలుకాక వీళ్లు దాన్ని చంపేస్తారేమోనని కూడా నాకు భయంగా వుంది"

"అదేమిటి, చంపేస్తే భయందేనికీ? "

"కోతుల్ని చంపడం మహాపాపం ఇంద్రాణీ. అందులో హిందువులం, మనం వాటిని ఆంజనేయ స్వరూపాలుగా కొలుస్తాం. దేవుడి దయవలన అది ఎవ్వ రికీ హానిచేయకుండా ఏ అడవుల్లోకో పారి పోతే అందరం వూపిరి పీల్చుకోవచ్చు"

"నిజమేనండీ. సరే- నిద్దరొస్తోంది. నేను పడుకుంటాను. మీరు కూడా ఎక్కువసేపు మేల్కొనివుండక పడుకోండి. మా తమ్ము డికి ఓసారి సెల్‌ఫోన్లో ఆ కోతిని చంపే ప్రయత్నం చెయ్యొద్దని చెప్పండి. మనమెం దుకు పాపాన్ని మూటకట్టుకోవాలి" అంటూ లోపలకి నడిచిందామె.

'అలాగే' అన్నట్లుగా తలవూపి, పచార్లు చేస్తున్నాడు చక్రవర్తి. ఆనందరావునుంచి ఫోను వచ్చింది. అతను చెప్పిన విషయాల్ని జాగర్తగా విని, "అలాగే తప్పకుండా, జాగ ర్తలు తీసుకుంటాను" అని చెప్పి, పోలీసు కమీషనర్‌కి ఫోను చేశాడు చక్రవర్తి.

దీనబంధు వద్దన్నా, అతనికి ఏమాత్రం తెలియకుండా రహస్యంగా పోలీసు సహా యాన్ని అందుబాటులో వుంచుతాననీ, తొంభయితొమ్మిదిశాతం కోతి ఎదురుపడ్డ ప్పటికీ హాని చేయకుండా, బంధించడానికే ప్రయత్నించమని పెట్రోలింగ్ పార్టీలని హెచ్చరించానని కమీషనర్ చెప్పాడు.

చక్రవర్తికి మనసు కుదుటపడింది.

'భగవంతుడా, నన్ను, నా నగరాన్నీ ఈ సమస్యనుంచి బయటపడెయ్యి. ఈ వానర మేధాన్ని ఆపు'

చక్రవర్తి పడకగదివైపు నడిచాడు.

★ ★ ★

రాత్రి రెండయ్యింది.

దీనబంధు బాగా అలసిపోతున్నాడు శారీ రకంగా కంటే, ఎక్కువగా మానసికంగా. కోతి కనబల్లేదు. ఎవర్నీ ఇబ్బందిపెట్టిన ట్లుగా ఇన్‌ఫర్‌మేషనూ లేదు. ఇటు 'రావల సిన' ముఖ్యమైన ఫోనుగాని, సమాచారం గాని లేదు.

అశాంతిగా తిరుగుతున్నాడు దీనబంధు ముఖ్యమైన అనుచరులతో.

ఇంతలో 'ఫలానా ఏరియాలో రాక్షసకోతి ఎవర్నో గాయపరిచి పారిపోయిందిట' అని వార్తవచ్చింది. ఆశ్చర్యపోయాడు దీనబంధు! 'ఆ ఏరియాలో అది 'అలా' చేయడానికి అవ కాశంలేదే! అందుకనే తను ఆ ఏరియా తప్ప, మిగిలిన నగరమంతా కాన్సన్ట్రేట్ చేశాడు. తన అంచనాలు తారుమారవ డమా? కొద్ది నిముషాల్లోనే ఆ ఏరియాలో వాలాడు దీనబంధు.

అక్కడ రెండు పోలీసువ్యాన్లు, ఒక జీపు ఆగివున్నాయి. పాతిక ముప్పై మంది పోలీ సులు కనిపిస్తున్నారు. ఇళ్లల్లో లైట్లు వెలు గుతున్నాయి. పోలీసులు అంతమంది వుండడంతో ఇళ్లల్లోని ఆడ, మగ ధైర్యంగా బయటకొచ్చి, కోతి గాయపరచిపోయిన వ్యక్తిని పరామర్శిస్తున్నారు.

కారు దిగి, కంగారుగా గుంపువైపు నడి చాడు దీనబంధు.

"మంచి బలం, ఒడ్డూ, పొడుగూవున్న మనిషి కాబట్టి, దాన్ని ఎదుర్కోగలిగి వుంటాడు. అందుకనే కొద్దిగానే గాయప రచి, అదీ భయపడి పారిపోయింది. అదే మనలాంటి వాళ్లమయితే, చంపిపారేసివుం డేది" అంటున్నారెవరో.

ఆ మాటలకు అదిరిపడ్డాడు దీనబంధు. ఆ ఏరియాలో మంచి బలం, ఒడ్డూ పొడుగూ వున్న మనిషి అంటే... కొంప దీసి?

దీనబంధు అడుగులు వడివడిగా పడ్డాయి గుంపువైపు.

పోలీసు ఇన్‌స్పెక్టర్ విష్‌చేశాడు దీనబంధుకి.

'ఎవరు' అన్నట్టుగా చూశాడు దీనబంధు ముందుకు సాగుతూ.

"ఎవరో ప్రకాశంట సార్" అన్నాడు ఇన్‌స్పెక్టర్ ఫాలో అవుతూ.

ఉలిక్కిపడ్డాడు దీనబంధు. మెదడు బద్ధలయినట్లయ్యింది. యాంత్రికంగా ముందుకు సాగాడు.

అక్కడ, ఒక ఇంటి అరుగుమీద కూర్చుని వున్నాడు ప్రకాశం. ముఖంమీద, చేతుల మీద కోతి చేసిన గాయాలున్నాయి.

దీనబంధుని చూస్తూనే, కళ్లనీళ్లు పెట్టుకుని, "పదిపన్నెండు అడుగుల ఎత్తువున్న కోతి సర్. టాయ్‌లెట్‌కని ఇంట్లోంచి బయటకు వచ్చాను. అమాంతం ఆ చెట్టుమీద నుంచి నామీదకు దూకి, రక్కేసి పారిపోయింది" అన్నాడు ప్రకాశం బేలగా.

నిలువు గుడ్లేసుకుని చూస్తున్నాడు దీనబంధు.

"నిద్రకళ్లమీదవున్నాను. లేకపోతే దాన్ని ఎలాగోలా తిరిగి గాయపరచి, వీలయితే కాళ్లు విరిచేసి, తాళ్లతో కట్టిపడేసివుండేవాడిని. అథాటుగా అది మీదకు దూకేసరికి కాచుకోవడంతోనే సరిపోయింది. అప్పటికీ తిరగబడ్డాను. పిడికిళ్లతో దెబ్బతీశాను కూడా. అదీ భయపడింది. అందుకనే వెనక్కి చూడకుండా పారిపోయింది" అంటూ గాయాలకేసి చూసుకోసాగాడు.

నిద్రలో వింటున్నట్టుగా వుంది దీనబంధుకి.

ప్రకాశాన్ని ఏవిధంగా అర్థంచేసుకోవాలా అని ఆలోచన్లోపడ్డాడు.

★ ★ ★

ఫలానా ఏరియాలో ప్రకాశం అనే యువకుడ్ని రాక్షసకోతి గాయపరచి పారిపోయిందన్న వార్త పోలీసులద్వారా చక్రవర్తికి, చక్రవర్తిద్వారా ఆనందరావుకి అందింది.

తీవ్రంగా ప్రతిఘటించాడు కాబట్టే ప్రకాశం రక్షించబడ్డాడు అని తెలిసింది. అయితే తనని దెబ్బతీశాడని ఆ కోతి తిరిగొచ్చి మళ్ళీ ప్రకాశాన్ని దెబ్బతీస్తుందేమోనని, ప్రకాశానికి గట్టి రక్షణ కలిపించమని, ఈ రాత్రి దాటిపోతే ఫరవాలేదని ఆనందరావు చెప్పాడు. అదేవిషయాన్ని పోలీసు కమీషనర్‌కి తెలియజేశాడు చక్రవర్తి.

తెల్లవారేవరకూ ప్రకాశానికి గట్టిరక్షణ ఏర్పాట్లు చేశాడు పోలీసుకమీషనర్.

★ ★ ★

తెల్లవారుతూండగా.

ప్రకాశాన్ని కలిశాడు ఆనందరావు పోలీస్ పర్మిషన్‌తో.

జరిగిన సంఘటన గురించి పూర్తి వివరాలు తీసుకున్నాడు.

అతన్ని గురించి 'పూర్తిగా' తెలుసుకున్నాడు.

అతనికి తగిలిన గాయాల్ని 'జాగర్తగా' గమనించాడు. అభినందిస్తూ నవ్వాడు. అతని పెర్సనాలిటీని, తెలివితేటల్నీ, చదువునీ మెచ్చుకుని, ఊరడించి, ధైర్యం చెప్పాడు.

నిరాశ చెందొద్దని, మంచి రోజులు ముందున్నాయని, ఆశయాలు నెరవేర్చుకోవచ్చని చెప్పి, బయల్దేరడానికి లేచాడు.

ప్రకాశం లేచి నిలబడ్డాడు చేతులు జోడించి.

★ ★ ★

ఆనందరావు చెప్పిన దానిని బట్టి, రాక్షస కోతి సమస్య తీరే సూచనలు బలంగానే కనిపిస్తుండడంతో టెన్షన్ తగ్గి రాత్రి రెండు గంటల తర్వాత సుఖంగానే నిద్రపోయాడు చక్రవర్తి.

నిద్ర లేచేసరికి బాగా పొద్దెక్కింది.

కొడుకు కన్నబాబు, వాడి యాక్సిడెంటు సమస్య గుర్తొచ్చాయి. గబగబా వాడి గది లోకి నడిచాడు. వాడు లేడక్కడ. దీన బంధు రూములో గానీ పడుకున్నాడేమో నని అక్కడికి వెళ్ళాడు. ఆ రూములోనూ లేడు కన్నబాబు.

నిద్రపట్టక అర్ధరాత్రినుంచీ పక్కమీద దొర్లుతూన్న దీనబంధు- బావగారు తన గదికి వచ్చేసరికి దిగ్గున లేచి కూర్చుని, "ఏమిటి బావగారూ-" అన్నాడు కంగారుగా.

"ఏంలేదు- కన్నబాబు వున్నాడేమోనని వచ్చాను"

"వాడి రూములో లేడా? "

"లేడు. పొద్దున్నే ఎక్కడకు పోయుం టాడు? "

"ఉండే వుంటాడు బావగారూ ఇంట్లోనే ఎక్కడో..."

"రాత్రి నువ్వు పాపం బాగా శ్రమ పడ్డ ట్లున్నావు. తెల్లవారు గట్లవరకూ గస్తీ తిరి గినట్లున్నావు. ఇలా అయితే ఎలా అయ్యా. నీ గురించి మీ అక్క ఎంత బెంగ పెట్టు కుందో తెలుసా నీకు? "

"తప్పదుకదా బావగారూ- ఈ రాత్రి దాన్ని ఎలాగయినా లొకేట్ చేస్తాను. రేపు ఉదయానికల్లా ఈ సమస్యకి పరిష్కారం దొరికి తీరాలి"

"ఎవరో పాపం ప్రకాశం అనే అబ్బాయిని ఆ రాక్షసకోతి గాయపరిచిందిట. ఇందాక కమీషనర్‌గారు ఫోను చేశారు"

"అవును- రాత్రే నాకు తెలిసింది. మన వాలంటీరే బావగారూ అతను. రాత్రే వెళ్ళి పరామర్శించాను"

"ఈ రాత్రికి అది దొరికిపోవాలని దేవుడ్ని కోరుకుంటున్నాను. నీ గురించి టెన్షన్ నేను భరించలేను..." అంటూ బయటకు నడి చాడు చక్రవర్తి.

మంచం మీద కూర్చున్న దీనబంధుకి ఆలోచించి ఆలోచించి తలనొప్పి వస్తోంది.

'ఈరోజు... ఆఖరి రోజు... తన జీవితానికి పరీక్షా సమయం. ఇందులో నెగ్గితేనే తనకి రాజకీయంగా బంగారు భవిష్యత్తు... నెగ్గక పోతే బతుకు వృధాయే...'

సెల్‌ఫోను అందుకున్నాడు. తనముఖ్య అనుచరుడికి ఫోనుచేసి, "నువ్వు ప్రకాశం ఇంటికి వెంటనే వెళ్ళి అతన్ని వెంటనే నన్నొచ్చి కలవమను" అని చెప్పాడు.

మంచం దిగి ముఖం కడుక్కుని కాఫీ తాగుదామనుకుని కిందకు బయల్దేరాడు. సెల్ మోగింది.

"హల్లో..."

"అయ్యా, ప్రకాశం ఇంటికి తాళం వుంది. అతనుగాని, అతని తమ్ముడు, చెల్లెలూగాని ఎక్కడికి పోయారో తెలియదంటున్నారు పక్కిళ్ళవాళ్ళు..."

తల తిరిగిపోయింది దీనబంధుకి. ప్రతా ప్‌కి ఫోను కొట్టాడు.

ఇంతలో డైనింగ్ హాలులో అక్క, బావ గారు గొడవపడడం వినిపించింది. గట్టిగా చికాకుపడుతున్నాడు బావగారు. తన ఆలో చన నెరవేరాలంటే ఆయన ప్రశాంతంగా వుండాలి. ఆయనకి కోపం, చికాకు ఎక్కువ అయితే మొదటికే మోసం రావచ్చు తనకి.

అటు నడిచాడు దీనబంధు.

"ఇంకేం చెప్పొద్దు నువ్వు- ఆ రాస్కెల్ మీద ఎటువంటి ప్రేమ, జాలి లేవు నాకు" అంటున్నాడు బావగారు.

కొంపదీసి తన గురించా అని భయప డ్డాడు దీనబంధు.

"ఒక్కగానొక్క బిడ్డ-కుర్రతనంకొద్దీ దూకు డుగా నడిపాడు కారు. వాడేమీ యాక్సి డెంటు కావాలని చెయ్యలేదుగా? !" అంటోంది అక్కగారు.

"హమ్మయ్య" అనుకున్నాడు దీనబంధు. తన గురించి కాదు. వాళ్ళ కొడుకుని గురించి వాళ్ళు తగవు పడుతున్నారు. అది చిన్న సమస్య. తను వాళ్ళకు కొంచెం వూరట మాటలు చెప్పేసి, తన అసలు పెద్ద

సమస్య మీద కాన్సన్ట్రేట్ చేయాలి.

చక్రవర్తి గొంతు మళ్లీ హెచ్చింది. "కావాలని చేసినా, తొందరపాటులో చేసినా జరిగింది ఘోరం కాబట్టి ఆ వెధవని నేను రక్షించను. అందులో వాడు దూకుడుగా కారుని పోనిచ్చింది అపోజిషన్‌వాళ్ల ప్రొసెషన్ మీదకు. ఇప్పటికే రాక్షసకోతి విషయంలో నా చేతకానితనానికి చెప్పులు విసుర్తున్నారు. ఇప్పుడు కావాలని యాక్సిడెంటు చేయించానంటూ మొహంమీద ఉమ్ము వేసినా ఆశ్చర్యపోనక్కర్లేదు. అసలు నిన్ననే ఆ వెధవని ఆ జనానికి వదిలేసివుంటే ఏకీలుకాకీలు విరిచి మూలపడేసేవారు పీడా పోయేది"

"ఆఁ పోయేది! ఉన్న ఒక్క కొడుకునీ జనానికి బలిచేసి, మనిద్దరం ఇంత ఆస్థినీ ఉట్టి కట్టుకుని వూరేగుదాం" కొడుకుమీది మమకారంతో ఇంద్రాణిలో ఉక్రోషం తన్నుకొస్తోంది.

విసురుగా చూశాడు చక్రవర్తి భార్యవైపు.

"అరె, ఒక్క నీ కొడుకు గురించే ఆలోచిస్తున్నావుగానీ, వాడి పొగరు, తొందరపాటు, నిర్లక్ష్యం కారణంగా ప్రాణాలు పోగొట్టుకున్న వాళ్లని గురించి ఆలోచించవేం? మనుషుల ప్రాణాలంటే లెక్కలేదా మీకు? " చక్రవర్తి కోపం తారస్థాయికి చేరింది.

భయంతో, బాధతో దుఃఖం తన్నుకొస్తుండగా, "అయ్యో అయ్యో- వాళ్ళకంటే ఎక్కువగా మీరే బాధపడిపోతున్నారే. వాళ్ళకంటే ముందు మీరే వాణ్ని ఉరికంబం ఎక్కించేలాగున్నారు" అంది, కొంగు నోట్లో కుక్కుకుంటూ.

"సమాజం మీద గౌరవం లేని వెధవలు ఉరికంబం ఎక్కినా లోకానికి నష్టంలేదు" అరిచాడు చక్రవర్తి.

ఇంక తను కలగజేసుకోకపోతే, పరిస్థితి చెయ్యి జారిపోయేలా వుందని గ్రహించిన దీనబంధు, "బావగారూ కన్నబాబుని నేను మందలించాను. ఆ జనాన్ని నేను ఎలాగోలా గొడవ చేయకుండా వూరడించాను. ఇంక మధ్యలో మీరెందుకు గొడవపడడం? ప్రశాంతంగా వుండండి" అన్నాడు సానునయంగా.

చర్రున లేచాడు చక్రవర్తి దీనబంధు మీద, "అసలు నువ్వుకదూ- ఆ వెధవకు కొమ్ములు మొలిపించిందీ? అక్కా తమ్ముళ్ళిద్దరూ కలిసి వాడిని 'యువరాజు' అంటూ ఆకాశానికి ఎత్తేశారూ, దాంతో వాడికి గీర పెరిగిపోయింది. ఎవరి కంట్రోల్ లేకుండా పోయింది. యాక్సిడెంట్లూ చేస్తాడు, రేప్పొద్దున్న హత్యలూ చేస్తాడు..."

ఏం మాట్లాడలేకపోయాడు దీనబంధు.

విషయం తనవైపు తిరిగి పోతుందేమోనని భయపడ్డాడు.

సింహాచలం వచ్చి చేతులు కట్టుకుని నిలబడ్డాడు.

ఏమిటన్నట్లు చూశాడు చక్రవర్తి.

పోలీసు ఇన్‌స్పెక్టర్ వచ్చాడని సంజ్ఞలతో చెప్పాడు సింహాచలం.

ఈ టైములో ఇన్‌స్పెక్టర్ ఎందుకు వచ్చాడా అని ఆశ్చర్యపోయాడు చక్రవర్తి. ఎందుకో అతను రావడమూ ఓ విధంగా మంచిదే అనిపించింది. చరచరా బయటకు వచ్చాడు.

ఇన్‌స్పెక్టర్ ప్రతాప్ సెల్యూట్ చేశాడు.

తిరిగి నమస్కారం పెడ్తూ, "రావయ్యా ప్రతాప్ రా... కూర్చో" అన్నాడు చక్రవర్తి.

దీనబంధు తనని ఎందుకు పిలిపించి వుంటాడా అని ఆలోచిస్తూ కూర్చున్నాడు ప్రతాప్. చక్రవర్తి చాలా సీరియస్‌గా వున్నట్లుగా కూడా అతను గ్రహించాడు.

చక్రవర్తి తన కోపాన్ని కంట్రోల్ చేసుకోవడానికి ఓ నిమిషంపాటు కళ్లు మూసుకుని సోఫాలో వెనక్కివాలాడు.

అక్కగారికి వూరట కలిగిస్తూ సంజ్ఞలు చేసి, ఆమెని అక్కడే వుండిపొమ్మని, తను బయటకొచ్చాడు దీనబంధు.

చక్రవర్తికి ఎందుకో కోపాన్ని కంట్రోల్

చేసుకోవడం కుదరడంలేదు. తనని, తన వంశాన్ని ఉద్ధరించవలసిన కొడుకు తన ఆశయాలకి, ఆశలకి పూర్తిగా విరుద్ధంగా ప్రవర్తిస్తున్నాడనిపిస్తోంది.

కళ్లు తెరచి, ఒక్కసారిగా కొడుకుమీది కోపాన్ని ప్రతాప్ దగ్గర వెళ్ళగక్కాడు చక్రవర్తి. "మా రాస్కెల్... మా పుత్రరత్నం ఇంటి దగ్గర లేడు. ఎక్కడ చచ్చాడో వెతికి పట్టుకుని, బేడీలు వేసి తీసుకెళ్లి కటకటాల వెనక పడెయ్యి. జనం సుఖపడతారు. ఇటువంటి దౌర్భాగ్యులు వుంటేనేం వూడితేనేం? సొసైటీకి ఏవిధంగానూ ఉపయోగపడని వెధవల్ని ఏరి, అడవుల్లో మృగాలకి ఆహారంగా పడేయాలి. ఆ పని చెయ్యండయ్యా, దేశం బాగువడుతుంది" అన్నాడు.

ప్రతాప్‌కి ఏం మాట్లాడాలో అర్థంకాలేదు.

చక్రవర్తిలో అంత కోపాన్ని అతడు ఎన్నడూ చూడలేదు.

దీనబంధువైపు అయోమయంగా చూశాడు.

దీనబంధు కలగజేసుకుంటూ సాత్వికంగా అన్నాడు, "బావగారూ మీరే అలా చెబితే ఎలా? ఇన్‌స్పెక్టర్ని నేనే రమ్మన్నాను. మీరీ విషయంలో కలగజేసుకోకండి. ఇప్పుడు ఆవేశంలో మీరు ఏ నిర్ణయం తీసుకున్నా, రేప్పొద్దున్న జీవితాంతం బాధపడాల్సివస్తుంది. ఏదో కుర్రతనం. నాలుగేళ్లుపోతే వాడే తెలుసుకుంటాడు. మీకెందుకు వాడిని దారిలో పెట్టే విషయం నేను చూసుకుంటానుగా..."

"అవును సర్ నేనూ వారూ చూస్తాం. మీరు ప్రశాంతంగా వుండండి" అన్నాడు ప్రతాప్.

"ఆఁ ప్రతాప్‌గారూ- మనం ఇప్పుడు ఏం చెయ్యాలంటే కారు నడిపింది కన్నబాబు కాదూ- వేరొకరూ అని కేసు రిజిష్టరు చెయ్యాలి. ఆ వేరొకర్ని నేను ఆల్రెడీ నియమించాను. ఓ నెల్లాళ్లు వాడు జైల్లో కూర్చుని రావడానికి సిద్ధమే. దానికి తగ్గ పారితోషికం వుంటుంది వాడికి. ఇక మన కన్నబాబు యాక్సిడెంటు జరిగిన సమయంలో రాక్షసకోతివల్ల గాయపడ్డ కిష్టయ్యకి సేవచేస్తూ అతని ఇంట్లో వున్నాడని ఎలిబీ సృష్టించాలి" అన్నాడు దీనబంధు.

చాలా చిరాకనిపించింది చక్రవర్తికి. "ఎందుకయ్యా, ఎందుకయ్యా అంత పచ్చి అబద్ధాలు. ఒక స్కౌండ్రల్‌ని రక్షించడం కోసం..." అంటూ ఏదో అనభోతుంటే, దీనబంధు రెండుచేతులూ జోడించి, "బావగారూ- దయచేసి, యింక యీవిషయంలో మీరేంమాట్లాడొద్దు" అన్నాడు.

తలుపుచాటు నుంచుని వింటూన్న ఇంద్రాణి, బయటికొచ్చి భర్తతో, "మీకు దణ్ణంపెడ్తాను- మీరు కలగజేసుకోకండి. మా తమ్ముడు చూసుకుంటాడు అంతా. ఈసారేమయినా వాడు తప్పుచేస్తే, నేనే శిక్షిస్తాను వాడ్ని. ఒట్టు." అంది రుద్ధమైపోతూన్న గొంతుతో.

"అవును సర్- ఈ ఒక్కవిషయం మీకు తెలియనట్లు మాకు వదిలెయ్యండి. అయినా, మీరు ఈ కాలంలో యింతగా న్యాయం కోసం, ధర్మం కోసం తలక్రిందులైపోతే ఎల్లా సర్. వెధవది- చిన్న చిన్న పొలిటీషియన్సే మాచేత అనేక పన్లు చేయించుకుంటూ వుంటారు. కేసుల్ని రకరకాలుగా మార్పిస్తూ వుంటారు. మీరు..." అంటూ ప్రతాప్ ఏదో అనబోయి, మాటలు మింగేశాడు.

చక్రవర్తి కోపంగా ప్రతాప్‌తో ఏదో అనబోయాడుగాని, అక్కాతమ్ముళ్లిద్దరూ చేతులు జోడించి అడ్డుపడ్డారు. "ప్లీజ్... ప్లీజ్... ప్లీజ్ బావగారూ, ఇంక మీరేం మాట్లాడొద్దన్నానుగా..." అన్నాడు దీనబంధు.

"మీరేం మాట్లాడినా నన్ను చంపుకుతిన్నట్లే" అంది ఇంద్రాణి.

"ఇంక మరో ఆలోచన వద్దు. కన్నబాబు ఇక ఫ్రీబర్డ్" అన్నాడు ఇన్‌స్పెక్టర్ ప్రతాప్. "ఒక్క గంటలో కన్నబాబుని ఎక్కడున్నా తీసుకొస్తాను సర్" అని కూడా అన్నాడు.

"మీ చావు మీరు చావండి" అని విసురుగా లేచి, లోపలకి నడిచాడు చక్రవర్తి.

'హమ్మయ్య' అని ఊపిరి పీల్చుకుంది ఇంద్రాణి.

"నువ్వు లోపలికి పోయి పనిచూసుకో అక్కయ్యా- నేను చూసుకుంటాను" అని, ఇన్‌స్పెక్టర్‌ని గేటువరకూ దింపడానికి బయలుదేరాడు దీనబంధు.

"ఇన్‌స్పెక్టర్- ఈ ఒక్క ఇరవైనాలుగ్గం టల్లో నేను ఆ రాక్షసకోతి విషయం తేల్చాలి. లేకపోతే నేను రేపు ఆత్మాహుతి చేసుకోవడం తప్పదు. దాన్ని పట్టుకోవడా నికి మీ డిపార్ట్‌మెంట్ తంటాలుపడుతూ ఫెయిల్ అవుతోంది. నాకు ఇప్పుడు ఒక వ్యక్తి సాయం కావాలి. అతని తెలివి తేటలుకి నిస్వార్థ బుద్ధి తోడయితే ఈరోజు ఆ కోతి నా వల్లో పడి తీరుతుంది. మిమ్మల్ని ఎందుకు పిలిపించానంటే- నిన్న రాత్రే ఆ వ్యక్తికి కోతివల్ల దెబ్బలు తగి లాయి. ఈరోజు అతని ఇల్లు తాళం పెట్టి వుంది. అతనెక్కడికి వెళ్లిందీ తెలియదు. మీరు అతన్ని గురించి వాకబుచేసి, ఓ గంటలో నాకు తెలియచేయాలి. అర్జంటు" ప్రకాశం వివరాలు తీసుకుని మోటార్ సైకిల్ స్టార్టుచేశాడు ఇన్‌స్పెక్టర్.

★ ★ ★

రౌడీ సత్తులుగాడ్ని తాగించినదానికి రావ లసిన సమాచారం దొరికింది నందికి. కానీ, వాడు చెప్పిన అసలు నిజం గుండెల్ని రంప పుకోత కోసేస్తోంది. ఆ నిజాన్ని భరించడం తన తరం కావడంలేదు. చిన్నప్పుడు అమ్మ ఒడిలో కూర్చుని, ఎప్పుడో పురాణయుగంలో రాక్షసులుండేవారని కథలు వినేవాడు. కాని ఇప్పుడూ వున్నారని జీవిత అను భవం చెబ్తోంది. ఆ రాక్షసులకి కోరలు, భయంకర ఆకారం వుండేవట. వాళ్లని చూడగానే వీళ్లు రాక్షసులు, వీళ్లతో జాగ్ర త్తగా వుండాలీ అని తెలిసేదిట. కాని ఇప్పుడు వీళ్లు మనుషులు కాదు, రాక్షసులు కాదు, ఇంకా ఏదో! తను తెలుసుకున్న నిజాన్ని ఎవరికయినా చెప్పాలి, ఎక్కువ మందికి చెప్పాలి, చాలామందికి చెప్పాలి, అందరికీ చెప్పెయ్యాలి... తనింక భరించ లేడు ఈ నరకాన్ని.

★ ★ ★

దీనబంధు పెట్టిన గడువు దగ్గర పడు తూన్నకొద్దీ ప్రజల్లో ఉత్కంఠ ఎక్కువ అయి పోతోంది. ఎంత ఎక్కువ అంటే కోతి దొరికి, లేక పారిపోయి, దాని సమస్య తమకు తప్పాలనే కోరిక కంటే- అది దొర కకపోతే నిజంగా దీనబంధు ఆత్మాహుతి చేసుకుంటాడా? లేదా? చేసుకోవడానికి ప్రయత్నిస్తూంటే ప్రభుత్వం చూస్తూ వూరు కుంటుందా? ఊరుకోక ఆపుచేస్తే తను ఆ కోతిని బంధించడానికి ఏ పథకం వేస్తున్నదీ వివరిస్తుందా? పట్టుకుంటామని హామీ ఇస్తుందా? లేక ప్రభుత్వం తన ప్రయ త్నాన్ని ఆపేలోపే దీనబంధు ఆత్మాహుతి చేసేసుకుంటాడా?

వ్యక్తిగతంగా దీనబంధుని గురించిన కథలు కూడా బాగా చర్చనీయాంశాలు అయ్యాయి.

అసలు అతను ఉత్తముడనీ, మొదటి నుంచీ ప్రజాసేవకోసం పాటుపడేవాడనీ, గతంలో ఇలాంటి శపథం బహిరంగంగా చెయ్యకపోయినా నిర్ణయాలయితే ఇంత కఠి నంగానూ తీసుకుని, గడువులోపలే ప్రజా హిత కార్యక్రమాలు జయప్రదంగా చాలా జరిపించాడనీ, రేపటిలోగా కోతి సమస్య తీరకపోతే ఆయనని ఆత్మాహుతి చేసుకో కుండా ఏ శక్తీ ఆపలేదనీ- అతని అభిమా నులు బాగా ప్రచారం చేస్తున్నారు.

కొందరయితే ప్రభుత్వం చేయవలసిన పనిని తన భుజస్కంధాలమీద వేసుకుని, అమాయకుడు అన్యాయంగా బలయిపోతు న్నాడని జాలి చూపిస్తున్నారు.

కొద్దిమందయితే "ఆం ఇదంతా నాటకం- ప్రభుత్వమే ఆడిస్తోంది. అంత హంగామా చేసేసి, చివరకు ఎలాగూ ఆపు చేసేస్తారు. ఆత్మాహుతీ లేదు ఏంలేదూ- ఇదంతా

జనాన్ని, ఫూల్‌ని చేయడమే" అంటున్నారు.

అన్ని విషయాలూ ఎప్పటికప్పుడు దీన బంధుకి అందుతున్నాయి.

కానీ ఎక్కువగా అతని మెదడుని తినేస్తూన్న విషయం- ప్రొద్దున్నుంచీ ప్రకాశం కనిపించకపోవడమే. అతనికి రాత్రి దెబ్బలు ఎలా తగిలాయన్న విషయమే.

దీనబంధు సూచనలమేరకు కన్నబాబు అతని ఫ్రెండింట్లో దాక్కున్నాడు. తను ఎక్కడున్నదీ ఎవ్వరికీ తెలియకుండా జాగ్ర త్తపడ్డాడు. మామయ్యా బయటకు రావొచ్చురా ఫరవాలేదు అని చెప్పాకే రాదలుచుకున్నాడు. యాక్సిడెంటు కేసులో తనని అరెస్టు చేసే సూచనలు వున్నాయి. అందులో ఇంటి దగ్గర తండ్రి అగ్గి మీద గుగ్గిలం అవుతున్నాడు. అసలు ఆయనే తనని స్వయంగా పోలీసులకి పట్టించేట్టున్నాడు. అందుకే మామయ్యా చెప్పేవరకూ బయటకు రాకూడదు. అంతే! ఆయనే తనకి శ్రీరామరక్ష! కాని, ఆయనకి రక్ష ఎవరు? రేపొద్దున్నకల్లా కోతి సమస్య తీరకపోతే చస్తానన్నాడే! సమస్య తీరుతుందా? మామయ్యా చస్తాడా? మామయ్యా చచ్చిపోతే, తనకి రాజకీయ గురువు మరొకడు అంతటి సమర్థుడు దొరుకుతాడా? ఏమో-

★ ★ ★

దీనబంధుకి విపరీతమయిన టెన్షన్‌గా వుంది.

కాలు కాలిన పిల్లిలా ఇల్లంతా తిరుగుతున్నాడు.

ఇంక ఒక్కరోజే వుంది. ఈ ఒక్కరోజు మీద తన జీవితం ఆధారపడి వుంది. ఒక్క రోజు... ఒక్కరోజు... అంతే!

ఇన్‌స్పెక్టర్ ప్రతాప్ మోటార్‌సైకిల్ చప్పుడు వినిపించింది. ప్రాణం లేచివచ్చింది. గబగబా వీధిలోకి పరుగెత్తాడు దీనబంధు. ఆశగా ఎదురుచూస్తున్నాడు దీనబంధు ప్రతాప్ తెచ్చే సమాచారం కోసం.

ప్రకాశం కోసం విపరీతంగా గాలించినట్లున్నాడు. బాగా అలిసిపోయి వున్నాడు ప్రతాప్. కాళ్లీడ్చుకుంటూ లోపలికొస్తున్నాడు.

"ఏమయ్యింది ప్రతాప్- ప్రకాశం కలిశాడా?" అంటూ ఆశగా చూశాడు.

'లేదు' అన్నట్లుగా పెదవి విరిచాడు ప్రతాప్.

నీరుగారిపోయాడు దీనబంధు. 'రాస్కెల్ ప్రకాశం' అంటూ పళ్లు కొరుక్కున్నాడు. అసహనంగా ఇంట్లోకి నడిచాడు. ప్రతాప్ అనుసరించాడు.

అప్పుడు లోపల్నుంచి హాల్లోకి వస్తున్నాడు చక్రవర్తి. ఇప్పుడు మళ్లీ ఇన్‌స్పెక్టర్ ఎందుకు వచ్చాడా అన్నట్లుగా చూశాడు. ప్రతాప్ తొందరపడి ఏదో చెప్పేలోగా దీనబంధే అన్నాడు, "కన్నబాబు కనబడలేదుట, అది చెప్పడానికి వచ్చాడు. ఉంటాడులెండి. మీరు కోపంగా వున్నారని ఇంటికి రావడానికి భయపడ్తూ వుండివుంటాడు" అన్నాడు.

చక్రవర్తి బరువుగా నిట్టూర్చి "ప్రతాప్, దీనబంధు విషయంలో ఈవాళ నగరంలో వాతావరణం మరింత వేడెక్కేలావుంది. సరైన బందోబస్తు జరుగుతోందిగా" అనడి

గాడు.

"అవునుసార్, ఆయన అభిమానులు ఈవేళ రాస్తారోకోలు, పికెటింగ్‌లు ప్లాన్ చేస్తున్నారు. అయితే సున్నితంగా టేకిల్‌చేసి ప్రజలకి ఇబ్బంది లేకుండా చూడాలని కమీషనర్‌గారు ఇన్‌స్ట్రక్షన్స్ మాకు ఇచ్చారు" అన్నాడు.

"నేను కూడా పత్రికా ప్రకటన ఇచ్చాను. నా అభిమానులెవ్వరూ ఆవేశపడకూడదనీ, ఆవేశంతో ఎవ్వరికీ ఇబ్బంది కలిగించొద్దనీ, ఆవేశంతో ఇది తీరే సమస్యకాదని" అన్నాడు దీనబంధు వీలయినంత సౌమ్యంగా.

ఇంతలో "మామయ్యా" అంటూ ఘొల్లున ఏడుస్తూ, బయటనుంచి నంది పరుగెత్తుకుంటూ వచ్చాడు.

ఎప్పుడూ నవ్వుతూ వచ్చే నంది అంతలా ఏడుస్తూ వచ్చేసరికి అందరూ కంగారుపడ్డారు. దీనబంధు మరీ కంగారు పడిపోయాడు. "ఏవిటి సన్నీ, ఏమయ్యిందీ?" అన్నాడు వాడికి ఎదురువెళ్తూ.

వాడు అతన్ని తప్పించి ముందుకొచ్చి కింద కూలబడి ఏడవసాగాడు.

ఎవరికీ పరిస్థితి అర్థం కాలేదు. ఏం కీడు జరిగిందోనని చక్రవర్తి బెంబేలు పడిపోయాడు. ఏడుపులు విని ఇంద్రాణి బయటకు పరుగెత్తుకొచ్చింది.

ప్రతాప్ నంది చెయ్యి పట్టుకుని పైకి లేపుతూ, ధైర్యం చెబుతూ అన్నాడు, "భయపడకు బాబూ, నేనున్నాను, చెప్పు" అని.

ఏడుపుని కంట్రోల్ చేసుకుంటూ, "మామయ్యా, అన్యాయం జరిగిపోయింది మామయ్యా, ఘోరం జరిగిపోయింది" అంటూ బావురుమన్నాడు మళ్లీ నంది.

"ఏమయ్యిందిరా- చెప్పకుండా ఏడిస్తే ఎలా తెలుస్తుంది మాకు" అంటూ ముందుకొచ్చి, నంది భుజంమీద చేయివేశాడు చక్రవర్తి.

నెమ్మదిగా తల ఎత్తి చక్రవర్తి కళ్లల్లోకి కన్నీళ్లతో చూస్తూ, "ముగ్ధని చంపిందీ... ముగ్ధని చంపిందీ... కోతికాదు మామయ్యా..." అన్నాడు నంది.

అదిరిపడినట్లయ్యాడు చక్రవర్తి

"మరి! ఎవర్రా, చెప్పు" అన్నాడు వాడ్ని కుదుపుతూ.

దీనబంధు చాలా కంగారుపడిపోయాడు. కొడుకు చేయిపట్టుకుని లాగుతూ, "సన్నీ, ఎందుకురా ఇలా కంగారు పడ్తున్నావు? ముగ్ధ గురించే ఆలోచిస్తూ ఒర్థి పిచ్చివాడివి అయిపోతున్నావురా నువ్వు. అసలు నువ్వు లోపలకి పద, పద లోపలకీ... నీకు విశ్రాంతి కావాలి. మాట్లాకుండా పడుకో...'

అంటూ కంగారుగా నెట్టసాగాడు లోపలికి.

తండ్రి చేతిని విసిరికొడ్తూ, అరిచాడు నంది. "లేదు... నాకు విశ్రాంతి లేదు.. ఇంక నాకీ జీవితంలో విశ్రాంతే లేదు... అలా చేశారు, నా ముగ్ధని అన్యాయంగా చంపేశారు..." అని.

అంత హృదయవిదారకంగా వాడు అలా అరిచేసరికి, ఇంద్రాణి వణికిపోయింది. "ఎవర్రా ఎవర్రా నాన్నా చంపిందీ... చెప్పరా..." అంది.

దీనబంధులో కంగారు ఎక్కువయింది. కానీ కప్పిపుచ్చుకుంటూ, "వాడికి మతిస్థిమితంలేదు. ఏదేదో వాగుతున్నాడంతే..." అన్నాడు తేలిగ్గా.

కానీ చక్రవర్తికి ఆ మాటలు రుచించలేదు. తల అడ్డంగా వూపుతూ, సీరియస్‌గా, "కాదు, చెప్పనియ్యి. నందీ, చెప్పు నాన్నా, నీకేం భయంలేదు. చెప్పు, ఎవర్రా ఆ బంగారు తల్లిని చంపిందీ?" అన్నాడు.

నంది చిన్నపిల్లాడిలా ఏడ్చేస్తూ, "ఎలా చెప్పను మామయ్యా, ఎలా చెప్పను?" అన్నాడు.

"చెప్పరా ఫరవాలేదు చెప్పు" అంది ఇంద్రాణి.

"ముగ్ధని చంపిందీ..." అంటూ నంది చెప్పబోతూంటే, దీనబంధు అరిచాడు, "ఒరేయ్, తెలిసీ తెలియకుండా వాగేవంటే ఛంపేస్తాను, ఫో లోపలకి" అని.

నంది మొండికెత్తాడు. "ఎందుకు పోవాలీ, నాకు తెలిసిన నిజాన్ని నేను ఎందుకు దాచాలీ...? మామయ్యా! ముగ్ధని చంపిందీ- కన్నబాబు" అంటూ చేతుల్లో ముఖం దాచుకుని ఏడవసాగాడు.

స్తంభించిపోయారందరూ

"క...న్న...బా...బా? !" అన్నాడు చక్ర వర్తి ప్రయత్నంమీద తేరుకుని.

ఇంద్రాణికి ఏడుపు, కోపం ఒక్కసారే తన్నుకొచ్చాయి.

"ఒరేయ్, నందీ ఒళ్లు పై తెలిసే వాగు తున్నావా? కన్నబాబేవిటి, ముగ్ధని చంపడ మేవిట్రా? " అని అరిచింది.

అలాంటి వార్త మామయ్యతోటీ, అత్తయ్యా తోటీ చెప్పవలసివస్తున్నందుకు విపరీతంగా బాధపడ్తూ, "నిజం అత్తయ్యా తల్లితోడు! కన్నబాబు ఆమెని చాలా ఇష్టపడ్డాడు. నిజం చెప్పాలంటే చెడు సావాసాల కార ణంగా వాడు ఆమెని కామించాడు. ఆమె వాడ్ని ఛీకొట్టింది. అందుకు పంతంపట్టి, ప్లాన్‌వేసి, రాక్షసకోతి చర్యలు ఆసరాగా తీసుకుని ఆమె ఒంటరిగా వెళ్తూండడంతో అవకాశం కూడా దొరికి, రౌడీ సత్తులుగాడి సాయంతో ఆమెని బలవంతంగా పార్కు లోకి లాక్కుపోయి, బలత్కారం చేసి చంపే శారు" అంటూ భోరుమన్నాడు కింద కూల బడుతూ.

వినలేకపోయిన ఇంద్రాణి చెవులు మూసుకుని, "హరిహరీ..." అంది.

చక్రవర్తి ఉగ్రుడైపోయాడు.

కోపంతో కంపించిపోయాడు నిలువునా.

"ఏడ్రా ఎక్కడ చచ్చాడు వాడు. ఎక్కడ దాక్కున్నా ఆ దౌర్భాగ్యుడు ఈరోజు నా చేతుల్లో చచ్చాడన్నమాటే..." అంటూ ఆవే శంతో ఊగిపోతూ లోపలగదిలోకి వెళ్లాడు చక్రవర్తి.

ఇంద్రాణికి దుఃఖం తన్నుకొచ్చింది.

ఒకపక్క కన్నకొడుకు ఇంతటి నీచుడా అన్న బాధ.

మరోపక్క కన్నకూతురులాంటి ముగ్ధకి జరిగిన ఘోర అన్యాయం.

"ఇన్నాళ్లూ షోకులూ, తిరుగుళ్లూ అంటే వయసులో వున్న కుర్రాడులే పోనీ అనుకు న్నాను. కారు యాక్సిడెంటు చేసి నలుగుర్ని పొట్టనపెట్టుకున్నా కడుపుతీపికొద్దీ వాడి పొగరు చేష్టని కడుపులోనే దాచుకున్నాను. కానీ ఈనాడు నా కన్నబిడ్డకంటే ఎక్కువ అయిన ఆ బంగారుబొమ్మ ముగ్ధని పాడు చేసి చంపేశాడని వింటుంటే నా ఒళ్లు కోపంతో కాలిపోతోంది. ఆ నీచపు వెధవ కంటబడ్తే నేనే వాడి పీక పిసికి చంపే స్తాను" అంటూ ఆవేశంగా వూగిపోయింది.

దీనబంధుకి మతిపోయినంత పన య్యింది.

అక్కగార్ని పొదివి పట్టుకుని, కుర్చీలో కూర్చోబెడుతూ, "అబ్బా అక్కా! ఇదంతా అబద్ధం అక్కా. ఈ పిచ్చివెధవ మాటలు మీరు నమ్ముతున్నారా? వీడు వెధవ అర్థం పర్థంలేని వాగుడు వాగుతాడని మీకు తెలి యదూ? " అని కొడుకు వైపుకు తిరిగి, వాడి కాలర్ ఓ చేత్తో పట్టుకుని, మరోచేత్తో లాగి లెంపకాయ కొట్టి, "ఏరా స్టుపిడ్- నోటికొచ్చి నట్లు ఏదిపడ్తే అది, ఎవరి దగ్గరపడ్తే వాళ్ల దగ్గర వాగెయ్యడమేనా? ఏ ఆధారంతో కన్నబాబు ముగ్ధని చంపాడని చెబ్తున్నా వురా వెధవా? " అన్నాడు వాడ్ని కుది పేస్తూ.

"ఉన్నాయి. ఆధారాలు వున్నాయి. ఆధా రాలతో మాట్లాడుతున్నాను నేను. అసలీ కుట్రకంతకీ మూలకారణం నువ్వు" ఎదురు తిరిగాడు నంది.

"ఒరేయ్- తాట ఒలుస్తాను. తల తిరుగు తోందా? "

"నిజంగానే తిరిగిపోతోంది నా తల. ఈ

# ఆణిముత్యాలు

❖ జీవితం, మృత్యువు ఒకే నాణేనికి రెండు ప్రక్కల వంటివి.

– గాంధీజీ

❖ ఎటువంటి పొరపాట్లు చెయ్యనివాడు సాధారణంగా ఎటువంటి పనీ చెయ్యలేడు.

– ఎడ్వర్డ్ ఫిలిప్స్

❖ ఒక పని చేయించుకున్నందుకు ధన్యవాదాలు చెప్పడమంటే భవిష్యత్తులో మరొక పని చేయించుకోవడానికి పునాది వేసుకోవడమే.

– సర్ రాబర్ట్ వాల్‌పోల్

❖ అసమర్థుడి ఆఖరి ఉపాయం హింస.

– ఇసాక్ అసిమోవ్

❖ సంతృప్తి మనస్కుడు ఎన్నడూ పేదకాదు. అసంతృప్తి మనస్కుడు ఆరోగ్యవంతుడు కాడు.

– జార్జి ఇలియట్

❖ శత్రువును క్షమించడం సులభం కానీ స్నేహితుని క్షమించడం చాలా కష్టం.

– మదాం దరోత్‌డెలూజీ

❖ ఎవరి వద్ద ఆత్మవిశ్వాసం ఉందో అది అతనికి అద్భుతమైన ప్రేరణను ఇస్తుంది.

– మిల్టన్

❖ నీకు మనశ్శాంతి కావాలంటే ఇతరుల దోషాలెన్నబోకు, నీ దోషాలను నీవు చూసుకో.

– శారదామాత

❖ తనకున్నంతలో ఇవ్వలేనివారికి ఎవ్వరూ సుఖాన్ని కూర్చలేరు.

– ఋగ్వేదము

❖ ఆనందమనేది నీవు ఇచ్చేదాని మూలంగా వస్తుందిగానీ పుచ్చుకునే దానివల్ల కాదు.

– గాంధీజీ

❖ మూగవారు పంచదార రుచిని చెప్పలేనట్టే ఆత్మానుభవాన్ని వివరించడం సాధ్యంకాదు.

– కబీరు

❖ అకళంకమైన హృదయంకన్నా అభేద్యమైన కవచమేముంది.

– షేక్స్‌పియర్

సేకరణ: **దాసరి వెంకట రమణారావు**

ప్రపంచంలో ఇంత నీచులు వుంటారని ఊహించలేకపోయాను ఇన్నాళ్లూ. నువ్వూ, రౌడీ సత్తులుగాడు, కన్నబాబూ కలిసి ఏవేవో ఛండాలపు ప్లాన్లు వేస్తున్నారని మీ గూడుపుఠాణీ మీటింగులని బట్టి, మీ దొంగ చూపుల్ని బట్టి ఊహిస్తూవుండేవాడిని. ఇంతలో నా ముగ్ధ దారుణంగా చనిపోయింది. ఆమె అంత్యక్రియలప్పుడు మీ ముగ్గురి చేష్టలూ, చూపులూ అన్నీ అనుమానాస్పదంగా తోచాయి నాకు. అప్పుడే నాకెందుకో ముగ్ధని చంపింది కోతి కాదూ, ఎవరో చేసిన హత్య అనిపించింది. ఎప్పుడూ లేనిది కన్నబాబు నాతో ముగ్ధ గురించి మంచిగా మాట్లాడ్డం, నాకు సానుభూతి చెప్పడం ప్రారంభించడంతో నా అనుమానం బలపడింది"

"సంతోషించాంలే... నోర్ముయ్. నువ్వో పెద్ద డిటెక్టివ్‌వి. నువ్వు చెప్పినదంతా మేము నమ్మేస్తాం"

"నమ్మితీరాలి, రౌడీ సత్తులుగాడ్ని తీసుకెళ్లి, ఫుల్‌గా తాగించాను. ఆ మైకంలో వాడు హీరో అయిపోయి, నీ సలహా ప్రకారం వాడూ, కన్నబాబూ కలిసి చేసిన ఘోరం యిదని నిజం కక్కేశాడు. వాడు చెప్పినదంతా క్యాసెట్లో భద్రపరిచాను. ఎవ్వరూ తప్పించుకోలేరింక"

చక్రవర్తి పిస్టల్‌తో బయటకొచ్చాడు. "కన్నబాబుగాడ్ని వదిలిపెట్టను, కన్నకొడుకని వూరుకుంటాననుకుంటున్నాడేమో, క్రూరమృగాన్ని కాల్చినట్లు కాల్చి చంపుతాను" ఆయన ముఖం కందగడ్డలావుంది. ఎవ్వరూ ఆయన ఆవేశాన్ని ఆపలేరు అన్నట్లుగా వున్నాడు.

ఇంద్రాణి భర్తకి ఎదురువెళ్తూ, హిస్టీరిక్‌గా అరిచింది. "వాడికంటే ముందు ఓ చీడ పురుగుని కొడుకుగా కన్న ఈ దరిద్రపు తల్లిని ముందు శిక్షించాలండీ, నన్ను చంపండీ... నన్ను కాల్చెయ్యండీ" అని.

చక్రవర్తి దుఃఖానికి లొంగిపోతూ అరిచాడు, "నిన్నే కాదు ఇంద్రాణీ, నన్నూ చంపుకోవాలి. ముందా వెధవ ఎక్కడ చచ్చాడో పట్టుకోవాలి. ముగ్గురం కట్టకట్టుకుని చద్దాం"

ఇంతలో...

"చావవలసింది మీరు కాదు చక్రవర్తీ" అని గంభీరంగా మేడమెట్ల మీదినుంచి వినిపించింది.

అందరూ కంగారుగా అటు చూశారు.

మెట్లమీద భయంకర కోతి నిలబడి వుంది.

ఇంద్రాణి, నంది కెవ్వున కేకలుపెట్టారు.

ఇన్‌స్పెక్టర్‌కి ముచ్చెమటలు పోశాయి.

దీనబంధు నివ్వెరపోయి చూస్తున్నాడు.

అయితే... చక్రవర్తి మాత్రం నిబ్బరంగా నిలబడి వున్నాడు.

కోతి వెనగ్గా ఆనందరావు ప్రత్యక్షమయ్యాడు. ఆనందరావు అంత నిర్భయంగా కోతి వెనకే నిలబడి వుండడం చక్రవర్తిని తప్ప అందర్నీ ఆశ్చర్యంలో ముంచింది. 'ఇన్నిరోజులూ ఈ కోతి రాత్రుళ్లే కనబడ్తోంది అన్నారు. ఇది పట్టపగలే... మేయర్‌గారింట్లో, అందులో మనిషిలా మాట్లాడుతూ' మతులుపోతున్నాయి.

కోతి మళ్ళీ అంది, "చంపవలసింది దీనబంధుని! మీ పిస్టల్‌తో కాదు, నా గోళ్లతో చీల్చి దారుణంగా చంపుతాను!" అంటూ మెట్లుదిగసాగింది.

దిమ్మెరపోయిన దీనబంధు కోతిని, చుట్టూ వున్నవారిని, రెప్పవాల్చకుండా ఆశ్చర్యంగా చూస్తూ, మీదిమీదికి వస్తున్న కోతిని తప్పించుకుంటూ, భయంతో, "బావగారూ, ఇన్నిరోజులూ అందర్నీ భయపెట్టి, బాధలుపెట్టి, దారుణాలు చేసిన వింతకోతి ఇదే, చూస్తారేమిటీ, కాల్చెయ్యండి దీన్ని" అన్నాడు.

నిశ్చింతగా చూస్తూ, తల అడ్డంగా ఆడించాడు చక్రవర్తి.

చక్రవర్తి ప్రవర్తనకి మతిపోయినట్లయ్యింది ఆనందరావుకి తప్ప, మిగిలిన అందరికీ.

రాక్షసకోతి మెట్లుదిగి వచ్చేస్తోంది.

ఇంద్రాణికి, నందికి, ఇన్‌స్పెక్టర్‌కి చెమటలుపడ్తున్నాయి.

"కాల్చండి బావగారూ" అరిచాడు దీనబంధు.

నిశ్చింతగా అన్నాడు చక్రవర్తి, "నేను ఏమీ చెయ్యను"

"ఎందుకని? !"

"ఊళ్లో అంతా బీభత్సం సృష్టించినప్పుడు, నా యిల్లు మాత్రం ఎగ్జెంప్షన్ ఎందుకు దానికి. దాని యిష్టమొచ్చినట్లు చెయ్యనియ్యి"

"అరె బావగారూ, మీకు మతిపోయిందా, ముందు కాల్చండి"

"నేను కాల్చను! అంతే!"

ఇంద్రాణికి భయంతో, ఆశ్చర్యంతో గొంతెండిపోయింది. నోరు పెగల్లేదు. బొమ్మలా బిగుసుకుపోయి అలా చూస్తుండిపోయింది. కోతి మాట్లాడ్డం, భర్త చేతిలో పిస్టల్ వుండీ దాన్ని ఉపయోగించకపోవడం కలో నిజమో అర్థంకావడంలేదు ఆమెకి. నంది పరిస్థితీ అలాగే వుంది. ఇన్‌స్పెక్టరూ చేష్టలుడిగి నిలబడిపోయాడు బొమ్మలా.

కోతి వెనగ్గా, తాపీగా మెట్లు దిగుతున్నాడు ఆనందరావు.

కోతి దీనబంధుకి దగ్గరవుతోంది చేతులు బారచాపి.

దీనబంధు వెనుతిరిగి పరుగెత్తబోయాడు.

రెండు పెద్దపెద్ద గెంతుల్తో ఎదురొచ్చి నిలబడింది కోతి.

వజవజ వణికిపోయాడు దీనబంధు.

మతిపోతున్నట్లుగా వుంది.

ఏం జరుగుతోంది? ! అసలిదేమిటి, ఇలా జరుగుతోంది? ! ఎక్కడ్నుంచి వచ్చింది 'ఈ' కోతి? !

మళ్ళీ అరిచాడు భయంతో "బావగారూ మీకు దణ్ణంపెడ్తాను కాల్చండి. మనకి నిద్రాహారాలు లేకుండా చేసిన కోతి ఇదే. కాల్చండీ"

"నేను కాల్చను!" అన్నాడు చక్రవర్తి మళ్ళీ.

బావగారి ప్రవర్తనకి ఒళ్లు మండిపోయింది దీనబంధుకి.

మీదపడి పిస్టల్ లాక్కుందామా అన్నంత కోపం వచ్చింది గాని ఓ పక్కనుంచి కోతి మీదమీదకు వచ్చేస్తోంది. హాల్లో అన్నిమూలలకూ పరుగులు పెడ్తున్నాడు దీనబంధు. కోతి తీవ్రంగా చూస్తూ అతనివైపే వస్తోంది.

ఇన్‌స్పెక్టర్‌తో దీనబంధు, "ఏమిటి తమాషా చూస్తున్నారు ప్రతాప్, మీ రివాల్వర్‌తో దాన్ని కాల్చేయండి. లేకపోతే మీ ప్రాణాలు తీస్తుందది" అన్నాడు హెచ్చరిస్తూ, తొందరపెడుతూ.

షాక్‌నుంచి తేరుకున్న ప్రతాప్, రివాల్వర్ తీయబోయాడు.

చక్రవర్తి తనచేతిలోని రివాల్వర్‌ని ప్రతాప్‌కి గురిపెడ్తూ వార్నింగ్‌గా అన్నాడు, "ప్రతాప్ చెయ్యి కదిల్చారంటే మిమ్మల్ని నేను కాల్చేస్తాను. మీరు కదలకుండా అలా నిల్చుని గమనించండంతే. మీరు చెయ్యాల్సిన పని ముందుంది"

రివాల్వర్ తీసే ప్రయత్నంమాని, తెల్లబోయి చూడసాగాడు ప్రతాప్.

పళ్లు పటపటలాడించాడు దీనబంధు. "అయితే ఈ కోతి నాటకం అంతా మీరే ఆడిస్తున్నారా బావగారూ ఇన్నిరోజులూ? " అన్నాడు కోపంగా.

"కాదు!" అరిచి మాస్కు తీసింది కోతి.

మాస్కు వెనక ఒక ప్రశాంతమయిన, అందమయిన, బలమయిన ముఖం. ఆ ముఖం ప్రకాశంది! తర్వాత ఆ ముఖంలో రౌద్రం చోటుచేసుకోసాగింది.

ఆనందరావు, చక్రవర్తి తప్ప మిగిలిన

వాళ్లు విస్తుపోయి చూస్తున్నారు.

"ప్రకాశం" అంటూ ఏదో అనబోయాడు దీనబంధు.

"ఛీ మాట్లాడకు" అని చీదరించుకున్నాడు ప్రకాశం కోపంగా.

"ఎంతటి దారుణప్పనులు చేయించావురా నాచేత! ఎంతమంది అమాయకులని యిబ్బందులకి, బాధలకి గురిచేశావురా! నా పేదరికం, నిరుద్యోగం, నా తల్లి అనారోగ్యం, వీటన్నిటినీ ఆసరాగా చేసుకుని నన్నొక మృగాన్ని చేశావు కదరా పాపిష్టివాడా! నీ పాపిష్టి డబ్బు వుపయోగించి వైద్యం చేయించిన కారణంగానే నా తల్లి చనిపో యిందిరా నీచుడా. పైగా సిగ్గు లేకుండా దేవుడులాంటి మేయర్‌గారిని అంటున్నావా స్కౌండ్రల్" కోపంతో పూనకంలో వున్న నరసింహస్వామిలా వున్నాడు ప్రకాశం.

దీనబంధుకీ గొప్ప గుండె మంటగావుంది.

తన ప్లానంతా పాడయ్యింది.

తన బండారం అంతా బయటపడింది.

తన భవిష్యత్తు బుగ్గిపాలయ్యింది.

పళ్లనూరుతూ, "ప్రకాశం- రాస్కెల్! ఇంత నమ్మకద్రోహం చేస్తావురా! అసలు ఎలా వచ్చావు లోపలకి? ఎవరు రాని చ్చారు నిన్ను? నిన్ను చంపేస్తాను. బావ గారూ వీడొక పరమదుర్మార్గుడు! వీడేనన్న మాట ఇన్నిరోజులూ కోతి వేషంలో దారు ణాలు చేసింది. భగవంతుడిచ్చిన పెర్సనాలి టీని, తెలివితేటల్నీ యిలా నీచమయిన కార్యానికి వుపయోగించుకున్నాడీ రాస్కెల్! వీణ్ణి బతకనీయకూడదు. వీడు అందరికీ ప్రమాదమే. వీణ్ణి నమ్మకండి" అన్నాడు బతిమలాడుతున్న ధోరణిలో.

"అదే అదే, ఎవర్ని నమ్మకూడదో నాకి ప్పుడు బా...గా అర్థమైంది దీ...న... బం...ధూ!" అన్నాడు చక్రవర్తి తల తమా షాగా తాటిస్తూ.

ఇంద్రాణికి అసలేం అర్థంకావడంలేదు. మతిపోతున్నట్లుగా వుంది. "ఏమిటండీ, ఏమిటిదంతా... ఈ కోతి ఏమిటీ... ఈ మారువేషం ఏమిటీ... అసలేమిటండిదీ?" అంది గాభరాగా.

"చరమాంకం ఇంద్రాణీ, మీ ముద్దుల తమ్ముడిగారి రాచలీలలకు చరమగీతం" అన్నాడు చక్రవర్తి వెటకారంగా.

"అంటే? !" అంది ఇంద్రాణి అయోమ యంగా.

"అంటే- ఈ రాక్షసకోతి నాటకానికి పూర్తిగా తెరపడబోతోంది. ఇన్ని రోజులూ రాక్షసకోతిగా జనాన్ని భ్రమింపజేసి, భ్రాంతి లోముంచి, బాధలకు గురిచేసింది ఈ అమాయకుడు ప్రకాశం అయితే వెనక నుండి నాటకం నడిపించిన ముఖ్య సూత్ర ధారి, ఇదుగో ఈ అపర శకుని మామ ఈ దీనబంధు" అన్నాడు చక్రవర్తి.

దీనబంధు గిజగిజలాడాడు.

ప్రకాశం సిగ్గుతో, బాధతో విలవిలలా డాడు.

చేతులు జోడించి, ముడుచుకుపోతూ, వినయంగా, "అవునమ్మా, నా పెర్సనాలిటీ, నా మేధస్సు, నా చురుకుదనం, నా బలం... అన్నీ ఓ దుర్మార్గుడి దురాలోచనకి వుపయోగపడ్డాయమ్మా. నేను మహా పాపిని. పురుగులుపడి చస్తాను" అని నొసలు బాదుకుంటూ ఏడ్చి గుక్కతిప్పు కుని, "అసలు మొదట, నాకు మంచి వుద్యోగం ఇప్పిస్తానని ఆశపెట్టి, రెండు రాత్రులు ఇలా నటించి, అలజడి సృష్టించు చాలు అని చెప్పాడు ఈ దుర్మార్గుడు. ఆ తర్వాత జనానికి నిజం చెప్పి నన్ను చంపిం చేస్తానని భయపెట్టి, బ్లాక్‌మెయిల్ చేసి, బంగారు భవిష్యత్తు కలిపిస్తానని ఆశలు పెట్టి, ఘోరాలు చేయించాడు నా చేత" దుఃఖానికి లొంగిపోయాడు.

ఆనందరావు ప్రకాశం దగ్గరకొచ్చి, వీపు తట్టి, ఓదార్చుతూ, "ప్రకాశం, రిలాక్స్. ఈజీ ఈజీ" అన్నాడు.

ప్రకాశం నెమ్మదిగా తననితాను కంట్రోలు చేసుకుంటూ, తిరిగి చెప్పసాగాడు, "ఇన్నిరోజులూ నరకం అనుభవించానమ్మా. భయం, బాధ, ఆత్మనింద, అన్నీ నన్ను కుదిపేసాయి. కిష్టయ్యని నేను గాయపర చిన రోజున నాకిచ్చిన కూల్‌డ్రింక్‌లో మత్తుపానీయాలు కలిపి, నా ఒళ్లు నాకు తెలియకుండా చేసి, నాచేత దౌర్జన్యాన్ని చేయించాడు. నా ప్రమేయం ఏమాత్రం లేకుండానే, వేరేవాళ్లచేత ముగ్ధ అనే అమా యకురాల్ని దారుణంగా హత్యచేయించి, ఆ నేరాన్ని రాక్షసకోతి చేసింది అని జనాన్ని నమ్మించాడు. ఎప్పుడయితే రెండు రోజుల్లో రాక్షసకోతిని పట్టుకోవడమో, చంపడమో చెయ్యకపోతే తను ఆత్మాహుతి చేసుకుంటా నని అంత ధైర్యంగా పత్రికాప్రకటన ఇచ్చాడో, అప్పుడే నాకు అర్థమైపోయింది వీడిప్లాను. తన స్వలాభంకోసం, తన ఘన కీర్తిని జనంచేత పొగిడించుకుని, రాజకీ యంగా లబ్ధిపొందడానికి, నన్ను దారు ణంగా చంపేస్తాడు. పిచ్చెక్కినట్లయ్యింది. ఆ పిచ్చిలోంచే బ్రహ్మాండమయిన ఆలోచన వచ్చింది. అందుకనే నిన్నరాత్రి నన్ను నేనే స్వయంగా గాయపరుచుకుని, రాక్షసకోతి బాధితుడుగా జనాన్ని నమ్మించి, ఎవ్వరికీ నామీద అనుమానం రాకుండా చేసుకుని, వీణ్ణి దెబ్బతీశాను. నిన్నరాత్రి వీడు రంగం లోకి దిగింది నన్ను హతమార్చడానికే. కానీ వీడు ప్లాను తలకిందులయ్యింది. అదుగో" అంటూ ఆనందరావుని చూపిస్తూ, "...ఆ మహానుభావుడి దయవలన..." అంటూ చక్రవర్తిని చూపిస్తూ, "ఈ... దేముడి రక్ష ణలో వచ్చిపడ్డాను. లేకపోతే ఈ దుర్మా ర్గుడు ఈ రాత్రి నన్ను దారుణంగా చంపే సి వుండేవాడు" అన్నాడు. తనలోని బాధంతా వెళ్లగక్కేసరికి అతని గుండెలు తేలికయ్యాయి. కళ్లు తుడుచుకున్నాడు.

చక్రవర్తి ప్రకాశాన్ని ఓదార్పుగా స్పృశించి, భార్యతో "పాపం ఇతను నాతో మాట్లాడా లని, తన పరిస్థితిని వివరించుకోవాలని విశ్వప్రయత్నం చేశాట్ట. కాని ఈ దుర్మా ర్గుడు ఇతని పరిస్థితిని క్యాష్‌చేసుకున్నాడు. అయితే భగవంతుడు మంచి వాళ్లపక్షం వుంటాడు కదా, అందుకనే ఆనందరావుని ఇటువంటి క్లిష్టసమయంలో ఢిల్లీనుంచి ఈ వూరికి రప్పించాడు. ఆనందరావు ప్లాను ప్రకారం ప్రకాశం నా రక్షణలోకి వచ్చాడు" అన్నాడు.

ఇంద్రాణికి తమ్ముడంటే విపరీతమయిన అసహ్యం పుట్టుకొచ్చేసింది. ఇటువంటి నీచుడి కోసమా తను భర్తతో కూడా తగ వులాడిందీ? ! "ఛీ! ఇంతటి నీచానికి దిగింది నా తోడబుట్టినవాడా? !" అంది గొంతు కోపంతో, బాధతో ఒణుకుతుండగా. ఆ తర్వాత ఆవేశం, ఉక్రోషం పట్టలేక దీన బంధు కాలర్ పట్టుకుని వూపేస్తూ, "ఏరా దౌర్భాగ్యుడా! మనిషి జన్మ ఎత్తలేదుట్రా? ! మనిషి బలహీనతకొద్దీ యింకా డబ్బుకోరు కోవచ్చు యింకా మంచి పదవి కోరుకోవా చ్చుగాని, అమాయక ప్రజలేం చేశార్రా దుర్మార్గుడా, అంత బాధలు పెట్టావు? దేవుడులాంటి బావగారు నీకేం ద్రోహం చేశార్రా, ఆయనమీద ప్రేమ కురిపిస్తున్నట్లు నటిస్తూనే అంత హింస పెట్టావు? " అంటూ హిస్టీరికల్‌గా అరిచింది.

తండ్రి లీలలు ఒక్కొక్కటిగా తెలుస్తున్న కొద్దీ నందికి దీనబంధుమీద భక్తి, భయం, గౌరవం పూర్తిగా సన్నగిల్లాయి. తండ్రి ముఖంలోకి చూడడానికే ఈసడించు కుంటూ, "నాన్నా, నువ్వా ఈ భయంకర కోతి నాటకానికి దర్శకుడివీ? ! ఆహా, శభాష్ నాన్నా! నాటకాల్లో నేను ఏనాడూ రాజ కీయం నడపలేకపోయానుగానీ, రాజకీ యాల్లో నువ్వు గొప్ప నాటకం నడిపిం చావు. ఛీ! ఎందుకయ్యా నీ బతుకు? దేని కోసం చేశావిదంతా? !" అనడిగాడు.

అన్నివైపులనుంచీ మూసుకొస్తుండడంతో, అన్ని రహస్యాలూ బయటపడిపోతుండ

డంతో, ఇంక ముసుగులో గుద్దులాట అనవసరం అనిపించింది దీనబంధుకి. బావగారు, అక్క, చివరికి స్వంత కొడుకు కూడా అలా ఈసడించుకుంటూ నిలేస్తుంటే... ఇంక తెగించక తప్పదనిపించింది. ఉక్రోషం, కోపం, తెగింపూ, తీరని కోర్కెతాలూకు ఉడుకుమోతుతనం, అన్నీ కలిసి బరితెగింపుగా బయటపడ్డాయి. "ఎందుకు చేశాననా మీరంతా నన్ను ఇలా నిలదీస్తున్నారు? ఎందుకు చేశానంటే... పదవికోసం, పగ్గాల కోసం! అర్థమయ్యిందా? పదవి, అధికారం దక్కని బతుకు నాకిష్టంలేదు. గతంలో వాటికోసం దౌర్జన్యంతో కూడిన రాజకీయాలు చాలానే నడిపాను. రౌడీరాజకీయాలన్నారు వాటిని. రాకూడనంత చెడ్డ పేరొచ్చింది నాకు. ప్రజల్లో చెడ్డ పేరున్న నీకు పార్టీ టిక్కెట్టు ఇవ్వం, పోరా' అని గెంటేసారు అధిష్టానం వాళ్లు. పోనీ, ఈయనగారేమయినా సాయపడతాడేమోనని, అంతకష్టపడి, ఈయన విజయంకోసం అంత కష్టనష్టాలకోర్చితే స్వంత బావగారే 'ఒరేయ్... ప్రజల్లో నీకు సంఘసేవకుడిగా మంచి పేరొచ్చేదాకా పార్టీటికెట్ కి రికమెండ్ చేయను' అన్నాడు"

"అయితే మాత్రం ఉచ్ఛం, నీచం ఆలోచించనక్కర్లేదుట్రా?" అంది ఇంద్రాణి అసహ్యించుకుంటూ.

"ఇంతటి దారుణప్పన్లు చేస్తావా?" అన్నాడు నంది కోపంగా.

తాపీగా, మొండిగా అన్నాడు దీనబంధు. "తప్పలేదు. బాగా ఆలోచించే ఎత్తులు నడుపుకొచ్చాను. యస్ ఈ రాక్షసకోతిని నేనే సృష్టించాను! నేనే సృష్టించాను! కష్టాల్లో కుమిలిపోతున్న ఈ ప్రకాశం నాకు ఆశాకిరణంగా కనిపించాడు. వీడి పెర్సనాలిటీ, తెలివితేటలు, ఇంటి సమస్యలూ. ఇవన్నీ నాకు చక్కగా వుపయోగపడతాయనిపించింది. అందుకనే వీడ్ని తెలివిగా ట్రాప్ చేసి, రాక్షసకోతి భ్రాంతిని సృష్టించి, అందర్నీ చికాకుపరచి, చివరకి నావల్లే ఆ సమస్య నివారించబడ్డట్లుగా ఫలితాన్ని చూపించి, జనంచేత జేజేలు కొట్టించుకోవాలని నిర్ణయం చేసుకున్నాను"

"మరి నా కొడుకునెందుకురా ఈ మురికిలోకి లాగావు. వాడినెందుకురా పనికిరాని వెధవని చేశావు?" అంది ఇంద్రాణి కడుపుమంటతో.

"అదీ నా ప్లానులో భాగమే మైడియర్ సిస్టర్. నిజమే. కన్నబాబుగాడ్ని వీలయినంత రెచ్చగొట్టి, వాడికి అవసరమయిన రొట్టె ముక్కలు వాడి ముందు పడేసి, కుక్కలా నాచుట్టూ తిప్పుకున్నాను. నువ్వు పీడకలలో కూడా వూహించలేని ఇంకొక విషయం చెప్పనా? చెప్పేస్తున్నా, ముగ్ధపై అత్యాచారానికీ, హత్యకీ కూడా కన్నబాబునీ, రౌడీ సత్తులు గాడినీ ప్రేరేపించిన ఈ నేనే, వాళ్ళ చర్యలని చక్కగా వీడియో రికార్డు చేయించుకున్నాను. వాళ్లు మరి జన్మలో నామీద నోరెత్తకుండా వుండాలిగా, అందుకని" అంటూ నవ్వాడు దీనబంధు.

"కిష్టయ్య, కేశవరావుగార్లు నీకేం అపకారం చేశారు నాన్నా, అంత మంచివాళ్లకి అంత మనస్తాపం కలిగించావు?" అనడిగాడు నంది కోపంగా.

"అమ్మమ్మా... వాళ్లని మనశ్శాంతితో వదిలిపెడ్తే నా ప్లాను ఓ పట్టాన నెరవేరదు కదరా నా చిట్టితండ్రీ. వాళ్లనే కదా శ్రీశ్రీశ్రీ కళ్యాణచక్రవర్తి బావలుంగారు నాకంటే చాలా ఎక్కువ సన్నిహితులుగా, ఆప్తులుగా భావిస్తారు. వాళ్ల సలహా సంప్రదింపులతోనే కదా ముందడుగువేస్తారు. మరి వాళ్లని వీలయినంత శక్తిహీనులుగా మార్చి, ఓ మూల పడుండేలా చెయ్యకపోతే యెలా? ఇంకొక్క రోజు గడిచివుంటే, నేను అనుకున్న పాచిక పారి, ఆటపూర్తిగా గెలిచేవాడ్ని" దీనబంధు ముఖం వికృతంగా మారింది. కోపం కట్టలుతెంచుకుంటూండగా ప్రకాశంవైపు తిరిగి, ముందడుగు

వేశాడు.

ప్రకాశం స్టడీ అయ్యాడు, దీనబంధు తనని గాయపరచడానికి ప్రయత్నిస్తే మట్టి కరిపించడానికి.

దీనబంధు చూపుడువేలుతో ప్రకాశం ముఖంలోకి చూపిస్తూ, "ఈ రాస్కెల్ నా ప్లానంతా పాడుచేశాడు. నమ్మకద్రోహం చేశాడు. కోతివేషంలో కూడా చెప్పిన పను లని 'తూచా' తప్పకుండా చేయకుండా స్వంత నిర్ణయాలు కొన్ని తీసుకున్నా క్షమించాను. ఈ ఒక్కరోజు వీడు నాకు అందుబాటులో వుండివుంటే తెల్లారితే నేను ప్రజల మనిషిగా జేజేలు అందుకునే వాడ్ని. అంతా సర్వనాశనం చేశాడు వీడు. ద్రోహి! వీడ్ని బతకనివ్వకూడదు. చంపే యాలి!" అంటూ పిచ్చి ఆవేశంతో వూగి పోతూ, చుట్టూ కలియజూసి, చటుక్కున ప్రతాప్ దగ్గరకు గెంతి, అతని చేతిని తప్పించి, అతని బెల్టుకేసులోంచి పిస్టల్‌ని లాగబోయాడు.

దీనబంధు అసలురూపం అప్పటికే బయటపడడంతో, జాగర్తగా వున్న ప్రతాప్ దీనబంధు చేతిని విసిరికొట్టి, పిస్టల్ బయ టకు తీసి అతనికి గురిపెట్టి, దూరంగా జరిగి "ఛీ... రాస్కెల్ ఇంతటి నాటకం ఆడావా? తప్పనిసరయితే ఏదో కక్కుర్తి పడి, సాయపడ్డం జరుగుతుంది మావల్ల గాని, ఇంతటి నీచుడివి నీకు సాయపడ డమా? దూరంగా వుండు, దగ్గరకు వస్తే కాల్చిపారేస్తాను, జాగర్త!" అని హెచ్చరిం చాడు.

అన్నివైపులనుంచీ ఉచ్చు మరీ బిగు సుకుంటుండడంతో, దీనబంధులో కోపం, తెగింపు, అసహనం ఎక్కువ అయిపోతు న్నాయి.

"దీనబంధూ... ఇంక అనవసరంగా శ్రమపడక, మర్యాదగా లొంగిపో, నిన్ను అరెస్టు చేస్తున్నాను" అన్నాడు ప్రతాప్.

దాంతో పిచ్చిగా అరిచాడు దీనబంధు, "కమాన్ అరెస్ట్‌మి! ఈ అరెస్టులు, లాక ప్‌లు, జైలుగోడలు నాబోటివాళ్లని కట్టి ఆపలేవు. బంధిస్తున్నకొద్దీ విజృంభిస్తాం మేం. రాజకీయాల్లో వెలిగిపోవాలంటే జైలుకెళ్లిరావడం కూడా ఓ పెద్ద సర్టిఫి కెట్టే. కమాన్ అరెస్ట్‌మీ!"

"కాదు ఇటువంటి వెధలకి జైలుశిక్ష కాదు. ఉరిశిక్ష వేయాలి! అసలదీ కాదు" ప్రకాశాన్ని జాలిగా చూస్తూ అంది ఇంద్రాణి. "ఏ మనిషి శక్తిసామర్ధ్యాలని ఆయుధంగా చేసుకుని, జంతువుగా మార్చి జనంమీదకు వదిలాడో, ఆ ఆయుధాన్నే తిరిగి వాడిమీదకే వుపయోగిస్తే సరి" అని. కడుపు మండిపోతోంబామెకు.

"అవును, అదే సరయిన శిక్ష" అన్నాడు నంది ఉక్రోషంగా.

ఆవేశం కట్టలు తెంచుకున్న ప్రకాశం తిరిగి మాస్క్ పెట్టుకుని, గట్టిగా భయంక రంగా ఇకిలించి, దీనబంధువైపు నడకసా గించాడు. దీనబంధులోని దుర్మార్గప్రవృత్తి తెగింపుతో మాటల రూపంలో బయటకు రాసాగింది. పిచ్చిపట్టినట్లు గట్టిగా అరవ సాగాడు.

"ఆగు!" అని గర్జించి, "రాజకీయం, చరిత్ర తెలియని వెధవలు మీరు. మీరా నన్ను శిక్షించేది? ! ప్రపంచంలో మాబోటి మేధావులు అంతరించడమంటూ వుండదు! మారణహోమం సృష్టించడమేగాని, మరణం ఎరగని వాళ్లం మేము, చిరంజీ వులం మేము" అంటూ పిచ్చికేకలు పెట్ట సాగాడు.

అతని ఉన్మాదస్థితిని గ్రహించి, పెడరె క్కలు విరిచి పట్టుకున్నాడు ప్రకాశం.

ఫోన్ డయల్‌చేసి, "కమీషనర్‌గారూ, రాక్షసకోతి సమస్యకి పరిష్కారం దొరి కింది. అసలు నేరస్థుడు దొరికాడు"

అన్నాడు చక్రవర్తి.

ఊరి అశేషజనంతో ఆ మైదానం అంతా నిండిపోయింది.

స్కూళ్లకీ, కాలేజీలకి, ఆఫీసులకీ కూడా శలవు ప్రకటించడంతో ఎక్కడ చూసినా మనుషులే.

అందరిలోనూ ఆతృత. 'రాక్షసకోతి నిజ స్వరూపాన్ని చూడాలి', 'రాక్షసకోతి నాటకకర్తని చూడాలి'. ఎండనికూడా లెక్కచేయకుండా కొందరు కుర్చీలలో కూర్చునివున్నారు. కొందరు కుర్చీలు లేక నిలబడిపోయారు, కొందరు చుట్టుపక్కల వున్న చెట్లు, మేడలు ఎక్కారు. కొందరు బస్సుల మీద, లారీలమీద నిలబడి వున్నారు.

అందరి ముఖాల్లోనూ ఆతృతతోబాటు, రిలీఫ్‌తో కూడిన ఆనందం.



మేయర్ కళ్యాణ చక్రవర్తి, మునిసిపల్ కమీషనర్, పోలీసు కమీషనర్ రాబోయే ముఖ్యమంత్రిగారికోసం ఎదురుచూస్తున్నారు, ఆనందంగా, హడావుడిగా ఇటూ అటూ పచార్లు చేస్తూ, ఏర్పాట్లని పర్యవేక్షిస్తూ ప్రాంగణం అంతా యూనిఫారంలోనూ, సివిల్ డ్రస్సులలోనూ కూడా పోలీసులు, సిఐడిలు విస్తరించి వుండి, జనాన్ని కంట్రోల్ చేస్తూ, వెయ్యి కళ్లతో పరికించి చూస్తూ, జాగర్తలు తీసుకుంటున్నారు.

ముఖ్యమంత్రిగారు విచ్చేశారు.

ఆయన ముఖం ఆనందంతో వెలిగిపోతోంది.

కళ్యాణచక్రవర్తివైపు అభినందనగాచూస్తూ నవ్వారాయన.

ఆనందరావుని ఆయనకు పరిచయం చేస్తూ, సమస్య పరిష్కారానికి 'ముఖ్యకారకుడు' అన్నాడు చక్రవర్తి.

ముఖ్యమంత్రి ఆనందరావుకి అభినందనగా, కృతజ్ఞతగా అభివందనం చేశాడు.

ముఖ్యమంత్రికి, కళ్యాణచక్రవర్తికి, ఆనందరావుకి ఆసనాలు వేశారు స్టేజీమీద. ముగ్గురూ ఆసనాల్ని అలంకరించారు.

పోలీసుకమీషనరు మైకువద్దకు వచ్చాడు. "మన ప్రియతమ ముఖ్యమంత్రిగారు కొద్ది సేపట్లో బయలుదేరి, ఢిల్లీ వెళ్లవలసి వున్న కారణంగా సభ క్లుప్తంగానే జరుగుతుంది. మన ప్రియతమ నగరమేయర్‌గారు సభని నిర్వహిస్తారు" అని ప్రకటించాడు.

కళ్యాణచక్రవర్తి ఆసనంలోంచి లేచి వచ్చి, మైకుముందు నిలబడి, జనాన్ని అందర్నీ పరికించి చూస్తూ, చేతులు జోడించి ఒక రెండు నిముషాలు గొంతు పెగలక అలాగే నిలబడిపోయాడు. బలవంతంమీద గొంతు పెగల్చుకుని, "అందరికీ వందనం- నా మీద మీరు చూపించే అభిమానానికి. అందరికీ క్షమాపణలు, వారంరోజులపాటు మీరు నేను మేయర్‌గా వుండగా బాధలు పడినందుకు! ఇక కోతి సమస్య తీరిపోయింది! వివరాలు నా స్నేహితుడు, సైకాలజిస్టు అయిన శ్రీ ఆనందరావు వివరిస్తాడు. నమస్తే" అని క్లుప్తంగా సంభాషించి కూర్చున్నాడు.

ఆనందరావు లేచి మైకు దగ్గరకు వచ్చాడు. "ప్రియమైన ముఖ్యమంత్రిగారికి, నా ప్రియమిత్రుడు కళ్యాణచక్రవర్తికి,

సభలో వున్న మీ అందరికీ నమస్కారం. నా మిత్రుడు అసలు ఆ రెండు మాటలు మాట్లాడగలగడమే నాకు విశేషంగా తోస్తోంది. అతనిప్పుడు ఎటువంటి పరిస్థితుల్లో వున్నాడో నాకు బాగా తెలుసు. పూర్తి వివరాలు విన్న తర్వాత ఆయన పరిస్థితిని మీరే బేరీజువేసుకోగలరు. ఇంక అసలు విషయానికొస్తాను. గతవారం రోజులుగా నగరాన్ని వూపేసిన భయంకర కోతి నాటకంలో ముఖ్యపాత్రధారిని, చిల్లర పాత్రధారుల్ని, దర్శకుడ్ని మీకు పరిచయంచేస్తాను. నేరస్తుల్ని పబ్లిగ్గా మీకు పరిచయం చేయాలి అనేది మన ముఖ్యమంత్రిగారి సూచన, ఆదేశం. కారణం, ఈ సమస్య పూర్తిగా తీరిపోయిందని మీకు నమ్మకం కలిగి, మీరు హాయిగా స్వేచ్ఛా వాయువుల్ని పీల్చడానికి,

"భయంకరకోతి నాటకం అని ఎందుకు అన్నానంటే అసలు భయంకరకోతి అనేదే లేదు కాబట్టి. ఒక స్వార్థ రాజకీయవాది ఒక వ్యక్తిని ఆ రూపంలో రంగంలోకి దింపి, మిమ్మల్ని భ్రమింపజేశాడు కాబట్టి"

వెంటనే సభలో కలకలం చెలరేగింది. "ఎవరు? ఎవరా స్వార్థ రాజకీయవాది? ఎవరు? ఎవరు? చెప్పండి" అని అరుపులు మొదలయ్యాయి.

చేతులు పైకెత్తి 'కొంచెం ఆగండి- శాంతంగా వినండి' అన్నట్లుగా ముఖ్యమంత్రి జనానికి సైగలు చేశాడు.

జనంలో సద్దుమణిగింది.

"నిజమే ఇంతటి సస్పెన్సుని భరించడం ఎవరికయినా కష్టమే. అందుకనే పాత్రల పరిచయం చేస్తాను నేను. ముందస్తుగా చిల్లర పాత్రల్ని పరిచయం చేస్తాను. ఈ పాత్రలు తెలిసి కొంత, తెలియక కొంత ఈ నాటకానికి తోడ్పడ్డవాళ్లు. నెంబర్‌వన్- మన మేయర్‌గారి సుపుత్రుడు కన్నబాబు, నెంబర్ టు అతని అనుచరుడు రౌడీషీటర్ సత్తులు..." అన్నాడు ఆనందరావు.

మఫ్టీలో వున్న పోలీసు ఉద్యోగస్థులు వాళ్లిద్దర్నీ స్టేజిమీద ఓ మూలకి తీసుకొచ్చి నిలబెట్టారు. కన్నబాబు తల భూమిలోకి దించుకుని నిల్చుని వున్నాడు. రౌడీ సత్తులుకి ఇటువంటి అవమానాలు సర్వసామాన్యమైనవే కావడంతో మామూలుగానే ధైర్యంగానే నిలబడ్డాడు.

మేయర్‌గారి కుమారుడు నేరస్తుడు అని చూపించడంతో సభలో మళ్ళీ కలకలం బయల్దేరింది.

ఈసారి కళ్యాణచక్రవర్తి చేతులెత్తి జోడించి, సభని శాంతింపచేశాడు.

"ఇప్పుడు అసలు పాత్రధారి- భయంకర కోతి మిష్టర్ ప్రకాశం" అన్నాడు ఆనందరావు.

పోలీసులు ప్రకాశంని స్టేజిమీదకు తీసుకొచ్చారు.

ప్రకాశంని చూస్తూనే జనం ఆవేశపడ్డారు. కేకలు పెట్టారు.

పోలీసు కమీషనర్, మునిసిపల్ కమీషనర్ జనానికి చేతులు జోడించి, శాంతింపజేశారు.

"ఇక అసలు వ్యక్తి, ఈ నాటక ప్రయోక్త ఈ ఒక్కరోజు గడిస్తే రేపు ఈ జనం మధ్యనే ఆత్మాహుతి చేసుకోవలసిన నిస్వార్థ రాజకీయ నాయకుడు, ప్రజాసేవకుడు శ్రీశ్రీశ్రీ దీనబంధు" అని అనౌన్స్ చేశాడు ఆనందరావు వెటకారంగా.

పెడరెక్కలు విరిచి కట్టి వుంచిన దీనబంధుని స్టేజిమీదకు తీసుకువచ్చారు.

అంతే- జనంలో ఆవేశం కట్టలు తెంచుకుంది. వెర్రి ఆవేశంతో వూగిపోతూ లేచారు. వాళ్ళని కంట్రోల్ చేయడం పోలీసులకి సాధ్యం కావడం లేదు. ముఖ్యమంత్రి, కళ్యాణచక్రవర్తి రెండు చేతులు జోడించి, స్టేజిముందు భాగానికి వచ్చి అందర్నీ శాంతించమని ప్రార్థించారు.

"ఆ నీచుణ్ణి మాకొదిలెయ్యండి. ముక్కలు

ముక్కలుగా నరికి, కాకులకీ, గద్దలకీ ఎర వేస్తాం ఆహారంగా" అంటూ అరవసాగారు పిచ్చి ఆవేశంతో.

ఆనందరావు గొంతు సవరించుకున్నాడు. గంభీర కంఠస్వరంతో స్ఫుటంగా ఉచ్చరిస్తూ, హెచ్చరిక స్వరంతో అన్నాడు, "ఆగండి! ఆవేశం కాదు ఆలోచన కావాలి! ఆలోచించండి!! అరెస్టులూ, కోర్టులూ, విచారణలూ, శిక్షలూ న్యాయం ప్రకారం, చట్టం ప్రకారం ఎలాగూ జరిగేవే. కాని ఈ విపరీత పరిణామం వెనక వున్న నేపథ్యాన్ని గమనించండి. అదీ ముఖ్యం!"

ఒక్కసారిగా సభాప్రాంగణం అంతా భయంకర నిశ్శబ్దం ఆవహించింది. ఊపిరి బిగబట్టి వింటున్నారంతా.

"ఈ సృష్టిలో మాటలు నేర్చిన జంతువు మనిషి ఒక్కడే. మాన ప్రాణాల్ని రక్షించుకోవడానికి మారణాయుధాలని తయారుచేసుకున్నదీ మనిషి ఒక్కడే. అయినా ఈరోజు తనలోని శక్తిమీద తనకే నమ్మకం లేక మానవత్వాన్ని వదిలి జంతు ప్రవృత్తిని ప్రదర్శిస్తున్నాడు. ఆదికాలంలో జంతువుల నుంచి తనని కాపాడుకోవడానికి గుహల్లో నివశించేవాడు. జంతువులు బయట తిరిగేవి. కాలక్రమేణా తన మేధస్సునుపయోగించి, జంతువుల్ని గుహల్లోకి తరిమి, తను బయటి ప్రపంచంలో స్వేచ్ఛగా జీవితం గడపసాగాడు. కాని తెలివితేటలు హద్దులు దాటి తన తోటి మానవుల్నే సంహరించడం ప్రారంభించి, తన శక్తే తన సృష్టే తనకు ఎదురుతిరుగుతుంటే- తిరిగి గుహలు, బంకర్స్‌లో దాక్కుని ప్రాణాలు కాపాడుకుంటున్నాడు. అక్కడ కూడా ఎప్పుడు తిరిగి బయట ప్రపంచంలోకి వచ్చి ఏ విధమయిన మారణహోమం సృష్టించాలా అనే ఆలోచిస్తున్నాడు. ఈ దీనబంధులాంటి మనుషులంతా ఎవరు? మనం మన చేతులారా అందలాలు ఎక్కించి ఆదరిస్తున్న వాళ్లే! హీరోలని చేసి, మన నెత్తిన తొక్కి తాండవం చేయమని మనం ఆహ్వానిస్తోన్న వాళ్లే! వీళ్లే... వీళ్లే... బింద్రన్‌వాలేలు, బిన్ లాడెన్లూ అవుతున్నారు. వీళ్ల మానవమృగాలని ప్రపంచానికి తెలిసేసరికే జరగకూడని నష్టం జరిగిపోతోంది. ఈ ప్రకాశంలూ, కన్నబాబులూ, ముగ్ధలూ వీళ్ళ చదరంగంలో అన్యాయంగా బలయిపోతున్నారు. అదుగో పులి అంటే ఇదుగో తోక అంటూ పుకార్లు వ్యాపింపజేసి, లేనిపోని భ్రమలు సృష్టించి భయానక వాతావరణాన్ని సృష్టించో, మాస్ హిస్టీరియా క్రియేట్ చేసి, కాలుతున్న కొంపల్లో మాంసముక్కల్ని కాల్చుకు తినాలని చూసే ఈ నరమృగాలను గమనించిన తక్షణమే ధైర్యంగా ఎదుర్కోగలిగితే నరమేధాలకీ, వానరమేధాలకీ సభ్యసమాజంలో తావుండదు! ఈ సమాజం బాగుపడడానికి తప్పక అవకాశం వుంటుంది. ఆలోచించండి! ఆలోచించండి! ప్లీజ్ ఆలోచించండి" అని ముగించి కూర్చున్నాడు ఆనందరావు.

"ముఖ్యమంత్రి గారిని మాట్లాడవలసిందిగా కోరుతున్నాను" అని కళ్యాణ చక్రవర్తి అనౌన్స్ చేయవలసి వుందికాని కన్నకొడుకు ఒక నేరస్తుడిగా తన పక్కనే బహిరంగ సభలో నిలబడి వుండగా చక్రవర్తి లాంటి సున్నిత హృదయుడు ఎంతగా మానసికంగా కృంగిపోతూ వుంటాడో తెలుసుకా బట్టి ఫార్మాలిటీస్‌ని పట్టించుకోకుండా ముఖ్యమంత్రి లేచి మైకు అందుకున్నారు.

"అందరికీ నమస్కారం! ఒక భయంకరమైన సమస్య నుంచి విముక్తి కలిగించినందుకు మా తరఫున, మీ తరఫున ఆ భగవంతుడికి నమస్సులు తెలియజేస్తున్నాను. ఇది ఉపన్యాసాలకు సమయంకాదు ఏం చేసినా- కార్యరూపంలో జరగాలి. యువతరానికి సంబంధించినంతవరకు కఠినంగా శిక్షించడానికి స్వతహాగా నేను వ్యతిరేకిని. అయితే చేసిన నేరాలకి న్యాయస్థానం నిర్ణయం మేరకు ఈ ప్రకాశంకి, కన్నబాబుకి

కొన్నాళ్లు శిక్ష అనుభవించక తప్పకపోయిన ప్పటికీ సమాజం వీళ్లని వుపయోగించు కుంటే ఈ యువకులు ఎంతో ప్రయోజనక రమయిన పనులే చేయగలరు. ముఖ్యంగా ప్రకాశం పెర్సనాలిటీ, చదువు, మేధస్సు జైలుగోడల మధ్య సమాధి అయిపోకూడ దని కోరుకుంటున్నాను నేను. ఏ దారిద్ర్యం కారణంగా అతను ఈ దీనబంధులాంటి దుర్మార్గుల వలలో చిక్కాడో ఆ దారిద్ర్యాన్ని పారద్రోలగలిగిన్నాడు ఇటువంటి ప్రకాశాలు మనం ఆశించే స్వర్ణ సమాజానికి గట్టి పునా దులే వేయగలరు. పరిస్థితుల ప్రాబల్యం వల్లే తప్ప ఉద్దేశపూర్వకంగా నేరం చేయ లేదు కాబట్టి ఇతనికి వీలయినంత తక్కువ శిక్ష విధించడానికి అవకాశం వుందేమో పరి శీలించవలసిందిగా న్యాయస్థానాన్ని కోరు తాను. ఇక కన్నబాబుకి, రౌడీషీటర్ సత్తు లుకీ శిక్షలు ఏమిటి అనేది న్యాయస్థానమే నిర్ణయిస్తుంది. కానీ ఈ రాజకీయ జంబూకం, పయోముఖ విషకుంభం ఈ దీనబంధుకి మాత్రం కఠినాతికఠినమైన శిక్ష పడాలని నేను కోరుకుంటున్నాను. ఏ ఒక్క రికో ఇద్దరికో కాదు కొన్ని లక్షల మందికి ఆందోళనని, దుఃఖాన్నీ కలిగించిన ఈ రాక్ష సుడికి మేక్సిమమ్ పనిష్‌మెంట్‌ని న్యాయ స్థానం విధిస్తే ఆనందించే వాళ్లలో నేను మొదటివాడిని. అందుకనే ఇటువంటి వ్యక్తుల విషయంలో మీరు జాగర్త వహిం చాలని తెలియజేయడానికే బహిరంగంగా చూపించి మరీ కోర్టులో హాజరు పరచమని ఆదేశించాను. అంతేకాదు ఈ బహిరంగ సమావేశం మరో ముఖ్యోద్దేశం అదుగో భగవంతుడు మనకు ప్రసాదించిన మహా నుభావుడు. తప్పు చేస్తే కన్నకొడుకునయి నాసరే రక్షించకుండా శిక్షించవలసిందే అని ప్రాక్టికల్‌గా ప్రపంచానికి చూపిస్తూ, సభ్యస మాజం చేత జేజేలు అందుకునే అర్హతవున్న శ్రీశ్రీశ్రీ కళ్యాణ చక్రవర్తిగారిని మనమం దరం మనసారా అభినందించడానికి కూడా..." అంటూ చేతులు బారచాపి కళ్యా ణచక్రవర్తిని ఆహ్వానించాడు ముఖ్యమంత్రి.

నమ్రతతో తలదించుకుని అడుగులో అడుగుతో ముందుకు వస్తున్న కళ్యాణచక్ర వర్తిని ఆత్మీయంగా అందుకుని గుండెలకు హత్తుకున్నాడు ముఖ్యమంత్రి.

ఆనందంతో జనం హర్షధ్వానాలు చేశారు.

ప్రకాశం, కన్నబాబు కళ్లనీళ్లతో ఆయన కాళ్ల మీద పడ్డారు. లేచి నిలబడి, జనంవైపు తిరిగి లెంపలు వేసుకున్నారు. తలలు వంచు కుని పోలీసులతో నడిచి స్టేజి దిగిపోయారు.

దీనబంధుని, రౌడీ సత్తుల్నీ పోలీసులు నెట్టుకుంటూ తీసుకుపోయారు.

"ఇప్పుడు మీ అందరి ఎదురుగా కళ్యాణ చక్రవర్తిగారు నాకు ఒక మాట ఇస్తారు" అన్నాడు ముఖ్యమంత్రి.

అందరూ ఆతృతగా ఎదురుచూడసాగారు అది ఏమిటాని.

చక్రవర్తికి ఆ మాట ఏమిటో అర్థంగాక తెల్లబోయి చూశాడు ముఖ్యమంత్రి ముఖం లోకి.

"అదేవిటంటే ఇంక ఎప్పుడూ రాజీనామా చేస్తాననే నిర్ణయం తీసుకుని మనల్ని బాధ పెట్టననీ" అంటూ నవ్వాడు ముఖ్యమంత్రి.

ఆయన మాటలకి ఆమోదం తెలియ జేస్తూ చప్పట్లు చరిచారంతా.

ఎంతో నమ్రతతో నిశ్వాసించి మొలక నవ్వు సాయంతో ముఖ్యమంత్రి చేతిలో చేయివేశాడు చక్రవర్తి ప్రమాణం చేస్తూ.

అంతే!

చప్పట్లతో, కేరింతలతో, ఆనందంతో చేస్తున్న అల్లరితో సభలో పట్టపగలే దీపా వళి జరిగింది. జనం గుండెల్లో సంక్రాంతి సంబరాలు వెల్లివిరిశాయి. మనసారా జేజేలు పలికారు కళ్యాణచక్రవర్తికి.

అదే నమ్రతతో చేతులు జోడించి నిల బడి వున్నాడు కళ్యాణచక్రవర్తి.

*

# ప్రేమా నీకు నమస్కారం పై సమీక్షలు

జనవరి 'చతుర'లో ప్రచురితమైన మీనాక్షి శ్రీనివాస్ నవల 'ప్రేమా నీకు నమస్కారం' పై మాకందిన ఉత్తమ సమీక్షలు




## సాంఘిక బహిష్కరణ

(మొదటి బహుమతి రూ. 100/- పొందిన సమీక్ష)

ప్రేమ అనేది గొప్ప అనుభూతి. ప్రతి మనిషి తన జీవితంలో ప్రేమను సద్వినియోగం చేసుకొంటే అంతకంటే అమృత తుల్యమైనది మరొకటి లేదు. అదే ప్రేమను స్వార్థంకోసం ఉపయోగించుకుంటే అంతకన్నా విషతుల్యమూ మరొకటిలేదు. జీవితం అంటే ఏమిటో తెలియని వయసులోనే తమలో కల్గిన వ్యామోహానికి ప్రేమ అని పేరు పెట్టి, కనిపెంచిన పెద్దవాళ్లను నిర్దాక్షిణ్యంగా వారి కర్మకు వదిలేసి వెళ్ళిపోతున్న ప్రేమికులు ఆ తర్వాత పడే కష్టాలను రచయిత చక్కగా వర్ణించాడు.

కథలోని కార్తీక్ చిన్నవయసులో తప్పుచేసినప్పటికి, తన తప్పును తెలుసుకొని పశ్చాత్తాపపడి తననే నమ్ముకొని సర్వం అర్పించిన రేవతిని దరిచేర్చుకోవటమే కాకుండా ప్రేమ పేరుతో వంచనకు గురైనవారిని ఆదుకుంటూ వారికి జీవితంపై ఆశను కల్పిస్తూ, ప్రేమ పేరుతో వంచిస్తున్న రాజేష్, భార్గవ్ వంటి దుష్టులకు 'సాంఘిక

బహిష్కరణ' శిక్షవేయాలని కోరడం ఆమో దయోగ్యమైనదే!

తమకెన్ని కష్టాలున్నప్పటికీ సముద్రంలా గంభీరంగా ఉంటూ, తన బాధల్ని తన మనసులోనే దాచుకుని ఎప్పుడూ నవ్వుతూ, నవ్విస్తూ అందరికీ అండగావుంటూ పెద్ద రికం అనే పదానికి ఎనలేని గౌరవం తెచ్చిన శంకరం, పార్వతమ్మల జంట ఎంతైనా అభి నందనీయమే! వీరిలాగే అందరు పెద్దలూ వ్యవహరించగలిగితే యువతకు ఎంతో తోడ్పాటునందించినట్లే!

రచయిత కథలోని ప్రతిపాత్రను తన అనుభవంలో తనకెదురైన పాత్రలనుంచే సృష్టించినట్టున్నారు, కనుకనే చాలా సహ జంగా అమరాయి!

రచయిత తన దృష్టికొచ్చిన సంఘటన లను యధాతథంగా రాసినట్లు అనిపించినా కథలో ఎక్కడా విసుగు అనేది లేకుండా చాలా ఇంట్రెస్టింగ్‌గా కథ నడిపిన విధానం అభినందనీయం. కథ చదువుతున్నంత సేపూ ప్రతి సంఘటన మన చుట్టుపక్కల జరిగే సంఘటనలా అనిపించినా, కథలో ఉన్న ఏదో మహత్తు మనల్ని చివరిదాకా చేయిపట్టి లాక్కెడుతుంది.

మంచి కథను మాకందించిన మీనాక్షి శ్రీనివాస్‌గార్కి అభినందనలు!

*– పోలిశెట్టి కిషోర్‌కుమార్*

బుచ్చిరెడ్డిపాలెం

## సమాజ సంస్కరణ

*(రెండవ బహుమతి రూ. 75/– పొందిన సమీక్ష)*

ప్రేమా! నీకు నమస్కారం. నిజంగా ఈ ప్రేమకు భక్తితోనో, భయంతోనో నమస్క రించాల్సిందే. నేటి సమాజంలో ముఖ్యంగా యువతరం యొక్క భవి ష్యత్తు ప్రేమపై ఆధారపడి ఉంది. ఉత్త మోత్తమ లక్ష్యాలతో అటు విద్యా సంస్థలు, ఇటు తల్లిదండ్రులు పిల్లల భవిష్యత్తును తీర్చిదిద్దుదామనే తరుణంలో ప్రేమ అనే మహమ్మారి వారిని కబళించి భవిష్య త్తును అంధకారం చేస్తున్నది. ఎవరైతే ప్రేమ జోలికి పోకుండా కష్టపడి చదువు తున్నారో వారు రాణించే అవకాశాలు ఎక్కువగా ఉన్నాయి. ఒక వయసు వచ్చాక ప్రేమించటంలో తప్పులేదు కానీ మరీ మైనారిటీ తీరని బాలబాలికలు ఇందులో మునిగిపోవటం ఘోరం. మీనాక్షి శ్రీనివాస్‌గారు ఇదే విషయాన్ని నవలలో పలు ఉదాహరణల ద్వారా వివ రించిన తీరు బాగుంది. ఇది ఒక సంస్క రణగా భావించవచ్చు. ఎందుకంటే 'నేటి బాలలే రేపటి పౌరులు' అలాంటి భవిష్య పౌరులను ఒక మహమ్మారినుండి రక్షిం చడం. శంకరంగారి పాత్ర మహోన్నతమై నది. అలాంటి వాళ్లు నేటి సమాజానికి చాలా అవసరం. కార్తీక్-రేవతిల సంసార జీవితం అంత మహోన్నతంగా మారడా నికి కారకులు వారే. లేకపోతే ఒక్క వీరి జీవితమేగాక మరెన్నో జీవితాలు సంస్క రించబడేవి కావు. కార్తీక్ ఒక న్యాయవా దియై తనలా ప్రేమకు బలి కాకూడదని యువతరాన్ని సరియైన దిశలో పయనిం పచేయడానికి ప్రయత్నించాడు. రేవతి-కార్తీక్‌ల అన్యోన్య దాంపత్యం ఆద ర్శనీయం. పెళ్ళి తర్వాత ఉద్భవించే ప్రేమ శాశ్వతమైనదని నిరూపిస్తుంది. కార్తీక్‌లో నిస్వార్థమయిన లాయర్ కని పించడం అభిలషణీయం. చివరికి తన భార్యచేసిన హత్యను కూడా న్యాయం దృక్పథంలో ఆలోచించి క్షమించడం. కానీ ఇక్కడ కొంచెం స్వార్థానికి తావిచ్చినట్లుగా అనిపిస్తుంది. ఎందుకంటే న్యాయ నిరూ పణ చేయాల్సింది జడ్జి కానీ లాయర్ అయిన భర్తకాదు. కార్తీక్ అనాథలను

చేరదీయడం కూడా అభినందనీయం.

– పి. లాలయ్యా
పట్లూర్

## వాస్తవ సంఘటనల సమాహారం!

*(మూడవ బహుమతి రూ. 50/– పొందిన సమీక్ష)*

జనవరి నెల 2004 చతురలో వచ్చిన 'ప్రేమా! నీకు నమస్కారం' నవల తెలిసీతెలియని వయసులో 'ప్రేమ' ఊబిలోకి కూరుకొనిపోయి జీవితాలను బలిచేసుకుంటున్న యువతరం కథే. ఈ నవలలోని అన్ని సంఘటనలు కథలు, కల్పనలు కావు. మనకు నిత్యం సమాజంలో కనిపించేవి, వినిపించేవి. అందువల్లే ఇది నవలగా కాక సహజ సంఘటనల సమాహారంగా మనకు కనిపిస్తుంది. అందుకు రచయి(త్రి)త మీనాక్షీ శ్రీనివాస్‌ను అభినందించక తప్పదు.

"అన్నీ కోల్పోయినా యింకా ఎంతో జీవితం మిగిలే ఉంటుంది" అనే విషయాన్ని కార్తిక్-రేవతిల పాత్రద్వారా రచయి(త్రి)త స్పష్టంగా చెప్పారు. అంతే కాదు జీవితంలో జరిగే తప్పులను ఎప్పటికప్పుడు సరిదిద్దుకుంటూ ముందుకు సాగిపోవాలి. అలా జరిగితే జీవితం నందనవనం అవుతుంది. కాకపోతే, ఇలాంటి తప్పుల్ని సరిదిద్దే శంకరం దంపతుల వంటి గైడ్‌లు కావాలి. అయితే యిలాంటివారు అరుదు కాని అసాధ్యం మాత్రం కాదు.

వాస్తవ సంఘటనలను నవలీకరించే యత్నంలో భాగంగా కార్తీక్ పాత్రకు హీరోయిజాన్ని ఆపాదించడం, అందుకనుగుణంగా కొన్ని సంఘటనలను సృష్టించడం మీనాక్షీ- శ్రీనివాస్ కలానికున్న బలానికి నిదర్శనం. ఆ బలమే పాఠకులను నవల వెంట పరుగులెత్తించింది. సమగ్రంగా మొత్తాన్ని చదివింపచేసింది. ఇంకా కార్తీక్ లాగ ప్రపంచ సమస్యల్ని పట్టించుకునేవారు వ్యక్తిగత సుఖాలకు దూరం కావలిసి వస్తుందని, అలా కాకుండా ఉండడానికిగాను జీవితాన్ని సక్రమంగా ప్లాన్ చేసుకోవాలని మీనాక్షీశ్రీనివాస్ చెప్పకనే చెప్పటం జరిగింది.

సాధారణంగా ప్రేమ పేరుతో స్త్రీలే వంచించబడుతుంటారని చాలామంది బలంగా నమ్ముతుంటారు. కానీ యిది నిజంకాదు. ప్రేమ పేరుతో స్త్రీలేకాదు పురుషులు కూడా వంచించబడుతుంటారు. కాకపోతే నిష్పత్తుల్లో తేడా ఉండవచ్చు ఈ విషయాన్ని అభిషేక్ పాత్ర మనకు తేటతెల్లం చేస్తుంది.

నిజానికి ప్రేమలమీద వాటివల్ల బలి అవుతున్న జీవితాలమీద రీసెర్చిచేసి రాసిన కథాంశం. ఈ నవలలో ఉపయోగించిన భాషా శైలి బహు సరళమైనది. ఎక్కడా ఎటువంటి తడబాటుగాని, తొట్రుబాటుకాని లేకుండా నవలాపఠనం సాఫీగా ముందుకు సాగిపోతుంది. 'నమ్మిన చోటే మోసం ఉంటుంది' 'తప్పు చేయడం తప్పుకాదు. ఆ తప్పు తెలుసుకొని సరిదిద్దుకోవడం, ఆ తప్పు మళ్ళీ చేయకపోవడం గొప్ప' వంటి చిరువాక్యాలతో అర్థవంతంగా నవలను నడిపించడం ఈ నవలకున్న ప్రత్యేకత.

ఇన్ని మంచి లక్షణాలున్న ఈ నవలను ప్రేమలో పడ్డవారు, పడాలనుకునే వారు, యువతరం, వారి తల్లిదండ్రులూ అందరూ తప్పక చదవాలి. రచయిత్రికి అభినందనలు!

– సయ్యద్ ఖుర్షీద్
మహబూబాబాద్

## దిశానిర్దేశం

*(నాలుగవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)*

సమకాలీన సమాజానికి దర్పణం ఈ నవల. నేటి యువతరం ఇప్పటి టీనేజ్ లవ్ సినిమాలు చూసిచూసి దాని ప్రభావంపై ఇంట్లో చెప్పాపెట్టకుండా పారిపోవటము, ప్రేమ మైకం వదిలిన తర్వాత అసలు జీవితం అర్థంఅయ్యేసరికి కష్టాలు కన్నీళ్లు. ఎందుకు ఇలా జరుగుతుంది? దీనికి పరిష్కారమేమిటి అన్న రచయిత్రి యొక్క ఆవేదనకు అక్షరరూపం ఈ నవల అని భావించవచ్చును. పరిస్థితుల ప్రభావంలో చెడువైపు కొట్టుకుపోతున్న వ్యక్తులకు చేయూతనిచ్చి వాళ్లను మంచివైపుకు మళ్ళించడం ఈ నవలలోని ప్రధానమైన ఇతివృత్తం. చెడ్డవాళ్లు ఎప్పుడూ చెడ్డగా ఉండరు. వాళ్లకు మానసిక పరివర్తన కల్గించి పరిపూర్ణ వ్యక్తులుగా మలిచితే అందరికి ఆదర్శప్రాయులుగా ఉంటారు అన్నదానికి ఉదాహరణ కార్తీక్ పాత్ర. తప్పుచేసిన వాళ్లను వాళ్ల కర్మకు వదిలేయకుండా వారికి చేయూతనిచ్చి దిశానిర్దేశం చేసిన శంకరం మాస్టారుగారిలాంటి పాత్రలు సమాజంలో అరుదుగా కన్పిస్తారు.

రాజేష్‌లాంటి వాళ్లు సమాజానికి పట్టిన క్యాన్సర్‌లాంటి వాళ్లు. వాళ్లను శిక్షించడంవలన సమాజానికి శ్రేయస్సే. నీవేమీ తప్పుచేయలేదు అని రేవతికి కార్తీక్ నచ్చచెప్పడం బాగున్నది కాని కార్తీక్‌లాంటి సమర్థుడైన లాయరు కేసుపెట్టి రేవతిని నిర్దోషిగా నిరూపించవచ్చును.

మొత్తానికి 'ప్రేమా! నీకు నమస్కారం' నవలద్వారా రచయిత్రి నేటి యువతరానికి చక్కటి పరిష్కారాన్ని సూచించారు. ప్రేమ మహిమాన్వితమైనది సరిగ్గా మలచుకుంటే, లేకపోతే మహమ్మారిలా బలిగొంటుంది అని మంచి సందేశాన్ని పాఠకలోకానికి అందించిన రచయిత్రి అభినందనీయురాలు.

– ఎన్. విజయలక్ష్మి
ఒంగోలు

## చేతులు కాలాక...!

*(ఐదవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)*

వయసులో ఉన్న ఆడ, మగ ఆకర్షితులు కావటం సహజం. దీనినే ప్రేమ అనుకుంటున్నారు. దురదృష్టకరమైన విషయం ఏమిటంటే ఈ ప్రేమికులు తమ క్షేమం కోరేవారిలో తల్లితండ్రులు మొదటివారని గుర్తించకపోవటం. చేతులు కాలాక ఆకులు పట్టుకోవటం ఈనాటి ప్రేమ కథల సారాంశం. కార్తీక్ రేవతులు- గోపాల్ మాలతిల జీవితాలని ఉదాహరణగా తీసుకొని కథ అల్లారు. శంకరం పార్వతిలాంటి దంపతులు తటస్థపడితే ఇలాంటి ప్రేమకథలు సుఖాంతం అవుతాయి. కాని అది జరగటం అరుదు. ఎన్ని సినిమాలు చూసినా, పత్రికలలో వార్తలు చదివినా, ప్రత్యక్షంగా చూసినా ప్రతిసారి ఆడది మోసపోవటం శాపంలాంటిది. ముఖ్యంగా అమ్మాయిలకి సలహా ఏమిటంటే తల్లితండ్రులనించి ఏదీ దాయరాదు. వారి సలహా నచ్చకపోతే మీ ఇష్టంవచ్చినట్టు చేయండి. అప్పుడు కష్ట నష్టాలకి మీరే బాధ్యులు అవుతారు. చేతులు కాల్చుకుని మాత్రం తల్లితండ్రులవద్దకి పోవద్దు. ప్రేమకో నమస్కారం పెట్టేబదులు ప్రేమికులారా మీకో నమస్కారం అంటే బాగుండేది.

– కె. రామారావు
హైద్రాబాద్



# చతుర కతలు

## మందు

మనవరాలికి మైనారిటీ తీరేదాకా తన నానమ్మ తనకిచ్చిన పది కోట్ల ఆస్తికి సుబ్బరావమ్మే హక్కుదారు. నానమ్మలు మనవరాళ్ళకి ఆస్తినిలా నేరుగా రాసిచ్చే చిత్రమైన సంప్రదాయం వాళ్ళ వంశంలో నాలుగుతరాలనుంచీ నిరాటంకంగా వస్తోంది. మధ్యలోనే ముసలమ్మ గుటుక్కుమంటే ఆస్తంతా ఊళ్లో ఉన్న సత్రానికే చెందాలన్నది అందులోని రూలు. అందుకే సుబ్బరావమ్మ కొడుకు అంత ఆందోళన పడుతున్నాడు. సుబ్బరావమ్మకో చిత్రమైన జబ్బొచ్చిపడింది. ఇంకో ఏడాది గడిస్తేగానీ మనమరాలు మేజర్ కాదు. అంతదాకా సుబ్బరావమ్మ ఎలాగైనా బతికుండాలి. అలా బతకాలంటే ఆమె నరాలు మెత్తబడాలి. నరాలు మెత్తబడాలంటే ఏడవాలి. బాగా ఏడవాలి. అది సుబ్బరావమ్మకు చేతగాని పని.

సుబ్బరావమ్మకు ఏడవడం అస్సలు తెలియదు. తల్లి కడుపులోనుండి బైటకు రాగానే ఎవరైనా కేర్‌కేర్‌మని ఏడుస్తారుగదా. ఈవిడ 'ఐ డోంట్ కేర్' అంటూ- నిశ్శబ్దంగా ఉండిపోయిందట. దయ్యంపిల్లేమో అని



ఇంట్లో వాళ్ళందరూ శాంతులు చేయించినా ప్రయోజనం లేకపోయింది.

సుబ్బరావమ్మ పదమూడో ఏట తండ్రి చనిపోయాడు. ఇంట్లో అందరూ గుండెలు బాదుకుంటూ ఏడుస్తుంటే సుబ్బరావమ్మకు చీమ కుట్టినట్లయినా లేదేమో. సుబ్బరంగా తిరిగింది.

సుబ్బరావమ్మకి కష్టాలు రావనికాదు. ఏడవడం ఎలాగో తెలీదు పాపం అదీ ప్రా

బ్లమ్.

నవ్వూ నాలుగు రకాల చేటు. ఏడిస్తే ఎంచక్కా గుండెల బరువు తీరిపోతుందని ఎంతమంది చెప్పి చూసినా... ఊహూ... ఒక్క కన్నీటి బొట్టయినా రాలితే ఒట్టు.

పోనీలే పెళ్లయి అత్తారింటికెళితే దీని తిక్క కుదురుతుందిలే అనుకున్నారందరూ. అత్తగారికే తిరిగిందా తిక్క. ఎప్పుడూ ఏడవకుండా ఉండే కోడల్ని చూసి ఆ అత్తగారికి తిక్క ఎక్కువై... మరింత కోడలికం పెట్టింది. అయినా సుబ్బరావమ్మ చెక్కిళ్ళు చెక్కు చెదరలేదు.

మొగుడనే మహానుభావుడు ఒక్కసారన్నా పెళ్ళాన్ని ఏడిపించకుండా ఉంటాడా? అందులోనూ సుబ్బరావమ్మ మొగుడు పరమ భ్రాష్టుడు. తాగుడూ, పేకాటా, తిరుగుళ్ళూనూ. తెల్లారి కొంపకొచ్చి పెళ్ళాన్ని చితకబాదేవాడు. అయినా కిమ్మనేదికాదు. ముక్కుచీదెరగదు.

పిల్లలు వరసగా పుట్టిపోతున్నప్పుడైనా సుబ్బరావమ్మకసలు చీమ కుట్టినట్టయినా ఉండేదికాదంటే ఆమె అసలు నిజంగా ఆడదేనా? అని. సృష్టించిన బ్రహ్మదేవుడే నుదురు బాదుకొని ఉండి ఉండొచ్చు.

పెళ్ళాం వైఖరికి విసుగేసి మొగుడు పట్టించుకోవడం మానేశాడు. అత్తగారు బెదిరి దూరంగా ఉండేది. ఆడపడుచులు వదిన వైపే ఆశగా చూస్తుండేవాళ్ళు ఎప్పటికైనా తమ ఆశ నెరవేరకపోతుందా అని.

కాలచక్రం గిర్రున తిరిగింది. సుబ్బరావమ్మ ఇప్పుడు అత్తగారయింది. కోడలు పెట్టే హింస సహించలేనిది. అయినా అలాంటివాటిని తట్టుకుని నిలబడడం ఆమెకు వెన్నతో పెట్టిన విద్య.

హఠాత్తుగా సుబ్బరావమ్మకొక కొత్త రకమైన నరాల జబ్బు వచ్చిపడింది. ఆ వ్యాధికి ఇంతవరకూ వైద్యరంగంలో మందే కనుక్కోలేదుట. 'రోజులు లెక్కించుకోవచ్చు' అన్నారు డాక్టర్లు. కొడుకు గుండెలో రాయి పడింది. ముసలమ్మింకా కనీసం ఒక ఏడాదైనా బతకాల్సిన అవసరముంది.

అన్నిరకాల వైద్యాలూ అయ్యాయి అల్లోపతి దగ్గర్నుంచీ నేచురోపతిదాకా. ఆమె ఏడిస్తేగానీ జబ్బు నిదానించదు. భూమండలం మీదున్న వైద్యవిజ్ఞానం మొత్తం ఈ సుబ్బరావమ్మని ఏడిపించడం నావల్లకాదని నిస్సహాయంగా చేతులెత్తేసింది.

బట్... ఇండియా ఈజ్ ఎ లాండ్ ఆఫ్ మిరకల్స్... యూ నో. సాధ్యాలు అసాధ్యాలుగా, అసాధ్యాలు సుసాధ్యాలుగా చేయగల మహానుభావులింకా ఈ భూమ్మీద జీవిస్తూనే ఉన్నారు. ఆ కోవకు చెందినవారే 'చైనాబాబా'. హిమాలయాలనుంచి హిందూ మహాసముద్రందాకా పాదయాత్ర చేసి తిరుగు దారిలో ఆ ఊరిసత్రంలో దిగారని తెలిసి సుబ్బరావమ్మ కొడుకెళ్ళి బావురుమన్నాడు.

. విషయమంతా ఆసాంతం విని సాలోచనగా తలూపి కొడుకు చెవిలో ఏదో ఊదాడు చైనా బాబాగారు.

వాకిట్లో వేసున్న సుబ్బరావమ్మ మంచం నట్టింట్లోకి మారింది. వారం రోజులయింది. రోగిలో ఏ మార్పూలేదు.

ఆ రోజు ఆదివారం ఇంటిల్లిపాదీ తీరిగ్గా కూర్చుని టీవీ చూస్తున్నారు. ఏడుపు సీరియల్ ఇంట్రెస్టుగా నడుస్తోంది. ఎప్పుడూ టీవీకేసి చూడని సుబ్బరావమ్మ హఠాత్తుగా తలతిప్పి టీవీకేసి తేరిపార చూసింది. అంతలో కరెంటుపోయింది. ఘొల్లుమని గోల వినపడింది. ఆ వింత శబ్దాన్ని ఇంట్లో ఇంతవరకూ ఎవరూ విని ఉండలేదు. కంగారుగా అందరూ సుబ్బరావమ్మ మంచంచుట్టూ చేరారు. సుబ్బరావమ్మ ఏడుస్తోంది. భయంకరంగా ఏడుస్తోంది. గుండెలు బద్దలయ్యేలా ఏడుస్తోంది. ఆగకుండా ఆమె ఏడుస్తుంటే ఆనందంతో గంతులేస్తున్నారంతా. ఇంక ముసలి ప్రాణానికి ప్రమాదంలేదు. ఆస్తికి ఢోకాలేదు.

'అరవై ఏళ్ళపాటు సృష్టిలోని ఏ ఉత్పా

తమూ కరిగించలేని ఆ కరడుగట్టిన పాషాణ హృదయాన్నిలా కరిగించి వరదలా పారించగలిగిన టీవీ సీరియలా! నీకు జోహారు... జోహారు. జనాలనేడిపించగల శక్తి మరి నీకు గాక... ఇంకెవరికి ఉంటుంది' అని ఇంట్లో అందరూ అలా గంతులేస్తున్నారు.

– కర్లపాలెం హనుమంతరావు

---

# మనసులోని మాట

వెన్నెలను వెదజల్లే పూర్ణచంద్ర బింబం లాంటి ముఖం ఆమెది. ప్రశాంతంగా పలకరించే ఆ కళ్లు, చిద్విలాసంగా నవ్వే ఆ పెదవులు, పచ్చగా మెరిసే నున్నని చెక్కిళ్లు అన్నీ కలిపి అజంతా శిల్పంలా వుంటుంది ఆమె.

ఆ రోజు అపూర్వ లాన్‌లో పచ్చని పువ్వుల మొక్కల మధ్య పచార్లు చేస్తోంది.

"హాయ్! అపూర్వా" జగన్ పలకరించాడు.

"హలో! ఎప్పుడొచ్చారు? " సుతారంగా నవ్వింది.

"నిన్ననే వూర్నించి వచ్చాను. ఈ రెండు రోజులు రెండు యుగాల్లా గడిచాయి నాకు. నీకెలా అనిపిస్తోంది? నేను మా వూర్లో వున్నంతసేపూ అమ్మానాన్న వూరికే గొడవ పెట్టేశారు నా పెళ్లి గురించి. 'ఏంట్రా జగన్! పెళ్లి మాట ఎత్తితే వులకవు, పలకవు? ఇంజనీరింగు అయిపోయింది. మంచి కంపెనీలో స్థిరపడ్డావు. ఇహ పెళ్లికి అడ్డు చెప్పకు. నీ మనసులో ఎవరైనా వుంటే చెప్పు. నీ మనసుకి నచ్చిన అమ్మాయిని చేసుకుంటానంటే మాకెలాంటి అభ్యంతరం లేదు' అంటూ గొడవ" గలగలా మాట్లాడేస్తున్నాడు జగన్.

అపూర్వ అందంగా నవ్వింది. కానీ మాట్లాడలేదు.

"ఏంటి అపూర్వా! మాట్లాడితే నోటి ముత్యాలు రాలిపోతాయా? "

"అదేం లేదు జగన్. మీరు మాట్లాడుతూంటే వింటున్నాను. ఊ... చెప్పండి. ఇంకేమిటి విశేషాలు"

లాన్‌లో పచ్చిక మధ్యనున్న కేన్ కుర్చీలో కూర్చుని మాట్లాడుకుంటూ వుండగా ప్రభాకర్ వచ్చాడు అక్కడికి.

"హలో ప్రభాకర్! గ్లాడ్‌టూ మీట్ యూ" నవ్వుతూ కరచాలనం చేశాడు జగన్.

ప్రభాకర్ ఎమ్. బి. బి. ఎస్, హౌస్‌సర్జన్ పూర్తి చేసి విశాఖపట్నంలో ప్రాక్టీస్ పెట్టాడు. ప్రాక్టీసు బాగుంది.

"అపూర్వా! డాడీ ఇంట్లో లేరా? " అపూర్వని తదేకంగా చూస్తూ అడిగాడు ప్రభాకర్.

"లేరు. ఏదో పని మీద బయటకు వెళ్లారు" అంది అపూర్వ కాఫీని కప్పుల్లో పోసి ఇద్దరికీ ఇస్తూ.

అదొక విచిత్ర పరిస్థితి ముగ్గురిదీ.

జగన్ ఇంజనీరు. ప్రభాకర్ డాక్టరు.

ఇద్దరూ ఆమెను ప్రేమిస్తున్నారు. కానీ ప్రేమే జీవితం కాదని, వృత్తినీ ప్రధానంగా భావించిన వాళ్లిద్దరికీ తెలుసు. అందుకే తమ ప్రేమని ఏవిధంగా వ్యక్తం చెయ్యాలో తెలియక తటపటాయిస్తున్నారు.

ఇద్దరూ మంచివాళ్లు! సంస్కారవంతులు! సహృదయులు! ఆమెని పెళ్లి చేసుకోవాలనే ఆలోచన ఇద్దరికీ వుంది.

అపూర్వ నిండు గోదావరి!

ప్రశాంత సరోవరం లాంటి ఆమె మనసు దేనికీ తొందరపడదు.

ఇద్దరిలో ఎవర్ని చేసుకున్నా ఆమెకు ఆమోదమే. అందుకే నిర్ణయాన్ని అమ్మానాన్నలకి వదిలేసి ఆమె నిశ్చింతగా వుంది.

కాని టెన్షనంతా జగన్, ప్రభాకర్‌లదే.

ఇద్దరికీ మంచి చదువు సంస్కారంతో

పాటు చక్కటి పర్సనాలిటీ కూడా వుంది.

ఇద్దరిలో ఆమె ఎవర్ని ఎన్నుకుంటుంద న్నది వాళ్లకి అర్థం కాని విషయం. మనసు లోని మాటని ఎలా చెప్పాలో తెలియక ఇద్దరూ సతమతమవుతున్నారు. ప్రభాకర్ కొంతసేపుండి వెళ్లిపోయాడు.

ప్రభాకర్ వెళ్లిపోయాక జగన్ అన్నాడు "నేను కంపెనీ పనిమీద మళ్లీ ముంబయి వెళ్లాలి"

"ముంబై చాలా బాగుంటుంది. మా అంకుల్ వున్నారక్కడ" అంది అపూర్వ.

"నేనక్కడ ఏడు రోజులుండాలి. దేవిగారి దర్శనం మళ్లీ ఏడు రోజుల తర్వాతే" జగన్ అన్నాడు.

అపూర్వ నవ్వింది.

జగన్ కొంతసేపాగి తన బ్యాగ్‌లోంచి ఏడు ఏపిల్‌పళ్లు తీసి టేబుల్ మీద పెట్టి "అపూర్వా! ఇవి నీ కోసం తెచ్చాను తీసుకో" అన్నాడు.

"నాకెందుకిప్పుడు?" అంది అపూర్వ.

"నా మనసులోని మాట ఈ ఏపిల్ పళ్లల్లో దాక్కుని వుంది" అన్నాడు నవ్వుతూ.

తర్వాత మరి ఎక్కువసేపు మాట్లాడ కుండా జగన్ వెళ్లిపోయాడు. జగన్ మనసు తేలికపడింది. ఇన్నాళ్లకి ఈవిధంగా తన మనసులోని మాటని చెప్పగలిగాడు అనుకు న్నాడు.

అపూర్వ చాలా తెలివైనది! జగన్ ఎంత సున్నితంగా తన మనసులోని మాటని వ్యక్తం చేశాడో అర్థం చేసుకున్న అపూర్వ అతని సూక్ష్మ బుద్ధికి ఆశ్చర్యపోయింది.

"ఏన్ ఏపిల్ ఎ డే కీప్స్ ది డాక్టర్ ఎవే"

జగన్ వూర్లో వుండని ఏడు రోజులకి ఏడు ఏపిల్ పళ్లు, రోజుకొక ఏపిల్ పండు



తిన్న అపూర్వకి డాక్టర్ని కల్సుకోవల్సిన అవ సరం వుండదు! ఎంత చక్కటి వివరణ! పరోక్షంగా "నువ్వు డా. ప్రభాకర్‌ని కల్సు కోకు" అని చెప్పినట్టే కదా! అపూర్వ జగన్ చిలిపితనానికి, తెలివితేటలకి చాలా సంతో షించింది. త్వరలోనే వాళ్లిద్దరికీ వివాహం జరిగిపోయింది.

– న్యాయపతి కమలారాంజి

# FORM IV (See Rule 8)

Statement about ownership and other particulars of CHATURA.

| | | |
|---|---|---|
| 1. Place of Publication | : | 6-3-570, Eenadu Compound, Somajiguda, Hyderabad-500 082. |
| 2. Periodicity of its Publication | : | Monthly |
| 3. Printer's Name | : | **RAMOJI RAO** |
| Whether citizen of India | : | Yes |
| If foreigner, state the country of origin | : | - |
| Address | : | 6-3-570, Eenadu Compound, Somajiguda, Hyderabad-500 082. |
| 4. Publisher's Name | : | **RAMOJI RAO** |
| Whether citizen of India | : | Yes |
| If foreigner, state the country of origin | : | - |
| Address | : | 6-3-570, Eenadu Compound, Somajiguda, Hyderabad-500 082. |
| 5. Editor's Name | : | **RAMOJI RAO** |
| Whether citizen of India | : | Yes |
| If foreigner, state the country of origin | : | - |
| Address | : | 6-3-570, Eenadu Compound, Somajiguda, Hyderabad-500 082. |
| 6. Name and address of individuals who own the newspaper and partners or shareholders holding more than one percent of the total capital. | : | **VASUNDHARA PUBLICATIONS** 6-3-570, Eenadu Compound, Somajiguda, Hyderabad-500 082. |

I, RAMOJI RAO, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

**for VASUNDHARA PUBLICATIONS**
**Sd/- RAMOJI RAO**
Publisher

Date: March 1, 2004

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd., Hyderabad, Tel: 23730328, Office Address: CHATURA, Telugu Monthly, Eenadu Complex, Somajiguda, Hyderabad. Tel: 23318181, 23398787; Visakhapatnam: 2552211; Vijayawada: 2494900; Tirupati: 275757; Anantapur: 273444; Karimnagar: 223216; Rajahmundry: 2468991; Suryapet: 221146; Guntur: 2512142; Nellore: 2338734; Srikakulam: 220901; Kurnool: 252813; Cuddapah: 270011; Tadepalligudem: 228881; Warangal: 2559901; khammam: 255661; Nizamabad: 245661; Mahabubnagar: 276376; Ongole: 256777; New Delhi: 23753440; Mumbai: 22819557; Chennai: 28232390; Bangalore: 25583804.

CHATURA Telugu Monthly Hyderabad-500 082 Regd No. H/HD/965/2003-2005 RN1/32186/78





# రుచి పచి లేని
# రోజులకిక గుడ్ బై...

అసలైన సాంబారు రుచి, రసంలోని ఘుమఘుమలు మర్చిపోలేని గరంమసాలా ఘాటు. ఇప్పుడు మీ అభిమాన 'ప్రియ' అందిస్తోంది ఇవన్నీ. మెరుగైన నాణ్యత, మర్చిపోలేని రుచులతో వస్తున్నాయి 'ప్రియ' వారి సాంబారు, రసం, గరంమసాలా పొడులు. ఒక్కసారి వండిచూడండి.

మీ 'ప్రియ' రుచుల్ని ఆస్వాదించండి.






**priya**

*Masala Powders*

• సాంబారు పొడి • రసం పొడి • గరంమసాలా పొడి